# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 20 సంచిక : 5 హైదరాబాద్ 246 మే 2022 పేజీలు : 60 రు. 25

- రియల్ ఎస్టేట్ కోసమే జీవో 111 రద్దు
- తెలంగాణ నిరుద్యోగ సమస్య తీరేనా?
- ఆంధ్రప్రదేశ్ సంక్షేమ పథకాలపై ఆంక్షలు
- కన్నీళ్లతో రాజకీయ వ్యాపారం 'కశ్మీర్ ఫైల్స్'
- కర్ణాటకలో హిందుత్వ బలపడిన తీరు
- మే డే ఉద్యమంలో రాడికల్ భావజాలం
- పాకిస్తాన్ రాజకీయ పరిణామాలు

246 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

మే 2022
సంపుటి : 20
సంచిక : 05







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 7330795849
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : నవ్య ప్రింటర్స్
అంబర్‌పేట్, హైదరాబాద్.

వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై **'VEEKSHANAM'** అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్-**013911011002175** యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **IFSC code :UBIN0801399** నెంబర్‌తో పాటు మీ పేరు కూడా రాసి వేయాలి.

*వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ ఆర్థిక సహాయం అందించిన రోహిత్, హైదరాబాద్ – రు. 10,000; బి. రమాసుందరి, ఒంగోలు – రు. 2,000; ఎర్రగుంట అశోక్ కుమార్, సంగారెడ్డి – రు. 5,000; ఒక శ్రేయోభిలాషి – రు. 5,000; మిత్రులకు కృతజ్ఞతలు – సం.*

*వీక్షణం 2022 మార్చి నెల సంచికలో యు.ఎ. ఖారిన్ రచించిన తత్వశాస్త్ర పుస్తకానికి సంబంధించి అనువాదం విషయంలో ఎస్. జనార్దన్ మంచి సూచన చేసారు. సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ ఇరవయ్యవ కాంగ్రెస్ (1956) తర్వాత సోవియట్ యూనియన్ నుండి వచ్చిన పుస్తకాలను అధ్యయనం చేసేటప్పుడు తగు జాగ్రత్తలు తీసుకోవలసిందే. అందులో ఏమాత్రం సందేహం లేదు. మార్చ్ సంచికలో ప్రచురితమయిన అధ్యాయాన్ని అనువాదం చేస్తున్నప్పుడు నాకూ ఈ విషయం స్ఫురించింది. కాని అనువాదకునిగా నేను ఎంత మేరకు స్వేచ్ఛ తీసుకోగలను అన్న సంశయమూ ఉండింది. 'శాంతియుత పోటీ', 'శాంతియుత సహజీవనం', శాంతియుత పరివర్తన'లను బోధిస్తూ సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ మార్క్సిజానికి దూరమైందన్న విషయాన్ని ఉటంకిస్తూ, 1956 తర్వాత సోవియట్ యూనియన్ నుండి వచ్చిన పుస్తకాల విషయంలో జాగ్రత్తలు పాటించాల్సి ఉంటుందన్న 'నోట్' ఒకటి ఇస్తే సరిపోతుంది అన్న అభిప్రాయానికి కూడా వచ్చాము. కాని, కొన్ని సాంకేతిక కారణాల వలన ఆ 'నోట్' అనువాదానికి జత కాలేదు. అంతే కాని, 'వీక్షణం' కలెక్టివ్ ఆలోచనా ధోరణిని శంకించాల్సిన అవసరం లేదు. భవిష్యత్తులో ఆ జాగ్రత్తలు తీసుకుంటాము.*

*జనార్దన్ గారు వ్రాసిన లేఖ కొంత తీక్షణంగా ఉన్నా, ఇలాంటి స్పందనే మేము పాఠకులనుండి కోరుకుంటున్నాము. అసంబద్ధంగా కనిపించిన విషయాలను కచ్చితంగా విమర్శిస్తేనే 'వీక్షణం' రచయితలు గాని, అనువాదకులు గాని తమ్ముతాము సరిచేసుకుంటూ పాఠకులకు శాస్త్రీయమయిన ఆలోచనలతో కూడిన రచనలను అందించగలరు. ధన్యవాదాలు.*

**– రాజేంద్రబాబు అర్విణి**

*వీక్షణం కలెక్టివ్ సభ్యుడు, అనువాదకుడు*

*వీక్షణంలో ప్రచురించిన రచనలపై చర్చించే బదులు కొందరు పాఠకులు, అభిమానులు ఫలానా రచనలని ఎందుకు వేసారు అని ప్రశ్నిస్తూ లేఖలు రాస్తున్నారు. ఈ క్రమంలోనే కొందరు ఫలానా వారి రచనలెందుకు ప్రచురిస్తున్నారు అన్న రీతిలోనూ ప్రశ్నిస్తున్నారు. ఏ రచననైనా, చర్చావ్యాసాన్నయినా సంపాదకులు తమవిధానం ప్రకారమే, అనేక కోణాల్లో ఆలోచించే ప్రచురిస్తారని భావించాలి. విశాలదృష్టి పేరుతో పత్రిక తన 'మూలసూత్రాలను' మరచిపోతోంది అన్న అనుమానం (ఉదా: ఎస్. జనార్దన్) వస్తుందన్న కొన్ని విమర్శలను ఇటీవల ప్రచురించారు. ఆయా విషయాలపై సంపాదకవర్గ అభిప్రాయాలు ఎలా వున్నా, పత్రికలోని రచనల ప్రచురణకు సంబంధించిన మౌలిక సూత్రాన్ని, లక్ష్యప్రకటనను ప్రతిసంచికలో విషయసూచికతో పాటు ప్రచురిస్తున్నదే తెల్సిన విషయమే. సంపాదకులకు 'ఏకీభావం వుండనవసరం లేదు'బీ ఒక సమగ్ర 'విశ్లేషణవేదికగా అన్ని రకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలి..' ఇవే మౌలికసూత్రాలు. వాటిని అనుసరించి నిలబడటానికి 20 ఏళ్ళుగా కృషిచేస్తున్న వారిని 'అనుమానించటం', ఖండించడం తప్పు. పత్రికకు పరిధి (స్కోప్), పరిమితి వుండేది నిజమే కానీ 'ఎడిటోరియల్ కలెక్టివ్'లో అందరికీ ఒకే మూస అభిప్రాయాలున్నాయని కూడా భావించలేం. వైవిధ్యం సహజం. 20 సంవత్సరాల్లో కొన్ని వందలమంది రాసారు. అందులో ఎవరు, ఎందరు 'బైటనుంచి' రాసినవారు? ఎవరు, ఎందరు లోపలివారు? ఈ చర్చే అర్థరహితం, అనారోగ్యకరం. పత్రిక వ్యవస్థాపక సంపాదకులు హనుమంతరావు దాదాపు 14 ఏళ్ళు పత్రిక నిర్వహణలో పాల్గొని, వందలాది వ్యాసాలు రాసారు. వారివి, ప్రస్తుత సంపాదకులవి అనేక విషయాల్లో (ఉదా.కి ప్రత్యేక తెలంగాణ) ఒకే అభిప్రాయాలు కావు. 'ప్రజాపక్ష జర్నలిజంలో, రాజకీయ, ఆర్థిక, పత్రికారచనలో అత్యున్నత ప్రయోగాల పత్రిక' వారి కల అని, అలాగే ప్రామాణికంగా నిర్వహిస్తామని వీక్షణం కలెక్టివ్ అనేకసార్లు ప్రకటించింది. ఆ విధంగానే అనేక అభిప్రాయాల భావఛాయలతో కూడిన రచనలను ప్రచురిస్తూ వచ్చింది. అంతేకాక తమ సంపాదకీయాలపైనా, వరవరరావు, సి. యస్. ఆర్. ప్రసాద్ వంటి ప్రముఖుల, సీనియర్ల వ్యాసాలపైనా వివరమైన విమర్శలను అనేకంగా ప్రచురించిన విశిష్టతను సంతరించుకొన్నది. ఆ క్రమంలోనే 'విశ్లేషణా ' వేదికగా రూపొందింది.*

*ఇది ఏదో ఒక పార్టీ పత్రిక కాదు. వివిధ ఎం.ఎల్.గ్రూపుల మధ్య చర్చకు వేదికా కాదు. వారివేకాక, వారిని విమర్శించే లేదా వ్యతిరేకించే దళిత, బహుజన, ఆదివాసీ, ఫెమినిస్టు, 'సోషలిస్టు' రాజకీయ శక్తులుబీ పరిసరవాద రచనలు, ఆధునికానంతర భావజాల అనుకూల–ప్రతికూల రచనలు, అంబేద్కర్ వాద అనుకూల, వ్యతిరేక భావనలు, ప్రత్యేక తెలంగాణావాదాన్ని విమర్శించిన రచనలు, ఇలా అనేక రచనలు వచ్చాయి. భారత రాజ్యాంగాన్ని విమర్శించే, సమర్థించే, దేశంలో భూస్వామ్యవిధానం లేదు అని వివరించిన రచనలూ వచ్చాయి. రంగనాయకమ్మ గారిని సమర్థిస్తూ, విమర్శిస్తూ అనేకసార్లు రచనలు, లేఖలూ వచ్చాయి. మావోయిస్టు ఉద్యమంలో పేరుగాంచిన వారినేకాక, తర్వాత వివాదాస్పదుడైన కొండపల్లిని కీర్తించిన రచనలూ ప్రచురించారు. రాజ్యవ్యవస్థలో భాగమైన అధికారులు, జడ్జీలు, ఖైదీలు రాసిన రచనలు, మావోని, మావో నేతృత్వంలోని చైనాను వ్యతిరేకించిన 'సోషలిస్టు క్యూబా' గురించి, దక్షిణ అమెరికాలోని 'సోషలిస్టు'ల గురించి సానుకూల రచనలూ ప్రచురించారు (సంపాదకీయాలు కూడా).*

*'వాస్తవాల ఆధారంగా సత్యాన్వేషణే' మార్క్సిజం మూలసారంబీ మార్క్సిజం పిడివాదంకాదు, కార్యాచరణకు మార్గదర్శి మాత్రమే – అన్న మావో మార్గదర్శనం పలువురికి శిరోధార్యం. ఆచరణ గొప్ప గీటురాయి. దేశ, ప్రపంచ రాజకీయాలు చాలా సంక్లిష్టతలతో వేగంగా మారుతున్నాయి. భావాల ఘర్షణనుంచే సత్యం నిగ్గుదేలుతుంది, స్పష్టత కూడా పెరుగుతుంది. వాటివల్ల 'విలువైన' పత్రిక విశిష్టత పెరిగిందే కాని, తగ్గలేదు. స్పూన్ ఫీడింగు రచనల కోసం కాక, ఇలాటి చర్చల కోసమే అనేకులు పత్రికలను చదువుతుంటారుబీ టీవీల్లో రోజూ చర్చల్ని చూస్తుంటారు. కాబట్టి ఫలానాది ఎందుకు వేసారన్న అసహనం, సంపాదకులను నిందించటం మంచిది కాదు.*

**– ఒక పాఠకుడు**

*(ఇ మెయిల్ ద్వారా)*

కోవిడ్ వల్ల పత్రికలలో సాధారణ వార్తలు రావడం లేదు గనుక అసహజ మరణాల సూచి సమగ్రంగా తయారు చేయడం సాధ్యం కావడం లేదు. కొద్దికాలంగా అసహజ మరణాల సూచి వేయలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

వీక్షణం

# సాంస్కృతిక జాతీయవాదపు అసలు రూపు బుల్డోజర్!

భారత సమాజపు విభిన్న సంస్కృతుల బహుళత్వాన్ని తొక్కేస్తూ ఒకే జాతి, ఒకే దేశం, ఒకే మతం, ఒకే భాష, ఒకే ఆచారవ్యవహారాలు అనే ఏకశిలాధిపత్యాన్ని స్థాపించడానికి 'సాంస్కృతిక జాతీయవాదం' అనే సిద్ధాంతాన్ని ప్రవచించింది రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్. దాని పరివారం ఆ సిద్ధాంతంతో దేశంలో హిందూ బ్రాహ్మణీయ ఫాసిజాన్ని అమలు చెయ్యడానికి, మనుస్మృతిని దేశ సాధారణ ధర్మంగా మార్చడానికి, మత మైనారిటీల పట్ల, ప్రత్యేకించి ముస్లింల పట్ల ద్వేషాన్ని రెచ్చగొట్టడానికి, కుల వివక్షను బలోపేతం చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వ అధికారం చేజిక్కినతర్వాత ఆ సిద్ధాంతం ఇంకెంత మాత్రమూ మాటగా, ప్రచారంగా మిగలలేదు. అంతకు ముందు నుంచే అలవాటైన హింసా ధోరణులను, దుందుడుకుతనాన్ని ఇప్పుడు పెద్ద ఎత్తున కొనసాగిస్తున్నారు. సాంస్కృతిక జాతీయవాదం అనే మేలిముసుగు తొలిగిపోయి విధ్వంసక, విద్వేషరూపం బైటపడుతున్నది. ఈ ఎనిమిది సంవత్సరాల్లో వరుస పెట్టి ఒక్కొక్క వ్యవస్థ మీద బుల్డోజర్ నడిపించి ధ్వంసం చేసే పని విజయవంతంగా చేస్తూ వస్తున్నారు. పాలనా వ్యవస్థను, విద్యావ్యవస్థను, సిబిఐ, ఐటి, ఇడి, ఎన్ ఐ ఎ వంటి ప్రభుత్వ సంస్థలను ధ్వంసం చేసి, వాటిని సంఘ్ పరివార్ శక్తులతో నింపివేశారు. న్యాయవ్యవస్థను ధ్వంసం చేశారు. భారత సామాజిక అధికారిక వ్యవస్థలన్నిటినీ ధ్వంసం చేసి ఆ శిథిలాల మీద అధికారాన్ని నాగపూర్ కు అప్పగించారు. ఒక్కమాటలో చెప్పాలంటే బుల్డోజర్ సంస్కృతినే సాంస్కృతిక జాతీయవాదానికి మారుపేరు చేశారు.

ఇంతకాలం భావజాలంలో ఉండిన బుల్డోజర్ క్రమంగా భౌతిక యంత్రం రూపంలోకి మారుతున్న పరిణామం ఇటీవల పెద్ద ఎత్తున కనబడుతున్నది.

గతంలో కనబడని బుల్డోజర్ ఫలానా తిండి తినొద్దు, ఫలానా బట్ట కట్టొద్దు, ఫలానా భావాలు ఉండొద్దు, ఫలానా రచనలు చేయొద్దు, నెత్తిమీద ముసుగు వేసుకోవద్దు, నీ భాష మాట్లాడొద్దు, నీ దేవునికి ప్రార్థన జెయ్యడానికి మైకు పెట్టొద్దు, అసలు నీ దేవునికి ప్రార్థనే చేయొద్దు, మా దేవుని ముందర పూలు అమ్మొద్దు అని ఒత్తిడి తెస్తుండేది. ఎందరో ఆలోచనాపరులను, ఎన్నో సున్నితమైన భావనలను, ఎన్నో జీవన దృశ్యాలను ఆ బుల్డోజర్ అణచివేసింది. ఇప్పుడిక నాల్గు పడగల హైందవ నాగపూర్ నడుపుతున్న ఆ బుల్డోజర్ వెయ్యిపడగల దుర్మార్గపు కోరలు విప్పి విషం చిమ్ముతూ దేశం మీద పరుగులు పెడుతున్నది. సర్వసంగ పరిత్యాగిగా కాషాయ దుస్తులు ధరించిన దొంగ సన్యాసి ముఖ్యమంత్రి వేషంలో బుల్డోజర్ బాబాగా పేరు తెచ్చుకున్నాడు. తనకు వోటేయని వారిమీదికి బుల్డోజర్ నడుపుతానని బహిరంగంగా, నిస్సిగ్గుగా ప్రకటించాడు. ఆ బుల్డోజర్ అక్కడ ఆగలేదు. అబద్ధపు ఆరోపణలతో, ఆరోపితులకు శిక్ష విధించాలంటూ, ఆరోపితుల ఇళ్ల మీదికి, చిరు వ్యాపారాల మీదికి, ప్రార్థనాస్థలాల మీదికి బుల్డోజర్ దూసుకొస్తున్నది. ఆరోపణ చేసేదీ, దర్యాప్తు చేసేదీ, విచారణ జరిపేదీ, శిక్ష విధించేదీ అన్నీ వారే. గంటల్లో, లేదా రోజుల్లో ఆరోపితులు శిక్షకు గురవుతారు. మూకస్వామ్యపు, అన్యాయపు, దుర్మార్గపు, ఏకపక్ష నిర్దాక్షిణ్యపు దారిలో న్యాయం, చట్టం, నాగరికత, ప్రజాస్వామ్యం అన్నీ బుల్డోజర్ కింద నేలమట్టమైపోతాయి. కర్ణాటకలో అదృశ్య బుల్డోజర్ సాగుతుండగానే ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, గుజరాత్, ఢిల్లీలలో భౌతిక బుల్డోజర్ బీభత్సం ప్రారంభమయింది. హిందువుల ఊరేగింపు మీద రాళ్లు విసిరారనే అబద్ధపు ఆరోపణతో మధ్యప్రదేశ్ లోని ఖర్గోన్ లో ముస్లింల మీద దాడి మొదలయింది. రాళ్లు విసిరినవారి ఇళ్లు రాళ్ల కుప్పలుగా మార్చేస్తాం అని రాష్ట్ర హెూం మంత్రి బహిరంగంగా అన్నాడు. వెంటనే అధికారులు బుల్డోజర్లు నడిపి యాభై ముస్లింల ఇళ్లు ధ్వంసం చేశారు. రాళ్లు విసిరిన ఘటన నిజమే అయినా, దేశంలో ఉన్న చట్టాల ప్రకారం "సకారణమైన సందేహాలన్నిటినీ తీర్చిన తర్వాతనే", "చట్టం నెలకొల్పిన ప్రక్రియ తర్వాతనే" నేరస్తులు నిర్ధారణ కావాలి, వారికి శిక్ష విధించవలసింది న్యాయస్థానమే తప్ప అధికారంలో ఉన్న రాజకీయ నాయకులో, అధికారులో కాదు. ఈ బుల్డోజర్ల విధ్వంసంతో పాటుగానే ఖార్గోన్ కు ఎనభై కి.మీ. పరిధిలోని అనేక గ్రామాల్లో ముస్లింల మీద దాడులు, ఆస్తుల విధ్వంసం, చిత్ర హింసలు జరిగాయి. ఇటువంటి వార్తలే గుజరాత్ నుంచి కూడా వస్తున్నాయి. ఈ బుల్డోజర్ల దాడుల వార్తలన్నిటినీ తలదన్నుతూ స్వయంగా దేశ రాజధానీ నగరంలో బుల్డోజర్ల దాడి జరిగింది. జహంగీర్ పురిలో సంఘ్ పరివార్ శక్తులు అనుమతి లేకుండా ఆయుధాలు చేబూని తీసిన ఊరేగింపు ఉద్దేశపూర్వకంగా రెచ్చగొట్టే, అవమానించే, బెదిరించే నినాదాలతో ముస్లిం ప్రార్థనా స్థలం ముందు రభస చేసింది. రంజాన్ ప్రార్థనల్లో ఉన్న ముస్లింలతో ఘర్షణకు దిగింది. పోలీసులు చూస్తూ ఉండిపోయారు. అక్కడ జరిగిన ఘర్షణలో అటూ ఇటూ రాళ్లు రువ్వుకోవడం, ఆయుధాలతో బెదిరించుకోవడం జరిగాయి. ఇరు పక్షాలనూ అదుపులోకి తీసుకుని కేసు పెట్టవలసిన పోలీసులు, కేవలం ముస్లింల మీద కేసులు పెట్టి అరెస్టు చేశారు. బలవంతం మీద అరెస్టు చేసిన సంఘ్ పరివార్ నాయకులను వెంటనే వదిలేశారు. ఇవన్నీ చాలనట్టు అది రోహింగ్యాలు అక్రమంగా ఉంటున్న స్థలం అనే అబద్ధపు ఆరోపణను సంఘ్ పరివార్ తో పాటు ఆమ్ ఆద్మీ పార్టీ కూడ మొదలుపెట్టింది. పోలీసుల సాయంతో ఉత్తర ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు బుల్డోజర్లు నడిపి ఒక మసీదుతో సహా ఎన్నో ఇళ్లను కూలగొట్టారు. పోలీసులు, అధికారులు అని ఊరికే అనవలసిందే గాని అందరికందరూ సంఘ్ పరివార్ కార్యకర్తలుగా పనిచేస్తున్నారు. బాధితులు, బాధితుల తరఫున పౌర సంఘాలు, పార్టీలు సుప్రీంకోర్టు తలుపు తట్టగా, కూల్చివేతలు ఆపమని సుప్రీంకోర్టు ఆదేశాలు ఇచ్చినా కూల్చివేతలు కొనసాగాయి. చివరికి బృందా కరత్ తో సహా అనేక మంది కార్యకర్తలు, బాధిత ప్రజలు అడ్డు నిలవగా బుల్డోజర్లు ఆగిపోయాయి. ఇక్కడ ఆపాం గాని ఢిల్లీలో ఇంకా చాలా చోట్ల బుల్డోజర్లు నడపవలసి ఉంది అని సంఘ్ పరివార్ నేతలు బహిరంగంగానే బెదిరిస్తున్నారు. హిందుత్వ బ్రాహ్మణీయ ఫాసిస్టు రాజ్యపు బుల్డోజర్ నిస్సిగ్గుగా, దూకుడుగా, దుర్మార్గంగా, అనాగరికంగా దూసుకొస్తున్నది. అది ఈ దేశాన్ని, బహుళ సమాజాన్ని, నాగరికతను, ప్రజాస్వామ్యాన్ని, చట్టబద్ధ పాలనను భూస్థాపితం చేయదలచింది. ఈ దేశం మీద, బహుళత్వం మీద గౌరవం, ప్రేమ ఉన్నవాళ్లందరూ, ఈ దేశ భవిష్యత్తును కాంక్షించేవాళ్లందరూ మిగిలిన వివాదాలన్నీ పక్కన పెట్టి మొట్టమొదట ఈ బుల్డోజర్ను అడ్డుకోవలసి ఉంది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# శెరువెండబెట్టి ప్లాట్లు జేసుడు అన్నాలం గాదా?

ఏ పనిల్లనైనా పాతోల్లు బొయ్యి కొత్తోల్లు వస్తే, పాతోల్ల మంచిని ముంగటికి తీస్కబోవాలె. పాతోల్ల తప్పులను సవరిచ్చాలె. గంతనె. సర్కారుకైన గదే ఇలవరిశె. కొత్తగ గద్దెనెక్కిన సర్కారు అంతకు ముందటి సర్కార్లు జేశిన మంచి పనులు ఎక్కువ జెయ్యాలె, తప్పులు సవరిచ్చాలె. అసలు సర్కారంటెనె తప్పుడు పనులు జేసుటానికి గద, యాడ్నన్న మంచి పనులు జేశెటోడుంటడా అని అడిగేటోల్లు ఉంటరనుకో. నైను, గిప్పుడు ముచ్చట గది గాదు. ఇయాల సంగతేందంటే ఒగాల తప్పిజారి పాత సర్కారు ఒగ మంచి పనే జేసిందనుకో, ఆ సర్కారును ఓడగొట్టి ఒచ్చిన కొత్త సర్కారు ఆ మంచి పనిని మెచ్చుకోవాలె గద, పొడుగు జెయ్యాలె గద. కని తెలంగాణల గట్ల లేదు. దొరవారు పాత సర్కారు జేసిన ఒగ మంచి పనిని జెడగొట్టాలె అని కంకణం గట్టుకున్నడట. నిజాం మారాజు పట్నంల తవ్విపిచ్చిన పెద్ద శెరువులున్నయి గద. ఎంత ముద్దుగుంటయి. ఎహే, ఊరి నడిమిట్లది కంపు గొట్టె మురికినీల్ల శెరువు గాదు, గది సగమైపాయె, మన కండ్ల ముంగట్నె బొచ్చెడన్ని శెరువులు కుంటలు మాయమైపాయె. నేను జెప్పేది వాటి ముచ్చట గాదు. ఊరవుతల ఉన్నయి సూడు, గవాటి సంగతి. మూసీ నది మీద గట్టినయి. మూసీ నది అంటే నవ్వకు పిలగా, మా శిన్నప్పుడు గది నదే. మురికినీల్లు గాదు, మంచినీల్లె పారేది. ఆనకాలంల పొంగుకొచ్చేది. అట్ల పొంగి ఊరిని ముంచకుండ ఉండాల్నంటె అడ్డంగ శెరువులు గట్టాల్నని అవి గట్టిండ్రట. అవి ఉంటెనె చెట్టూ చేమా పచ్చదనం ఉంటయి. బూమిల జల పార్తది. శెరువులు పచ్చగ ఉండాల్నంటె వాట్లల్లకొచ్చె వాగులు సక్కగ రావాలె. వాగులకు అడ్డాలు ఉండొద్దు. ఆ వాగుల నీల్లల్ల శెత్తా శెదారం కలుపొద్దు. పైన కొండలు, అడవులు, భూమి సక్కగ ఉండాలె. గందుకె పాత సర్కారు ఆ శెరువుల మీది బూమిల కారా?నాలు బెట్టొద్దని, పెద్ద పెద్ద ఇండ్లు గట్టొద్దని, అడవులు, కొండలు కొట్టొద్దని ఒక ఖానూను దెచ్చింది. మరి మన దొరవారేమో పంట పొలాలను ప్లాట్లు జేసి అమ్ముకునెటోల్లకు సాతిస్తాండు గద. ఇగ శిన్న దొరైతె ఖానూనుకు ఖిలాఫ్ బొయ్యి ఆ శెరువుల మీది జాగల్నే పెద్ద ఇల్లు గట్టుకున్నడట. శిన్నదొర దోస్తులు మస్తుమంది గుడ ఆడనే ఉన్నరట. గింత బంగారమసొంటి జాగ ప్లాట్లు గాకుండ పుక్కానికి వదుల్తమా, లచ్చిందేవి వత్తనంటాంటె కాలడ్డం బెడ్తమా, పాత ఖానూను శెత్తబుట్టల పారెయ్యాలె, గా బూమినంత ప్లాట్లు జెయ్యాలె, శెరువులు ఉంటె ఉండనీ, పీకితె పీకనీ, పైసలకన్న ఎక్కువనా అని దొర సుట్టున్నోల్లందరు ఒక్కతీర్గ లొల్లి బెట్టిండ్రట. రాజు దల్సుకుంటె దెబ్బలకు కొదవా? తేరా గొడ్డలి, ఎయ్యిర ఏటు అని దొరవారు ఇంకో కొత్త ఖానూను దెచ్చి, పాత ఖానూన్ను ఏసి పడేసిండట. గింత అన్నాలం ఉంటదా? శెరువంటె నీదా నాదా, గిప్పుడు బతికున్నోల్లదా? తాతముత్తాతల నించి వత్తందిగద, మనువలకు, మునిమనువలకు గుడ బనికొస్తది గద. దాన్ని శెడగొట్టుడు నివద్దేనా? వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అప్పులకుప్పగా మారుతున్న ఆర్థిక వ్యవస్థ

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌కు ఉండిన మొత్తం రుణభారం రు. 1,66,000 కోట్లలో, రు. 18,000 కోట్ల అప్పు ఏ రాష్ట్రానికి చెందుతుందనే వివాదం ఉండగా విభజిత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వాటాగా రు. 86,348 కోట్లు పంచారు. రాష్ట్రం ఏర్పడి ఎనిమిది సంవత్సరాలు కూడ నిండకుండానే ఆ అప్పు ఎనిమిది తొమ్మిది రెట్లు పెరిగి ఆరు – ఏడు లక్షల కోట్ల రూపాయల మధ్యకు చేరిందనే ప్రమాదసూచనలు వినబడుతున్నాయి. రాష్ట్రం ఏర్పడిన తర్వాత మొదటి ఐదు సంవత్సరాల్లో చంద్రబాబు నాయుడు ప్రభుత్వం ఆ అప్పును మూడు రెట్లు పెంచి రు. 2,59,000 కోట్లకు చేర్చింది. తెలుగుదేశం ప్రభుత్వం ఇచ్చిపోయిన అప్పును ఆ తర్వాత మూడు సంవత్సరాలలోనే రెట్టింపో అంతకన్న ఎక్కువో చేసిన ఘనత జగన్ మోహన్ రెడ్డి ప్రభుత్వం మూటగట్టుకుంది.

ప్రభుత్వం సమర్పించిన 2022–23 బడ్జెట్ ప్రకారం ఆ అప్పు రు. 4,39,394 కోట్లు. ప్రతిపక్ష నేతలు చెపుతున్న ప్రకారం అది ఏడులక్షల కోట్ల రూపాయలు. ప్రభుత్వ గణాంకాలకూ ప్రతిపక్షాలు చెపుతున్న గణాంకాలకూ తేడా ఉన్నప్పటికీ, రెండు అంకెల్లోనూ కొంత వాస్తవమూ కొంత అవాస్తవమూ ఉన్నాయి. ప్రభుత్వపు అంకె కొన్ని పద్దులను అప్పులుగా చూపకుండా చేస్తున్న అంకెల గారడీ కాగా, ప్రతిపక్షాలు చెపుతున్న అంకె కొంత ఎక్కువ చేసి చెపుతున్నది. ఆ అంకె ఎంత అనేదానికన్న ప్రజల మీద, ఆర్థిక వ్యవస్థ మీద దాని ప్రభావం ఏమిటనేది కీలకం. ద్రవ్య నియంత్రణా, నిర్వహణా చట్టం ప్రకారం స్థూల రాష్ట్రాదాయంలో అప్పు శాతం పరిమిత స్థాయిలోనే ఉందని ప్రభుత్వం ఆత్మ సంతృప్తి ప్రకటించుకోవచ్చు. కాని, రాష్ట్ర వనరులలో గణనీయమైన భాగం అప్పుల వడ్డీలకే చెల్లిపోతుండడం సుస్థిరమైన అభివృద్ధి సూచిక కాదు. రాష్ట్ర ప్రభుత్వం అభివృద్ధి మీద, సంక్షేమం మీద పెట్టవలసిన అత్యవసరమైన ఖర్చుల కోసం నిధుల కొరతను ఈ రుణభారం కలగజేస్తుంది. పాత అప్పుల అసలులో కొంత భాగాన్ని, ఆ అప్పులపై వడ్డీలను చెల్లించడానికే రాష్ట్రపు సొంత పన్నుల ఆదాయం సరిపోవడం లేదని, కేంద్ర ప్రభుత్వం దగ్గరి నుంచి మరిన్ని అప్పులకు అనుమతులు తెచ్చుకుంటూ అప్పుల విషవలయంలోకి రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను నెడుతున్నారని వస్తున్న ఆరోపణ తీవ్రంగా పరిగణనలోకి తీసుకోవలసినది. ప్రభుత్వం ప్రతి ఏటా ఈ అప్పుల అసలు, వడ్డీల కిందనే ఇరవై – ముప్పై వేల కోట్ల రూపాయలు చెల్లించవలసి వస్తున్నదని ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి. పాత అప్పులు తీర్చడానికి కూడ కాదు, పాత అప్పుల వడ్డీలు చెల్లించడానికే కొత్త అప్పులు చేయవలసి వస్తున్నది. ఆ మేరకు అభివృద్ధి వ్యయం మీద, సంక్షేమ వ్యయం మీద కోతలు విధించవలసి వస్తున్నది. ఇటువంటి స్థితిలో సొంత ఆదాయ వనరులు పెంచుకోవడం, కొత్త అప్పుల వైపు చూడకుండా పొదుపు పాటించడం, ఎక్కువ వడ్డీల అప్పుల స్థానంలో తక్కువ వడ్డీల అప్పుల కోసం ప్రయత్నించడం, ప్రభుత్వ వ్యయంలో దుబారాను అరికట్టడం వంటి అనేక చర్యలు తీసుకోవలసి ఉంటుంది. కాని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అటువంటి ఏ ఒక్క చర్య గురించైనా ఆలోచిస్తున్నట్టు కూడ కనబడడం లేదు. అప్పుల వలయంలో పడి కేంద్ర ప్రభుత్వానికి జీ హుజూర్ జో హుకుం అనడానికి సిద్ధపడుతున్నది. రోజురోజుకూ కొత్త అప్పులు చేసే వ్యసనం వ్యక్తులనూ, కుటుంబాలనూ ఆత్మహత్య వైపు నెడుతుంది. మరి ప్రభుత్వాలను, సమాజాలను ఏం చేస్తుందో?! వీ

# యుక్రెయిన్‌పై రష్యా యుద్ధం...ఆర్థిక వ్యవస్థపై ప్రభావం

- ఎ. నర్సింహారెడ్డి

ప్రపంచంలో ఎక్కడ యుద్ధం జరిగినా దాని ప్రభావం ప్రపంచ దేశాలపై పడడం సహజమే. యుక్రెయిన్‌పై రష్యా దురాక్రమణ యుద్ధం కూడ ధరల పెరుగుదలకు, ఆహార సంక్షోభానికి, ద్రవ్యోల్బణం పెరుగుదలకు దారి తీస్తోంది. ఫిబ్రవరి 24న యుద్ధం మొదలవ్వడంతో నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటాయి. కొవిడ్ విపత్తుతో దెబ్బతిన్న సరఫరా గొలుసులు ఇప్పటికీ పూర్తిగా పునరుద్ధ రించబడలేదు. గోరు చుట్టుపై రోకటి పోటులా యుక్రెయిన్‌పై యుద్ధం వచ్చిపడింది. అమెరికా, నాటో దేశాలు రష్యాపై విధించిన ఆర్థిక ఆంక్షలు, యుద్ధంతో సరుకుల రవాణాకు అంతరాయం, పెరుగుతున్న ధరలు ఆర్థిక వ్యవస్థను మాంద్యంలోకి, ప్రజలను కష్టాల్లోకి నెట్టనున్నాయి. యుద్ధం మొదలవ్వడంతో బ్యారెల్ బ్రెంట్ చమురు ధర మార్చిలో అంతర్జాతీయ మార్కెట్‌లో 116.83 డాలర్లకు చేరుకున్నది. 2014 తర్వాత ఈ స్థాయికి క్రూడ్ ఆయిల్ ధర చేరుకోవడం ఇదే మొదటిసారి. అంతర్జాతీయ మార్కెట్‌లో క్రూడాయిల్ ధరలు పెరుగుతూ పోయే కొద్దీ సాధారణ ప్రజల జీవన వ్యయం హద్దులు మీరిపోయే గడ్డు స్థితే ముందు ముందు విరుచుకుపడగలదు. ఆహార కొరత మితిమీరుతుంది. సాధారణ ప్రజల బతుకులు చెప్పనలవికానంత దుర్భరమవుతాయి. అమెరికాలో రికార్డు స్థాయిలో 7.5 శాతం ద్రవ్యోల్బణం నమోదైంది. చమురుధర పెరుగుదల బ్యారెల్ 125 డాలర్లకు చేరితే అమెరికా మాంద్యంలోకి జారుకుంటుంది. రష్యాపై ఆర్థిక ఆంక్షలు విధించినందుకు అది ప్రతీకారంగా చమురు సరఫరా నిలిపివేస్తే ఐరోపా దేశాల్లో సంక్షోభం తలెత్తుతుంది.

రష్యా యుద్ధం నేపథ్యంలో ప్రపంచం ఇప్పుడు ఆహార సంక్షోభ దిశగా పయనిస్తోంది. ఆహార పదార్థాల ధరలు పెరుగుతున్నాయి. గత 40 సంవత్సరాలలో ఎప్పుడు లేనంత అధిక స్థాయిని ధరలు తాకాయి. ఇప్పటికే ఆఫ్ఘాన్, ఇరాక్, శ్రీలంక దేశాల్లో ఆహారం కోసం నిరసన ప్రదర్శనలను ప్రపంచం చూస్తోంది. అనేక దేశాలు దేశీయ ఆహార సరఫరాకు దెబ్బ తగలకుండా ఉండటానికి స్వీయరక్షణ విధానాలకు మళ్లి పోయాయి. ముంచుకొస్తున్న సంక్షోభంతో మరింత మంది దారిద్ర్యంలో కూరుకుపోనున్నారని బ్లూమ్‌బెర్గ్ పేర్కొంది. ప్రపంచ గోధుమ వాణిజ్యంలో 30 శాతం వాటా ఉన్న యుక్రెయిన్, రష్యాల నుంచి సరఫరా ప్రమాదంలో పడింది. గోధుమ ధరలు ఆల్‌టైమ్ రికార్డు స్థాయికి చేరుకున్నాయి. యుద్ధం దీర్ఘకాలం కొనసాగితే విదేశీ వ్యాపారాలకు అంతరాయం కలిగి, నష్టం అపారంగా ఉంటుంది. సరుకుల దిగుమతి నిలిచిపోతే, దేశీయంగా ఆహార వస్తువుల కొరత పెరుగుతుంది. ధరలకు రెక్కలొస్తాయి. ఆర్థిక వ్యవస్థలో అనిశ్చిత వాతావరణం, గిరాకీ క్షీణత, పెట్టుబడుల స్తంభన, ద్రవ్యోల్బణం, వాణిజ్య లోటు వంటి ప్రతికూలతలు ఎదురవుతాయి. యుద్ధం మరింత కాలం కొనసాగితే సరఫరా గొలుసుపై తీవ్ర ప్రభావం పడుతుంది. చాలా ఓడరేవుల్లో అనిశ్చితి మూలంగా కంటైనర్లు నిలిచిపోయాయి. ఇంధన ధరల పెరుగుదల ఇంకా కొనసాగితే ద్రవ్యోల్బణం విజృంభిస్తుంది. అదే జరిగితే వినియోగ వస్తువులకు గిరాకీ తగ్గి, తద్వారా ఉత్పత్తి, ఉపాధిలో కోత పడుతుంది. దీనివల్ల ఒకవైపు భారీ ద్రవ్యోల్బణం, ఇంకొకవైపు తీవ్ర నిరుద్యోగం వంటి పరిస్థితులు తలెత్తుతాయి. ఈ రెండూ తెరపైకి వస్తే ఆర్థిక వ్యవస్థ అతలాకుతలం అవుతుంది. ఈ వినూత్న పరిణామాన్నే స్టాగ్‌ఫేషన్‌గా వ్యవహరిస్తారు. వీ



మోడీ ప్రభుత్వం మేకిన్ ఇండియా పథకానికి చిహ్నంగా రూపొందించిన సింహం గుర్తు పరిణామ క్రమంలో బుల్డోజర్‌గా మారిన వైనం



❖ **నా కర్తవ్య నిర్వహణలో అనుభవ పరంపర** – అనుభవాలకు అక్షరరూపం – పసల భీమన్న – ఝాన్సీ పబ్లికేషన్స్ ప్రచురణలు – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 115, ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, ఆర్య సమాజ్ ఎదురు లైన్, కాచిగూడ, హైదరాబాద్ – 500027, ఫోన్ : 90004 13413



❖ **జరిగిన కథలు** – పసల భీమన్న – ఝాన్సీ పబ్లికేషన్స్ ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 70,



❖ **శాస్త్రీయ దృక్పథం ఎందుకు?** – (శాస్త్రీయ ఆలోచనా వ్యాస సంకలనం) – పసల భీమన్న – జనవిజ్ఞాన వేదిక ప్రచురణలు – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 60,
పై మూడు ప్రతులకు: శ్రీ పసల భీమన్న, ఇ.నెం. 79-8-9/1, పోస్టల్ కాలనీ, శ్యామలా నగర్, రాజమండ్రి – 533103, ఫోన్ : 9490123276



❖ **రెప్పవాల్చని స్వప్నం** – కవిత్వం – దొండపాటి నాగజ్యోతి శేఖర్ – ప్రియమైన రచయితలు ప్రచురణ – 124 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: డి. నాగజ్యోతిశేఖర్, ఎల్. రాజశేఖర్‌బాబు, మురమళ్ల, ఐ. పోలవరం మండలం, తూర్పు గోదావరి – 533220, ఫోన్ : 9492164193



❖ **కోనసీమ సంస్కృతి** – అద్దంకి బుద్ధ చంద్ర దేవ్ – శ్రీ తథాగత నిలయము ప్రచురణ – 24 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: అద్దంకి బుద్ధ చంద్రదేవ్, కరస్పాండెంట్, ప్రియదర్శిని బాలవిహార్, కొత్తపేట, తూర్పు గోదావరి – 533223, ఫోన్ : 08855 – 244202, 9989244202



❖ **సామాజిక మాధ్యమాల సారమేమిటి?** – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి – 102 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి, పరిశోధక విద్యార్థి, రాజనీతి శాస్త్ర విభాగం, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్ – 506009, ఫోన్ : 9908240768, అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **తెల్లవారుజాము కల** – కవిత్వం – శిఖామణి – కవిసంధ్య గ్రంథమాల ప్రచురణ – 124 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: కవిసంధ్య గ్రంథమాల, ఇ.నెం. 2-1-043, అంబేద్కర్‌నగర్, యానాం – 533464, అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **శ్రమ పొదుగు** – కవిత్వం – యరకల యాదయ్య – తెలంగాణ రచయితల సంఘం ప్రచురణ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నందిక ఆద్య, ఇ.నెం. 25-36/4/4జె, మల్లికార్జున నగర్, బీరంగూడ ఖమాన్, బిఎచ్ఇఎల్, రామచంద్రాపురం, హైదరాబాద్ – 502032, ఫోన్ : 9866468979



❖ **శిలా విలాపం** – రవీంద్రనాథ్ టాగూర్ కథలు – అనువాదం: చింతపట్ల సుదర్శన్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 198 పేజీలు, 1/8 డెమీ, రు. 150,



❖ **అగ్నిపథం – మట్టి మనుషులు** – నవల – గన్నవరపు నరసింహమూర్తి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 180 పేజీలు, 1/8 డెమీ, రు. 150,



❖ **కాలచక్రం** – మాతృగుప్తగా ప్రఖ్యాతిగన్న మహాకవి కాళిదాసు జీవన కథనం – నవల – కన్నడం: నా.సు. భరత హళ్ళి – అనుసృజన: వేలూరి కష్ణమూర్తి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 248 పేజీలు, 1/8 డెమీ, రు. 150,



❖ **రెప్ప వాలని రాత్రి** – కవిత్వం – వంశీకృష్ణ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 184 పేజీలు, 1/8 డెమీ, రు. 150,
పై నాలుగు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట, హైదరాబాద్ – 500036, ఫోన్ : 9848787284



❖ **ఇక ఇప్పుడు...** – కవిత్వం – కటుకోజ్వల ఆనందచారి – తెలంగాణ సాహితి ప్రచురణ – 232 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: కె. ఆనంద చారి, ఇ.నెం. 11-10-730/11, బుర్హాన్‌పురం, ఖమ్మం – 507001, ఫోన్ : 9948787660



❖ **కలెనేత** – (ఏడు తరాల తలపోత) – ఆత్మకథ – బల్ల సరస్వతి – ఆన్వీక్షికి పబ్లిషర్స్ ప్రై.లి. ప్రచురణ – 590 పేజీలు, 1/4 క్రౌన్, రు. 500, ప్రతులకు: బల్ల సరస్వతి, ఆదిత్య విల్లా, 4-141, గణేశ్ నగర్, నారపల్లి, హైదరాబాద్ – 500088, ఫోన్ : 9849098708



❖ **తురాయి పూలు** – కవిత్వం – వాసరచెట్ల జయంతి – చందన పబ్లికేషన్స్ ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: వి. మనోహర్, ఫోన్ : 99855 25355, 99856 08077, అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్



❖ **పసుల రంకె** – కథల సంపుటి – దేవరశెట్టి జనార్దన్ – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: దేవరశెట్టి జనార్దన్, ఇ.నెం. 4-1-137, వాణి నగర్, జగిత్యాల – 505327, ఫోన్ : 7780333052, 9550292727

# రియల్ ఎస్టేట్ కోసమే జీఓ 111 రద్దు

*పర్యావరణాన్ని, హైదరాబాద్‌లోని జంట జలాశయాలను సంరక్షించే పర్యావరణ అనుకూల జీవో 111 ను రద్దు చేయడం వెనుక తెలంగాణ ప్రభుత్వ రియల్ ఎస్టేట్ సమర్థక వైఖరిని వివరిస్తున్నారు* **ఎన్ వేణుగోపాల్**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఏప్రిల్ 20 న వెలువరించిన జీవో 69 ద్వారా, ఇరవై ఆరు సంవత్సరాలుగా ఉనికిలో ఉన్న జీవో 111 ను ఎత్తివేసింది. 1996 మార్చ్ 8న వెలువడిన ఆ జీవో 111 ప్రకారం హైదరాబాద్‌కు ఎగువన ఉన్న ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్ జలాశయాలను పరిరక్షించడం కోసం పది కి.మీ. పరిధిలోని 84 గ్రామాల్లోని ఒక లక్షా ముప్పై రెండు వేల ఎకరాల భూమి మీద భవన నిర్మాణ, పర్యావరణ ఆంక్షలు ఉండేవి. ఇప్పుడు కొత్త జీవో ద్వారా ప్రభుత్వం ఆ ఆంక్షలన్నిటినీ రద్దు చేసింది. ఆ ఆంక్షలవల్ల ఆ గ్రామాల్లో అభివృద్ధికి అవరోధాలు ఏర్పడ్డాయనీ, ఆ గ్రామాల ప్రజలు ఆ ఆంక్షలు ఎత్తివేయమని ఎంతోకాలంగా కోరుతున్నారనీ, ఇప్పుడు ఆ జలాశయాలు హైదరాబాద్ మంచి నీటి అవసరాలను తీర్చడం కూడ లేదు గనుక ఇక ఆ ఆంక్షలు అనవసరమనీ ప్రభుత్వం, పాలకపక్షం అనేక వాదనలు ముందుకు తెస్తున్నాయి. కొత్త జీవోలో ఆ జలాశయాల నీటి నాణ్యత దెబ్బతినకుండా రక్షణ చర్యలు తీసుకుంటున్నామని, తగిన షరతులు విధిస్తున్నామని ఒకవైపు చెపుతూనే, ఈ జీవో వల్ల వేలాది ఎకరాలలో భవన నిర్మాణాలు జరిగి, ఒక కొత్తనగరం రూపొందే అవకాశం వస్తుందని కూడా అంటున్నారు.

ఈ పరస్పర విరుద్ధ ప్రకటనలు, అత్యవసరమైన విషయాలను దాచిపెట్టడం, పర్యావరణ దృష్టితో, ప్రజా ప్రయోజన దృష్టితో గతంలో విడుదలైన జీవోను రద్దు చేయడం ఆషామాషీ వ్యవహారాలు కావు, ప్రజలకు సంబంధం లేని పాలనాపరమైన చర్యలు కావు. ఈ చర్యలు హైదరాబాద్ పర్యావరణం మీద, జనజీవన నాణ్యత మీద దీర్ఘకాలిక దుష్ప్రభావాలకు దారితీస్తాయి. జీవో 111 రద్దును అధికారపక్ష పత్రిక నమస్తే తెలంగాణతో పాటు, అధికారపక్షపు, లేదా వారి ఆశ్రితుల పెట్టుబడులో, ప్రభావమో ఉన్న ఇతర పత్రికలు, టీవి ఛానళ్లు విపరీతంగా సమర్థిస్తూ ప్రజలకు వాస్తవాలు తెలియకుండా అబద్ధాలు ప్రచారం చేస్తున్నాయి, వాస్తవాలను దాచిపెడుతున్నాయి. ఈ చర్యల వెనుక ఉన్న గూడుపుఠాణీ బైటపడకుండా కాపు కాస్తున్నాయి. “రంగారెడ్డి జిల్లాలోని 84 గ్రామాల చిరకాల వాంఛ ఇరవై ఆరు సంవత్సరాల తర్వాత నెరవేరింది” అని ఈనాడు మైమరపుతో, ఇది ప్రజాప్రయోజనకర చర్య అన్నట్టు రాసింది. ఈ నేపథ్యంలో జీవో 111 గురించి, జీవో 69 గురించి వివరంగా తెలుసుకోవలసి ఉంది.

హైదరాబాద్ కు పడమట అనంతగిరి కొండల్లో పుట్టి తూర్పుకు ప్రవహించి, కృష్ణా నదిలో కలిసే ఉపనది, ఒకప్పటి జీవనది మూసీ తీరంలో హైదరాబాద్ నిర్మాణమయింది. మూసీకి 1908లో వచ్చిన వరదల్లో నగరం మొత్తం మునిగిపోయి విపరీతమైన ఆస్తి నష్టం సంభవించడంతో, 15,000 మంది చనిపోవడంతో, నిజాం ప్రభుత్వం మూసీ వరదల బారి నుంచి నగరాన్ని కాపాడే ప్రణాళికల కోసం అప్పటి ప్రఖ్యాత ఇంజనీరు మోక్షగుండం విశ్వేశ్వరయ్య సహకారం కోరింది. అప్పటికి గడిచిన 300 సంవత్సరాల్లో మూసీకి 12 సార్లు భారీ వరదలు వచ్చాయని, నదికి ఎగువన ఆనకట్ట కట్టడం తప్ప వరదలు అడ్డుకునే మార్గం మరొకటి లేదని ఆయన సూచించారు. అలా మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ ప్రభుత్వం మూసీ మీద 1920లో ఉస్మాన్ సాగర్, మూసీ ఉపనది అయిన ఈసీ మీద 1927లో హిమాయత్ సాగర్ నిర్మించింది.

అంటే ప్రధానంగా ఈ రెండు జలాశయాలు మూసీ వరదల నుంచి హైదరాబాద్ ను రక్షించడానికి నిర్మాణమైనవి. ఆ జలాశయాలు ఉన్నప్పటికీ, ఆ తర్వాత గడిచిన వంద సంవత్సరాల్లో కూడా మూసీకి వరదలు వస్తూనే ఉన్నాయి గాని ఒకటి రెండు సార్లు మినహా పెద్ద ఎత్తున ఆస్తి నష్టం, ప్రాణనష్టం సంభవించలేదు. గత మూడు దశాబ్దాలలోనే రెండు సార్లు వరదల బీభత్సపు అనుభవం నగర ప్రజలకు ఉంది. తర్వాత నగర జనాభా పెరుగుతున్న కొద్దీ ఈ రెండు జలాశయాల నీటినే నగర ప్రజల తాగునీటి అవసరాల కోసం వాడడం మొదలయింది. ఏడు దశాబ్దాల పాటు హైదరాబాద్ దాహార్తిని ఈ జలాశయాలే తీర్చాయి. 1990ల తర్వాత హైదరాబాద్ తాగునీటి అవసరాల కోసం కృష్ణా జలాలు, మంజీర జలాలు, గోదావరి జలాలు అందుబాటులోకి రావడంతో ఈ జంట జలాశయాల మీద ఆధారపడవలసిన అవసరం తగ్గిపోయింది, తప్పిపోయింది. కాని ఇప్పటికైనా మిగిలిన వనరులతో ఏదైనా సమస్య వస్తే వెంటనే ఆదుకోగలిగినది ఈ రెండు జలాశయాలే. ఈ రెండు జలాశయాలు వంద సంవత్సరాలుగా హైదరాబాద్ కు ఎగువన ఉనికిలో ఉండడం వల్ల హైదరాబాద్ నగరం ఎంత విస్తరించినప్పటికీ భూగర్భ జల వనరుల సంరక్షణ వాటివల్లనే జరుగుతూ వచ్చింది. నగరపు ఆహ్లాద, ప్రాణవాయువు, పర్యావణ సంరక్షణ అవసరాలను కూడ ఈ రెండు జలాశయాలు తీరుస్తూ వచ్చాయి. అంటే ఈ జలాశయాలను కేవలం నగరానికి మంచి నీటి వనరులుగా మాత్రమే చూడనక్కరలేదు. ఆ పని కొంతకాలం జరిగి ఉండవచ్చు, ఇప్పుడు జరగనవసరం లేకపోవచ్చు. కాని ఈ జలాశయాలు వరద నిరోధకాలు, మంచినీటి వనరులు, భూగర్భ జల వనరులు, ఆహ్లాద కారకాలు, పర్యావరణ సంరక్షణలు.

ఉస్మాన్ సాగర్ జలాశయం విస్తీర్ణం 6,200 ఎకరాలు, హిమాయత్ సాగర్ విస్తీర్ణం 4,800 ఎకరాలు. ఈ రెండు జలాశయాలకు కూడ

అనంతగిరి కొండల దాకా విస్తరించి ఉన్న సువిశాల ప్రాంతంలోని భూమి, అడవులు, కొండలు, వాగులు నీటి వనరులను అందజేస్తాయి. ఆ నీటి వనరుల విస్తీర్ణాన్ని ఒక్కొక్క జలాశయానికి ఒక లక్షా ఎనభై రెండు వేల ఎకరాలకు పైగా ఉంటుందని గుర్తించారు. అంటే ఆ లక్షా ఎనభై రెండు వేల ఎకరాల భూమిలో ఎటువంటి ప్రతికూల చర్యలు, పర్యావరణ విధ్వంసక చర్యలు, జల కాలుష్యానికి అవకాశం ఇచ్చే చర్యలు, నీటి ప్రవాహానికి అవరోధమైన నిర్మాణాలు జరిగినా ఆ ప్రభావం జలాశయాల మీద పడుతుంది. ఆ నీరు కలుషితం కావడమో, లేదా జలాశయాల విస్తీర్ణం కుంచించుకుపోవడమో జరుగుతుంది. సహజమైన మానవ జీవితావసరాలు, వ్యవసాయ అవసరాలు తీర్చుకోవడం ఒక ఎత్తు. అవి సాధారణంగా పెద్ద ఎత్తున కాలుష్యకారకాలు కావు. కాని నీటి జలలు ఉండే కొండలను పగులగొట్టడం, అడవులను కొట్టివేయడం, వాగుల భూములను ఆక్రమించి భవన నిర్మాణాలతో నీటి ప్రవాహాలను అడ్డుకోవడం, కృత్రిమమైన జనాభా ఒత్తిడిని పెంచి మానవ వ్యర్థాలను పెద్ద ఎత్తున వాగులలోకి వదలడం, పరిశ్రమలు ఏర్పాటు చేసి రసాయన, కలుషిత వ్యర్థ జలాలను వాగులలోకి, భూమిలోకి, జలాశయాలలోకి పంపించడం వంటి చర్యలు పర్యావరణ విధ్వంసకమైనవి, భవిష్యత్తు మీద దీర్ఘకాలిక ప్రభావం వేసేవి, వాతావరణ మార్పులకు కారణమయ్యేవి. అందువల్ల ఈ రెండు జలాశయాల నీటి వనరుల విస్తీర్ణంలో ఇటువంటి పర్యావరణ విధ్వంసక చర్యలు చేపట్టగూడదని ఆంక్షలు విధిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1996 మార్చ్ 8న జీవో 111 జారీ చేసింది. నిజానికి, ఈ జీవోకు మూడు సంవత్సరాల ముందే హైదరాబాద్ మెట్రోపాలిటన్ వాటర్ సప్లై అండ్ సూవరేజి బోర్డ్ ఈ జలాశయాల నీటి నాణ్యతను పరిశీలించడానికి ఒక నిపుణుల కమిటీని నియమించింది. ఆ కమిటీ మధ్యంతర సిఫారసుల మేరకు ఈ రెండు జలాశయాలకు పది కి.మీ. పరిధిలో నిర్మాణాల మీద ఆంక్షలు విధిస్తూ 1994 మార్చ్ 31న జీవో 192 జారీ అయింది. నిపుణుల కమిటీ రెండో మధ్యంతర నివేదిక తర్వాత, మొదటి జీవోలో మార్పులు చేస్తూ, జీవో 111 జారీ అయింది.

ఆ జీవో ప్రకారం పది కి.మీ. పరిధిలో కాలుష్యకారక పరిశ్రమలు స్థాపించడాన్ని, భారీ హోటళ్ల నిర్మాణాన్ని, కాలుష్యానికి దారి తీసే ఆవాస సముదాయాలు, ఇతర నిర్మాణాలు జరపడాన్ని నిషేధించారు. ఆ పరిధి లోపల ఆవాస ప్రాంతాలుగా గుర్తించిన చోట్ల కూడ పెద్ద ఎత్తున కాలుష్యం జరగకుండా ఏ ముందు జాగ్రత్తలు తీసుకోవాలో నిర్దేశించారు. ఈ పరిధిలో శంషాబాద్ మండలంలో 40 గ్రామాలు, మొయినాబాద్ మండలంలో 27 గ్రామాలు, చేవెళ్ల మండలంలో ఆరు గ్రామాలు, రాజేంద్రనగర్ మండలంలో ఐదు గ్రామాలు, శంకర్ పల్లి మండలంలో మూడు గ్రామాలు, షాబాద్ మండలంలో రెండు గ్రామాలు, కొత్తూరు మండలంలో ఒక గ్రామం ఉన్నాయి.

అయితే 1994 నుంచి జీవో 192, 1996 నుంచి జీవో 111 ఉన్నప్పటికీ ఆ జీవోల్లో ఉన్న ఆంక్షలకు ఉల్లంఘనలు కూడ పెద్ద ఎత్తునే జరుగుతున్నాయి. స్పష్టంగా కనబడే భారీ పరిశ్రమలు రాకపోవచ్చు గాని, భవిష్యత్తులో వెంచర్లు తయారుచేయడానికి వందల ఎకరాలు కొనిపెట్టుకున్న రియల్ ఎస్టేట్ వ్యాపారులు, డజన్ల కొద్దీ ఎకరాలు కొనుక్కుని ఫార్మ్ హౌజులు, రిసార్టులు, పబ్‌లు, భారీ భవనాలు నిర్మించుకుని కాలుష్యం వెదజల్లుతున్న రాజకీయ నాయకులు, ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు ఎందరో ఉన్నారు. జీవో 111 ఆంక్షల వల్ల ఈ గ్రామాలలో లక్షకు పైగా ఎకరాల భూమి పెద్ద ఎత్తున మార్కెట్ సరుకు కాకుండా ఆగిపోతున్నదని, అందువల్ల జీవో 111 రద్దును ఎన్నికల అంశంగా మార్చాలని భూకమతాల యజమానులతో, రియల్ ఎస్టేట్ బ్రోకర్లతో కలిసి గూడుపుఠాణీ నడిపించారు. ఆ స్థితిలో గత నాలుగైదు ఎన్నికలలో జీవో 111 రద్దు ఈ ప్రాంతంలో ఒక ఎన్నికల అంశంగా మారింది. అన్ని రాజకీయ పార్టీలూ రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాల చుట్టూనే తిరుగుతున్నాయి గనుక పైకి ఏమి చెప్పినా అన్ని పార్టీలూ కూడ ఈ "డిమాండ్"ను ఆమోదిస్తూ వచ్చాయి.

హైదరాబాద్ నగరంలో పెరిగిపోతున్న రియల్ ఎస్టేట్ వ్యాపారానికీ, ఆంక్షల కింద ఉండిపోయిన ఈ లక్ష ఎకరాల బంగారు బాతుకూ దగ్గరి సంబంధం ఉంది. చంద్రబాబు నాయుడు పాలనా కాలంలో, ప్రపంచీకరణ విధానాలతో, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ సంస్థలు, డాలర్ల ప్రవేశంతో హైదరాబాద్‌లో భూముల ధరలకు రెక్కలు రావడం మొదలయింది. ఆ కాలంలోనే ఈ భూమి మీద ఆంక్షల జీవో విడుదల కావడం ఒక వైరుధ్యం. అయితే పేరుకు జీవో ఉన్నా, ఉల్లంఘనలను చూసీ చూడనట్టు పోవడం కూడ అప్పుడే మొదలయింది. మిగిలిన ప్రాంతాలలో ఆ రియల్ ఎస్టేట్ విజృంభణ రాజశేఖర రెడ్డి పాలనా కాలంలో కూడా కొనసాగి, తెలంగాణ ఉద్యమ కాలంలో మాత్రం నిలకడగా ఉన్నట్టనిపించింది. హైదరాబాద్ రియల్ ఎస్టేట్ వ్యాపారం కోస్తా, రాయలసీమ భూబకాసురుల చేతుల్లో ఉందనే మాట కూడ తెలంగాణ ఉద్యమ కాలంలో వినబడింది. అప్పుడే ఆ కోస్తా, రాయలసీమ రియల్ ఎస్టేట్ వ్యాపారస్తులు తెలంగాణ రాష్ట్ర సమితి అగ్రనాయకత్వంతో సంధి చేసుకున్నారు. తెలంగాణ ఏర్పడగానే రియల్ ఎస్టేట్ రంగంలో రెండు ప్రధానమైన మార్పులు జరిగాయి. ఒకటి, అప్పటివరకూ ఉండిన కోస్తా, రాయలసీమ భూబకాసురుల స్థానంలో కొంత భాగాన్ని తెలంగాణ భూబకాసురులు ఆక్రమించడం, లేదా కలిసి పనిచేయడం ప్రారంభించారు. వారిలో అత్యధికులు తెరాస నాయకత్వంలోనో, నాయకులకు దగ్గరగానో ఉన్నవారే. రెండు, అప్పటివరకూ హైదరాబాద్ భూముల మీద మాత్రమే ఉన్న రియల్ ఎస్టేట్ వ్యాపారుల కన్ను రాష్ట్రం మొత్తానికీ వ్యాపించింది.

కొత్త జిల్లాల ఏర్పాటు అనే తెరాస నిర్ణయం పాలనను వికేంద్రీకరించడం, ప్రజల దగ్గరికి తీసుకురావడం కన్న ఎక్కువగా కొత్తగా కనీసం ఇరవై ఐదు రియల్ ఎస్టేట్ బంగారు బాతులను తయారు చేయడానికే ఉద్దేశించినది. అలాగే తెరాస ప్రభుత్వం తెలంగాణ ఏర్పడేటప్పటికే ఉన్న ఔటర్ రింగ్ రోడ్‌కు తోడుగా మరింత ఎక్కువ భూమిని రియల్ ఎస్టేట్ వ్యాపారుల క్రీడాస్థలిగా మార్చే రీజినల్ రింగ్ రోడ్, యాదాద్రి, సమతామూర్తి వంటి పథకాలు చేపట్టింది. మొత్తంగా తెరాస ప్రభుత్వ పాలనా కాలంలో అందరి కంటె ఎక్కువ ప్రయోజనాలు పొందినవారు రియల్ ఎస్టేట్ వ్యాపారులు.

ఈ రియల్ ఎస్టేట్ వ్యాపార దాహాన్ని తీర్చడంలో భాగమే జీవో 111 రద్దు చేయడం. నగరం మిగిలిన అన్ని వైపులా విస్తరిస్తూ, ఎకరాలు గజాలుగా మారుతూ, ఎకరం కోట్ల రూపాయలు పలుకుతూ ఉన్న సందర్భంలో పశ్చిమ దిశలో ఈ లక్షన్నర ఎకరాల స్థలం ఆంక్షల

కింద ఉండిపోవడం రియల్ ఎస్టేట్ వ్యాపారులకు కంటగింపయింది. రియల్ ఎస్టేట్ వ్యాపార ప్రయోజనాలూ తన ప్రయోజనాలూ ఒకటే అనుకుంటున్న తెరాస ప్రభుత్వం ఆ వ్యాపారుల కోరికను తీర్చదలచింది.

కాని మిగిలిన అన్ని రియల్ ఎస్టేట్ ప్రయోజనాల సాఫల్యానికీ, ఈ జీవో 111 రద్దుకూ తేడా ఉంది. ఈ రద్దుకు ప్రభుత్వం ఎన్నో కారణాలు చెపుతున్నది గాని వాటిలో ఏ ఒక్కటీ సరైనది కాదు, వాదనకు నిలిచేది కాదు.

జీవో 111 రద్దు ఆ గ్రామాల ప్రజలందరి కోరిక ఏమీ కాదు. ఆ గ్రామాలలో వ్యవసాయం నుంచి వైదొలగి, భూములు అమ్మి కోట్లు సంపాదించి, మరొక వృత్తిలోనో, వ్యాపారంలోనో స్థిరపడదలచుకున్న భూయజమానుల కోరిక మాత్రమే. ఆ గ్రామాలలోని వ్యవసాయాధారిత రైతు కుటుంబాలకు, భూమి లేని నిరుపేదలకు, చేతి వృత్తులవారికి జీవో 111 ఉండడం వల్ల వచ్చిన నష్టమూ లేదు, అది రద్దయినందువల్ల ఒనగూడే లాభమూ లేదు. ఆ గ్రామాల భూముల అమ్మకానికీ, అక్కడ రియల్ ఎస్టేట్ వెంచర్లు పుట్టుకురావడానికీ ఆ గ్రామాల అభివృద్ధికీ ఏమీ సంబంధం లేదు. నిజానికి ఆ పరిణామాల వల్ల ఆ గ్రామాలలో అత్యధిక ప్రజానీకం బతుకులు మరింత దిగజారుతాయి.

ఆ జలాశయాలు హైదరాబాద్ నీటి అవసరాలు ప్రస్తుతం తీర్చడం లేదు గనుక వాటి జలాల నాణ్యత ఏమైపోయినా, ఎంత కలుషితమైనా ఫర్వాలేదని ప్రభుత్వం చేస్తున్న వాదన అర్థరహితమైనది, అమానుషమైనది. ఇప్పటికే పాత హైదరాబాద్ లో ఉండిన వందలాది చెరువులు ఆవాస కాలనీలుగా, మురుగునీటి గుంటలుగా, చెత్తకుప్పలుగా మారినందువల్ల నగర వాతావరణంలో గణనీయమైన మార్పులు వచ్చాయి, నగర సగటు ఉష్ణోగ్రత చెప్పుకోదగినంత పెరిగింది. అసలు ఒక చెరువు ఉండడమా లేదా అనేది కేవలం ఆ నీరు తాగునీరుగా ఉపయోగిస్తున్నారా లేదా అనే ఏకైక కారణం మీద ఆధారపడదు. అది నీటి ప్రవాహాన్ని అరికట్టి, నీటిని నిలువ చేస్తుంది. చెట్టుచేమలకు అవకాశమిస్తుంది. గాలిని చల్లబరుస్తుంది. భూగర్భ జల వనరులను పెంచుతుంది. పర్యావరణ సమతౌల్యాన్ని కాపాడుతుంది. అది మంచినీటి అవసరాన్ని తీర్చడం లేదు గనుక దాన్ని పూడ్చి, చదును చేసి భవన నిర్మాణాలు చేయవచ్చుననే వాదన విస్తరిస్తే, భవిష్యత్తులో హుసేన్ సాగర్ ను కూడ విలాసవంతమైన కాలనీగా మార్చవచ్చు.

పరిసర గ్రామాలన్నిటిలో రియల్ ఎస్టేట్ వెంచర్లు పెరిగిపోతూ, భూముల ధరలకు రెక్కలు వస్తూ ఉంటే, ఈ ఆంక్షల వల్ల ఈ ప్రత్యేక గ్రామాల భూయజమానులు మాత్రం నష్టపోవడం ఏం సబబు అనీ, వారికి అభివృద్ధి కోరుకునే హక్కు లేదా అనీ కూడ జీవో 111 రద్దు సమర్థకులు వాదిస్తున్నారు. ఇదే సమర్థకులు, భారీ ప్రాజెక్టుల కోసం గ్రామాలకు గ్రామాలనే ముంచి, వేలాది, లక్షలాది ప్రజలను నిర్వాసితులను చేసినప్పుడు, "సమాజ అభివృద్ధి కోసం కొందరు త్యాగం చేయక తప్పదు" అని వాదించి తమ ద్వంద్వ స్వభావం చూపుకున్నారు. ఆ త్యాగ ప్రబోధాలు ఇప్పుడు ఈ 84 గ్రామాల, భూమిని అమ్ముకోదలచిన భూయజమానులకు ఎందుకు వర్తించవో తెలియదు.

రియల్ ఎస్టేట్ వ్యాపారుల బకాసుర భూదాహం తీర్చాలని అనుకోకపోతే, జీవో 111 యథాతథంగా అమలు చేస్తూనే, ఆంక్షలకు లోబడిన తక్కువ స్థాయి భవన నిర్మాణ పనులు సాగించి ఆ మేరకు కూడ "అభివృద్ధి" సాధించవచ్చు. కాకపోతే రియల్ ఎస్టేట్ వ్యాపారులది సామాజిక శ్రేయస్సుకు లోబడి సాధించగలిగిన లాభాలతో సంతృప్తి పడే లాభాపేక్ష కాదు. అది అంతకు మించిన లాభాలు రావాలనే దురాశ, అత్యాశ. ఆ దురాశకూ అత్యాశకూ విధానపరమైన మద్దతు తెలిపి, తమ ముడుపులు దక్కించుకోవాలని విధాన నిర్ణేతల ప్రయత్నం.

నగరాలను అభివృద్ధి చేయడమంటే జనం కిక్కిరిసిపోయేలా బహు అంతస్తుల భవనాలు, ఆకాశహర్మ్యాలు, అంగుళం కూడ నేల కనిపించకుండా రోడ్లు, ఫ్లైఓవర్లు, విమానాశ్రయాలు, భారీ మాల్ లు, మెట్రోలు నిర్మించడం మాత్రమే కాదు. ఆ జనానికి అవసరమైన, ప్రాణాధారమైన, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని, జల వనరులను, కనీస సౌకర్యాలను కల్పించడం. కాని రియల్ ఎస్టేట్ వ్యాపారుల లాభాపేక్ష నివాస స్థలాన్ని, వినియోగ వస్తు వ్యామోహాన్ని పెంచే వ్యాపార స్థలాన్ని నిర్మించడం మాత్రమే అభివృద్ధిగా ప్రచారం చేస్తున్నది. రాజకీయ విధాన నిర్ణేతలు ఆ అభివృద్ధి నమూనానే సమర్థించి, రియల్ ఎస్టేట్ వ్యాపారంలో వాటాదార్లవుతున్నారు.

ఏమాటకామాటే చెప్పాలంటే, పాత జీవోను రద్దు చేసి తెచ్చిన కొత్త జీవో మాటవరుసకు కొన్ని రక్షణ చర్యలను, ముందు జాగ్రత్త చర్యలను కూడ ప్రకటించింది. జలాశయాల పరిరక్షణ, నీటి కాలుష్య నివారణ, హరిత జోన్ల ఏర్పాటు, అభివృద్ధి క్రమబద్ధీకరణ, నిర్మాణ అనుమతులలో నియంత్రణలు వంటి అనేక చర్యలు సూచించింది. కాని అవన్నీ కాగితం మీది అక్షరాలు మాత్రమేనని, ఈ జీవో వార్తతో పాటే, 'ఇక భూముల ధరలకు రెక్కలే' అని వచ్చిన వార్తలే చూపుతున్నాయి. పాత జీవో రద్దుతో, కొత్త జీవో ప్రవేశంతో భూముల ధరలకు రెక్కలు వచ్చాయంటే భూవ్యాపారులకు, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు పాత జీవోలో లేనివేవో కొత్త జీవోలో ఉన్నాయన్నమాట. ప్రభుత్వం ప్రజల ఆరోగ్య భద్రతా, పర్యావరణ ప్రయోజనాల కన్న రియల్ ఎస్టేట్ లాభాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చిందన్నమాట. అలా రెక్కలు వచ్చిన ధరలు పెట్టి ఎకరాలు కొనుక్కునే రియల్ ఎస్టేట్ వ్యాపారులు తప్పనిసరిగా వాటిని గజాల్లో అమ్మేటప్పుడు ఆ మేరకు హెచ్చు లాభాలు రావాలనే ఆశిస్తారు. నియంత్రణలకు లోబడితే హెచ్చు లాభాలు రావు గనుక కొత్త జీవోలో ఉన్న నియంత్రణలేవీ అమలులోకి రావు. ఆ నియంత్రణాధికారం ఉన్న అధికారుల అవినీతి పెరగడానికి తప్ప ఆ నియంత్రణ నిబంధనలు మరెందుకూ పనికిరావు. ఈ జీవో రద్దు అంతిమంగా విపరీతంగా అక్రమాస్తులు పోగు చేసుకున్న రాజకీయ నాయకులకు, ఐఎఎస్, ఐపిఎస్ అధికారులకు, డాలర్లలో చెల్లించడం వల్ల ఈ ధరలు చౌక అనిపించే ప్రవాస భారతీయులకు, బహుళ జాతి సంస్థలకు విలాసగృహాలు కల్పించడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. ఈ ఇబ్బడి ముబ్బడి వ్యాపార ఫలితంగా సాధారణ ప్రజానీకానికి, మధ్యతరగతికి కూడ ఇంటి స్థలం, ఇల్లు నెరవేరని కలగా మిగిలిపోతుంది.

జీవో 111 రద్దును వ్యతిరేకించడం, దాన్ని యథాతథంగా కాపాడాలనీ, కచ్చితంగా అమలు చేయాలనీ కోరడం తెలంగాణ జనజీవనం మీదా, తెలంగాణ భవిష్యత్తు మీదా ప్రేమ ఉన్న ప్రతి ఒక్కరి కర్తవ్యం.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

# నిరుద్యోగీ! ఎవరిదీ తెలంగాణ?

*ప్రభుత్వం భారీగా ఉద్యోగ నియామకాలు చేస్తానని ప్రకటించిన నేపథ్యంలో రాష్ట్రంలో నిరుద్యోగ స్థితి పూర్వాపరాలు చర్చిస్తున్నారు* **రాజేంద్రబాబు అర్విణి**

తెలంగాణలో ఉద్యోగ నియామకాల విషయం తలచుకొంటే ఈ మధ్య బాగా పాపులర్ అయిన ఓ తెలుగు సినిమా డైలాగ్ గుర్తుకు వస్తుంది. అడవి సంపదను భారీగా స్మగ్లింగ్ చేసే ఆ సినిమా హీరో అల్లు అర్జున్ "తగ్గేదే లే ..." అంటూ ఎడమ చేత్తో మెడను రాసుకుంటూ ఉంటాడు. తెలంగాణా ప్రభుత్వం కూడా గత ఎనిమిది సంవత్సరాల నుండి ప్రభుత్వోద్యోగ ఖాళీలు భర్తీ చెయ్యడంలో "తగ్గేదే లే" అంటూ స్టేట్‌మెంట్లు ఇస్తూ ఎడమ చేతితో ముక్కు రానుకుంటూనే ఉంది. కానీ ప్రకటిస్తున్న ఖాళీల సంఖ్య ప్రతి ప్రకటనకు తగ్గిపోతూనే ఉంది. నియామకాలు చేస్తామంటూ ప్రకటనలు గుప్పిస్తూనే ఉన్నారు. నిరుద్యోగులు ఎప్పటికి నియామక పత్రాలు అందుకుంటారో ఇప్పటికీ చెప్పలేని పరిస్థితే ఉంది. ఆంధ్ర ప్రాంతం వాళ్లే ఉద్యోగాలన్నీ తన్నుకుపోతున్నారని సర్ది చెప్పటానికి తెలంగాణా రాష్ట్రం అవతరించిన తర్వాత ఇప్పుడు అవకాశం లేదు. కమిటీలని, స్థానికత అని ఏవేవో ముసుగులు కప్పుకొని కాలం వెళ్లదీస్తుంది తెలంగాణ ప్రభుత్వం. కానీ, దేవతావస్త్రాలు విప్పదీసే కాలం దగ్గరపడ్డది. మానం కాపాడుకోవటానికి పై కొసరుగా కొన్ని ఉద్యోగాలయినా నింపాల్సిన అవసరం పాలకవర్గానికి ఏర్పడ్డది.

తెలంగాణా యువతలో అసంతృప్తికి, అసహనానికి కారణమయిన నిరుద్యోగ సమస్య ఈ నాటిది కాదు. 6వ ఆసిఫ్‌జా కాలంలో ప్రారంభమై 7వ ఆసిఫ్‌జా అయిన మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ కాలం లో తారాస్థాయికి చేరుకొని ముల్కీ రూల్స్‌ను ఫర్మానాగా జారీ చెయ్యడం వరకు వచ్చింది. ఆ కాలంలో స్థానికులను కాదని ఉత్తర భారత దేశం నుండి హిందూ కాయస్థ కులస్థులను ఆహ్వానించి మరీ, భారీగా ఉద్యోగాలు కట్టబెట్టడం తెలంగాణా యువత కోపానికి కారణమయ్యింది. 1933లో నిజాం ప్రభుత్వంలో 46,800 మంది నాన్-ముల్కీలు ఉండేవారంటే సమస్య తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. పెద్ద ఉద్యోగాలన్నీ నాన్-ముల్కీ లకు, బంట్రోతు ఉద్యోగాల్లాంటివి తెలంగాణీయులకు! 1948లో నిజాం పాలనకు చరమగీతం పాడి ఎంకె వెల్లోడి ఆధిపత్యంలోకి వచ్చిన తర్వాత కూడా మద్రాస్, బొంబాయి రాష్ట్రాలనుండి దిగుమతి చేసుకున్న ఉద్యోగస్తులతోనే హైద్రాబాద్ రాష్ట్ర ప్రభుత్వ పరిపాలన నడిచింది. ఆంధ్ర రాష్ట్రంలో తెలంగాణను విలీనం చేసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత సమస్య మరింత జటిలమయ్యింది. అందుకనే 1969లో జరిగిన తొలి తెలంగాణా ఉద్యమానికి, 1990వ దశకంలో ప్రారంభమయి 2014లో ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం సాధించేవరకు సాగిన మలి తెలంగాణ ఉద్యమానికి మూల ధాతువుల్లో ఒకటి నిరుద్యోగ సమస్య.

నేను 1969 తొలి తెలంగాణ ఉద్యమంలో క్రియాశీలకంగా పాల్గొన్నాను. అప్పుడు నేను పాలమూరు జిల్లాలో తాలూకా కేంద్రమయిన ఓ చిన్న పట్టణంలో కాలేజీ విద్యార్థిని. మా కాలేజీలో ఒకరిద్దరు లెక్చరర్లు తప్ప అందరూ ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల నుండి వచ్చినవారే. నేను చదివిన స్కూళ్లల్లో కూడా అదే పరిస్థితి. నాకు చదువు నేర్పించి, విద్యాబుద్ధులు గరిపిన టీచర్లు, లెక్చరర్ల పట్ల ఎంతో గురుభావం ఉన్నా, ప్రాంతీయత ప్రశ్న వచ్చేటప్పటికి మనస్సు చివుక్కుమనిపించేది. చదువయిపోయిన తర్వాత మన పరిస్థితి ఏంటి అన్న ఆలోచన మమ్మల్ని డిస్టర్బ్ చేసేది. 1969 ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసి పడడానికి, అందులో విద్యార్థులు, యువకులు సమరశంఖం పూరిస్తూ ముందుకు కదలడానికి ఈ మానసిక స్థితి కూడా ఒక కారణం.

దాదాపు అదే సమయంలో కొఠారి కమీషన్ (1966) సిఫారస్‌ల కనుగుణంగా విద్యావ్యవస్థలో కొన్ని మార్పులు వచ్చి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రభుత్వ జూనియర్ కళాశాలలు ప్రారంభమయ్యాయి. మొత్తం రాష్ట్రంలో ప్రతి తాలూకాకు ఒకటి చొప్పున వందల సంఖ్యలో కళాశాలలు ప్రారంభమయ్యాయి. వాటిల్లో వేల సంఖ్యలో జూనియర్ లెక్చరర్ పోస్టులు మంజూరయ్యాయి. 1969 ఉద్యమంలో పాలుపంచుకున్న యువతలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ డిగ్రీ ఉన్నవారు చాలామంది ఆ కళాశాలల్లో నియామకాలు పొంది కొంత ఉపశమనం పొందారు.

తెలంగాణ మలి ఉద్యమం తర్వాత 10 జిల్లాలు 33 జిల్లాలయ్యాయి, కొత్తగా కొన్ని మండల్ ఆఫీసులు తెలిచారు. మండలానికో జూనియర్ కళాశాల పథకం అమల్లోకి వచ్చింది. కొన్ని చోట్ల డిగ్రీ కళాశాలలు కూడా ప్రారంభించారు. అప్పటికే ఉన్న యూనివర్సిటీలతో పాటు జిల్లాకో విశ్వవిద్యాలయం అన్న ఆలోచన కార్యరూపం దాల్చింది. మెడికల్ కళాశాలలు కూడా అదే సంఖ్యలో ప్రారంభమయ్యాయి. కానీ విషాదం ఏమిటంటే వీటిల్లో వేటిల్లో ఒక్క నియామకం కూడా జరగలేదు.

తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమిషన్ వద్ద రిజిస్టర్ చేసుకున్న నిరుద్యోగుల సంఖ్య అక్టోబర్ 2016 నాటికే 13 లక్షల 60 వేలు. అది 2020 జూన్ నాటికి 28 లక్షలయింది. ఈ రెండు సంవత్సరాల కాలంలో ముప్పయ్ లక్షలు దాటినా ఆశ్చర్య పడనక్కరలేదు. క్లరికల్

ఉద్యోగాలకు ప్రకటన వెలువడితే 14 లక్షల మంది నిరుద్యోగుల నుండి దరఖాస్తులు వస్తాయని మా అంచనా అని తెలంగాణ స్టేట్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ చైర్మన్ బి. జనార్దన్ రెడ్డి ఇటీవలే పత్రికల వారికి వెల్లడించాడు.

నేను పైన ప్రస్తావించింది నూతన ఉద్యోగ కల్పన గురించి. నేటి తెలంగాణ రాష్ట్ర పరిస్థితిలో అదొక సుదూర భావన. ఆఫీసులలో వేల సంఖ్యల్లో ఖాళీలు భర్తీ కాక 'బాడ్ గవర్నెన్స్' అపఖ్యాతిని మూట గట్టుకున్న తెలంగాణా ప్రభుత్వం, స్కూళ్ళు, కాలేజీలలో, యూనివర్సిటీ లలో సంవత్సరాల తరబడి అధ్యాపక పోస్టులను ఖాళీగా ఉంచి కొన్ని తరాల పేద విద్యార్థుల భవిష్యత్తును అంధకారంలో ఉంచిన తెలంగాణ ప్రభుత్వం నుంచి నూతన ఉద్యోగాల కల్పన గురించి ఆశించడం అత్యాశే అవుతుంది. ఇప్పుడున్న ఖాళీలయినా భర్తీ చేయండి అన్నది ప్రస్తుతం ఆక్రోశంతో కూడిన తెలంగాణా యువత నినాదం.

దాదాపు 30 లక్షల మంది పేరు నమోదు చేసుకున్న నిరుద్యోగులయితే, ఉన్న ఖాళీలెన్ని అన్నది మరొక వింతయిన మాయల ఫకీరు మాయాజాలం. ఉమ్మడి రాష్ట్రంలో ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రభుత్వ ఉద్యోగుల సంఖ్య 12 లక్షల 50 వేలు. జనాభా ప్రాతిపదికన తెలంగాణ బిడ్డల వాటా 5 లక్షల ముప్పయి వేలని జయశంకర్ సారు డిమాండ్ చేసారు. కెసిఆర్ అది నిజం అన్నారు. గతంలో ఎన్‌టిఆర్ ప్రభుత్వం జారీ చేసిన జి.ఓ. 610కు ఎలా తూట్లు పొడిచారో పరిశీలించడం కోసం ఏర్పాటయిన గిర్ గ్లాని కమిటీ రిపోర్ట్ ప్రకారం తెలంగాణా వారు కేవలం 1 లక్షా 87,000 మాత్రమే ఉన్నారు. కానీ తెలంగాణా కోటాలో నియమింపబడ్డ వాళ్ళు అయిదు లక్షల పైనే ఉన్నారు. అంటే మూడు లక్షల ఉద్యోగాలకు మించి తెలంగాణేతరులు న్యాయబద్ధంగా తెలంగాణ యువతకు రావలసిన ఉద్యోగాలను ఆక్రమించి ఉన్నారన్న మాట. అవన్నీ తెలంగాణలో చదువుకున్న యువతకు వస్తేనే కదా తెలంగాణా ఉద్యమ ఆకాంక్ష నెరవేరినట్లు.

సరే, తెలంగాణ యువతకు న్యాయంగా దక్కవలసిన మూడు లక్షల ఉద్యోగాలది గతించిన చరిత్ర అనుకున్నా, వర్తమానం సంగతి ఏమిటి? తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా అవతరించిన పిదప 2014 నవంబర్ 24 న ముఖ్యమంత్రి 1,07,744 ఉద్యోగాలు రెండేళ్లలో భర్తీ చేస్తామని శాసన సభ సాక్షిగా అధికారిక ప్రకటన చేసారు. ఈ లక్షా ఏడువేల ఏడువందల నలభైనాలుగు ఉద్యోగాలలో 25 వేల ఉపాధ్యాయ పోస్టులు లేవు. ఎందుచేతనంటే ముఖ్యమంత్రి ఆ ప్రకటన చేసిన కొంతకాలం తర్వాత అప్పటి ఆర్థిక శాఖామంత్రి బడ్జెట్‌పై జరిగిన చర్చకు సమాధానమిస్తూ 1,07,744 పోస్టులతో పాటు 25 వేల మంది ఉపాధ్యాయులను కూడా నియమింపబోతున్నట్టు ప్రకటించాడు. అంటే ఉద్యోగ, ఉపాధ్యాయ పోస్టులలో ఒక లక్షా ముప్పయి రెండు వేల ఏడు వందల నలభై నాలుగు ఖాళీలను భర్తీ చేయబోతున్నట్టు ప్రభుత్వం కమిట్ అయ్యింది. ఇవి తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమిషన్ ద్వారా జరిగే నియామకాలు. పోలీస్ బోర్డు, విద్యుత్ సంస్థలు, సింగరేణి, గురుకులాలు లాంటి ప్రత్యేక సంస్థలు తమకు తాముగా చేపట్టే నియామకాలు వేరు.

ఇదిలా ఉండగా రిటైర్డ్ ఐఎఎస్ ఆఫీసర్ బిస్వాల్ అధ్యక్షతన ఏర్పాటయిన పే రివిజన్ కమీషన్ -2020 రాష్ట్ర ప్రభుత్వంలో 1,91,126 ఖాళీలు ఉన్నట్టు తన నివేదికలో ప్రకటించింది. ఆ నివేదిక ప్రకారం రాష్ట్రంలో 4,91,304 ప్రభుత్వ ఉద్యోగాలుంటే వాటిల్లో 3,00,178 మంది ఉద్యోగులు మాత్రమే పనిచేస్తున్నారు. (వీటిల్లో కాంట్రాక్టు, పార్ట్ టైం, విద్య వాలంటీర్లు, ఔట్ సోర్సింగ్ వగైరాలు అంతా కలిసి). ఆ నివేదిక ప్రకారం స్కూల్ ఎడ్యుకేషన్ డిపార్ట్‌మెంట్‌లో అత్యధికంగా 1,37,651 ఉద్యోగాలుండగా వాటిల్లో పని చేస్తున్న వారి సంఖ్య 1,13,853 మాత్రమే. ప్రజల ఆరోగ్య అవసరాలు చూడడం కోసం ఏర్పడిన ఆరోగ్య శాఖలో 52,906 పోస్టులకు అనుమతి ఉండగా ఆ శాఖలో 22,336 మంది మాత్రమే పనిచేస్తున్నారు. ఈ రకంగా కొన్ని ప్రధానమయిన ప్రభుత్వ శాఖలలో ఎన్ని ఉద్యోగాలున్నాయి వాటిల్లో ఎన్ని ఖాళీలున్నాయో వాటి వివరాలు పొందుపరిచారు. మొత్తం మీద రాష్ట్రంలో అనుమతించబడిన ఉద్యోగాలలో 61 శాతం మేరకు మాత్రమే ఉద్యోగస్తులు పనిచేస్తున్నారని, మిగతా 39 శాతం ఖాళీలేనని ఆ కమీషన్ తేల్చి చెప్పింది.

బిస్వాల్ కమీషన్ కొన్ని ఆసక్తికరమయిన విషయాలు కూడా వెలుగులోకి తెచ్చింది. తెలంగాణా రాష్ట్రంలో ప్రతి వంద మంది జనాభాకు 1.40 నిష్పత్తి లో ప్రభుత్వ ఉద్యోగాలు ఉన్నాయి. (కానీ, ప్రస్తుతం ప్రతి వంద మందికి 0.85 మంది ఉద్యోగులు మాత్రమే పని చేస్తున్నారు, మిగతా పోస్టులన్నీ ఖాళీలే!) అంటే ప్రతి 1000 మంది జనాభాకు 14 గురు ఉద్యోగస్తులు ఉండాలన్న మాట. మరొక ముఖ్యమయిన విషయం ఏమిటంటే కేంద్రంలో అధికారాన్ని అనుభవిస్తున్న పార్టీ ఏ రాష్ట్రం, తమకు అణిగి మణిగి ఉండాలని, ఈ దేశంలో ఆ పౌరులు రెండవ శ్రేణి పౌరులుగా మాత్రమే బతకాలని ఆదేశిస్తూ అణిచివేత ధోరణి అవలంబిస్తుందో ఆ రాష్ట్రం జమ్మూ కశ్మీర్‌లో ప్రతి 1000 మంది జనాభాకు దేశంలోనే అత్యధికంగా 40 మంది ప్రభుత్వ ఉద్యోగస్తులు ఉన్నారు (సరిగ్గా చెప్పాలంటే ప్రతి 100 మందికి 3.59 మంది ఉద్యోగస్తులు). అదే విధంగా, 2014 ఎన్నికలలో ఏ రాష్ట్రం అభివృద్ధిని మోడల్‌గా తీసుకొని తమకు ఓటు వేసి గెలిపించమని ప్రజలను అభ్యర్థించి గెలుపొంది అప్పట్నుంచి అధికారం అనుభవిస్తున్నారో ఆ రాష్ట్రం గుజరాత్‌లో ప్రతి 1000 మంది జనాభాకు ఉన్నది కేవలం ముగ్గురు ప్రభుత్వోద్యోగులే (100 మందికి 0.31).

ఇకపోతే రేపు అందరూ టీవి దగ్గర కూచోండి, నేనొక ముఖ్యమైన ప్రకటన చేయబోతున్నాను అని ఊరించి మరీ శాసన సభలో ముఖ్యమంత్రి గారు ప్రకటించిన ఖాళీల సంఖ్య 91,142. అందులో 11,103 పోస్టులలో అన్ని అర్హతలు కలిగి కాంట్రాక్ట్ పద్ధతిలో నియమింపబడిన ఉద్యోగ, ఉపాధ్యాయ అభ్యర్థులు పనిచేస్తున్నారు, వారి సర్వీసును క్రమబద్ధం చేస్తామన్నారు. అవి పోను మిగిలిన ఖాళీలు 80,039. తమ పేరు నమోదు చేసుకున్న నిరుద్యోగులే 30 లక్షలయితే పేరు నమోదు చేసుకోని వారు ఎంతమందో? గ్రామీణ ప్రాంతంలో అరకొర చదువులతో నిరుద్యోగితకు గురవుతున్న అభాగ్యులెందరో?

# ధాన్యం రైతుల సంక్షోభం - ప్రభుత్వాల వీధి పోరాటాలు

*వరి ధాన్యం కొనుగోలుపై రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల వివాదం నేపథ్యంలో అసలు సమస్యను వివరించి పరిష్కారాలు సూచిస్తున్నారు* **కన్నెగంటి రవి**

మనుషుల కడుపు నింపే అన్నం తెలంగాణలో ప్రధానంగా వరి ధాన్యం నుండే వస్తుంది. కానీ గత రెండేళ్లుగా తెలంగాణలో ధాన్యం పండించే రైతులు మాత్రం ఆనందంగా లేరు. ఒక వైపు వరి సాగు ఉత్పత్తి ఖర్చులు పెరిగి పోతున్నాయి. మరో వైపు భారీ వర్షాలు, వడగండ్ల వానలు లాంటి ప్రకృతి వైపరీత్యాలతో సగటు దిగుబడులు పడిపోతున్నాయి. అన్నిటికీ మించి పండించిన వరి ధాన్యం మార్కెట్‌లో అమ్ముకోవడం అత్యంత కష్టమైన వ్యవహారంగా మారింది.

ప్రభుత్వం ధాన్యం సేకరించని సమయంలో రైతులు పండించిన ధాన్యానికి మార్కెట్‌లో ప్రైవేట్ వ్యాపారులు కనీస మద్దతు ధర (ఎంఎస్‌పి) కూడా చెల్లించడం లేదు. ప్రభుత్వం సేకరించిన సమయంలో కూడా నాణ్యత పేరుతో, రైస్ మిల్లర్లు ప్రతి సీజన్‌లో క్వింటాలుకు 8-10 కిలోల ధాన్యం (కనీసం క్వింటాలుకు 200 రూపాయలు) రైతుల నుండి దోచుకుంటున్నారు.

తెలంగాణలో ఖరీఫ్ (వానాకాలం), రబీ (యాసంగి) సీజన్‌లలో రైతులు వరి ధాన్యం పండిస్తున్నారు. 2014-2015లో వానా కాలంలో స్థూల సాగు భూమిలో 22 శాతంలో మాత్రమే వరి పండించిన రైతులు 2020-2021 సంవత్సరం వచ్చే సరికి 37.1 శాతం భూమిలో వరి పండిస్తున్నారు. యాసంగిలో 2014-2015లో స్థూల సాగు భూమిలో 43.4 శాతం భూమిలో వరి సాగు కాగా, 2020-2021 వచ్చే సరికి 76 శాతం భూమిలో వరి సాగు విస్తరించింది.

ఫలితంగా మన రాష్ట్ర అవసరాలకు మించి వరి ఉత్పత్తి అవుతున్న మాట వాస్తవం. ముఖ్యంగా యాసంగిలో వరి సాగు విస్తీర్ణం బాగా పెరిగిన తరువాత, మార్కెటింగ్ సమస్యలు పెరిగాయి.

ఖరీఫ్‌లో జూన్ - అక్టోబర్ మధ్య సాగయ్యే వరితో ఇబ్బంది లేదు. ఉష్ణోగ్రతలు అదుపులో ఉంటాయి. సన్నరకాలు ఎక్కువగా పండుతాయి. స్థానిక మార్కెట్ ఉంటుంది. మిల్లింగ్‌లో కూడా సమస్యలు ఉండవు. నూకల శాతం అదుపులో ఉంటుంది. ఈ సీజన్లో ప్రతి సంవత్సరం 40 నుండీ 50 లక్షల టన్నుల బియ్యం (60 నుండీ 80 లక్షల టన్నుల ధాన్యం) ఎఫ్‌సిఐ సేకరిస్తుంది కనుక, మార్కెట్ పరంగా ఇబ్బంది కూడా తక్కువ.

యాసంగికి వచ్చే సరికే వరి సాగుకు ఇబ్బంది ఎక్కువ. డిసెంబర్ నుండీ మే వరకూ ఈ సీజన్ విస్తరించి ఉంటుంది. మరీ ముఖ్యంగా ఏప్రిల్ - మే నెలలలో ధాన్యం కోతకు వచ్చే సమయానికి ఉష్ణోగ్రతలు 40-44 డిగ్రీలు దాటతాయి. రైతులు కూడా ఎక్కువ దిగుబడులు ఆశించి, తెగుళ్లు తక్కువ వచ్చే దొడ్డు రకాలను పండిస్తారు. ఖరీఫ్ లాగే రబీలో కూడా సన్న రకాలను పండించే రైతులు కొందరున్నా, ఆ స్థితి కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఉంటుంది. చాలా కాలంగా ఎఫ్‌సిఐ పార్‌బాయిల్డ్ బియ్యం సేకరిస్తూ వచ్చింది కనుక, మిల్లర్లు కూడా ధాన్యాన్ని పార్‌బాయిల్డ్ చేసి, ఎఫ్‌సిఐకి లెవీ బియ్యం ఇస్తున్నారు. ఇలాగే కొనసాగితే కథ బాగానే ఉండేది.

గత రెండేళ్లుగా ఎఫ్‌సిఐ తాను తెలంగాణ నుండి పార్‌బాయిల్డ్ బియ్యం సేకరించలేననీ, పార్‌బాయిల్డ్ బియ్యం వినియోగించే రాష్ట్రాలు, ఎఫ్‌సిఐ నుండి గతంలో లాగా తీసుకోవడం లేదనీ, కాబట్టి పార్‌బాయిల్డ్ కాకుండా తెలంగాణ ప్రభుత్వం కూడా ముడి బియ్యం (రా రైస్) ఎఫ్‌సిఐకి ఇవ్వాలనీ చెబుతూ వస్తున్నది. మొదట్లో తాము పార్‌బాయిల్డ్ బియ్యం మాత్రమే ఇస్తామని గట్టిగా చెప్పిన రాష్ట్ర

---

అయితే నిరుద్యోగులందరికీ ప్రభుత్వ ఉద్యోగాలే ఇవ్వాలని ఈ వ్యాసకర్త కోరడం లేదు. యువతకు ఉద్యోగ, ఉపాధి అవకాశాలు కల్పించడం విషయంలో తెలంగాణ ప్రభుత్వానికి శాస్త్రీయమయిన, ఆచరణాత్మకమయిన విధాన నిర్ణయం ఉందా అన్నది ప్రశ్న. ఉంటే ఈ 80 వేల ఖాళీలు ప్రకటించడానికయినా ఎనిమిదేళ్ల కాలం పట్టేదా అన్నది సంశయం. ప్రకటించిన ఖాళీలు భర్తీ చేస్తే సాలీనా రు. 7,300 కోట్లు వేతనాల రూపంలో ప్రభుత్వంపై ఆర్థిక భారం పడుతుందని కూడా ముఖ్యమంత్రి గారు ప్రకటించారు. ఇప్పటికే ఉద్యోగస్తులకు, పదవీ విరమణ పొందిన వాళ్లకు ప్రతి నెలా వేతనాలు, పెన్షన్‌లు బట్వాడా చేసే పనిలో అయోమయ పరిస్థితి నెలకొంది. కొన్ని జిల్లాలవారికి 15వ తారీఖున కూడా జీతాలు, వేతనాలు రాని పరిస్థితి. ఈ అస్తవ్యస్త స్థితిలో కనీసం ప్రకటించిన 80 వేల ఖాళీలయినా ప్రభుత్వం భర్తీ చేస్తుందా అని నిరుద్యోగులకు సందేహం రావడం సహజమయిన విషయమే. ఎన్నికల కాలం సమీపిస్తున్నది కాబట్టి మాటకు కట్టుబడి ఉండే అవకాశాలే ఎక్కువ. తెలంగాణలో నిరుద్యోగ భారతానికి ఎన్ని పర్వాలో! కానీ ఒక్క విషయం చెప్పి ఈ వ్యాసం ముగిస్తాను. ప్రత్యేక రాష్ట్రంగా తెలంగాణ అవతరించిన తర్వాత తెలంగాణ రాష్ట్ర ఆదాయం పెరిగిన మాట వాస్తవమే. కానీ ఆర్థిక విషయాలలో పటిష్టమయిన, నియమబద్ధమయిన ప్రణాళిక లేదు. అది సంభవించే వరకు ఉద్యోగ కల్పన, ఉన్న ఉద్యోగులకు వేతనాలు, రిటైర్డ్ ఉద్యోగులకు పెన్షన్లు సమకూర్చడం గగనమే!

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

ప్రభుత్వం, 2020–21 చివరిలో, కారణమేదైనా తాము ఇకపై ఎఫ్‌సిఐకి పార్‌బాయిల్డ్ బియ్యం సరఫరా చేయబోమని లేఖ ఇచ్చింది. ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా ఆత్మరక్షణలో పడడానికి, కేంద్రం మొండిగా ఉండడానికి ఈ లేఖే ప్రధాన కారణం.

ప్రపంచ వాణిజ్య సంస్థ షరతులు ఉన్నాయనే సాకులు చెప్పి, ఎఫ్‌సిఐ పూర్తిగా తప్పించుకోకుండా, ఒక మనిషికి నెలకు 12 కిలోల ఆహార ధాన్యాలు అవసరం అనే ఎన్ఐఎన్ సంస్థ సిఫారసుల మేరకు, దేశ ఆహార భద్రతా చట్టం ప్రకారమే, అన్ని రాష్ట్రాల నుండి బియ్యం, గోధుమలు, చిరు ధాన్యాలు మరింతగా సేకరించి పంపిణీ చేయడానికి చర్యలు చేపట్టాలి. ఇప్పుడున్న నాణ్యతా ప్రమాణాలను సవరించి, రెగ్యులర్‌గా మనుషులు తినగలిగిన బియ్యాన్ని, ఆయా రాష్ట్రాల ప్రజలు ఆహారంగా వినియోగించే వరి రకాలను మాత్రమే రైస్ మిల్లుల నుండి బియ్యంగా సేకరించి పంపిణీ చేయాలి. అప్పుడే రేషన్ వ్యవస్థలో నెలకొన్న అవినీతి కూడా మాయమవుతుంది. దొడ్డు, సన్నం వరి రకాల మధ్య ఎంఎస్‌పి కూడా పెద్ద తేడా ఏమీ లేదు. దిగుబడుల్లో తేడా ఉంటుందని అనుకుంటే, రైతులు నష్టపోకుండా సన్న రకాలకు ఎంఎస్‌పి పెంచి ధాన్యం సేకరించాలి.

తెలంగాణలో కేవలం పార్‌బాయిల్డ్ బియ్యమే పండుతాయని రాష్ట్ర ముఖ్యమంత్రితో సహా, మంత్రులు, ప్రజా ప్రతినిధులు చేస్తున్న ప్రచారం పూర్తి అబద్ధం. పార్‌బాయిల్డ్ అనేది వరి రకం కాదు. అది మిల్లింగ్ ప్రక్రియలో ఒక భాగం మాత్రమే. యాసంగిలో ఉష్ణోగ్రతల రీత్యా, మిల్లర్లు పార్‌బాయిల్డ్ (వేడి నీళ్ల టాంకర్లలో ధాన్యం ఉడక బెట్టడం) చేయకపోతే మిల్లింగ్‌లో నూకలు ఎక్కువ, ముడి బియ్యం తక్కువ వస్తాయి. నిజానికి ఏ పార్‌బాయిల్డ్ రైస్ మిల్లులో అయినా, ముడి బియ్యం పట్టవచ్చు.

రాష్ట్రంలో సరైన పంటల ప్రణాళిక చేసుకోవడం రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత. రాష్ట్ర ప్రజల, పశువుల ఆహార అవసరాలు, స్థానిక వ్యవసాయాధారిత పరిశ్రమల ముడి సరుకుల అవసరాలు దృష్టిలో ఉంచుకుని ఈ ప్రణాళిక చేసుకోవాలి. లేదా ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థలు చేసుకునే వ్యవసాయ ఉత్పత్తుల మార్కెటింగ్ ముందస్తు ఒప్పందాలను కూడా ఈ ప్రణాళిక సమయంలో దృష్టిలో పెట్టుకోవచ్చు.

ఈ నేపథ్యంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, బిజెపి, టిఆర్ఎస్ పార్టీలు తమ రాజకీయ ప్రయోజనాల కోసం, ధాన్యం రైతులతో బంతాట ఆడడం మానేసి, తక్షణమే చర్చలకు పూనుకోవాలి. వాస్తవ పరిస్థితులను గుర్తించి, ప్రజలకు నిజాలు మాత్రమే చెప్పాలి. ధాన్యం సేకరణ సమస్యను ఈ సీజన్‌కు సంబంధించి తక్షణమే పరిష్కరించాలి. నెపం ఒకరి మీద ఒకరు నెట్టుకుని వీధి పోరాటాల ద్వారా, ఈ రెండు పార్టీలూ, చివరికి ధాన్యం సేకరణ చేయడం మానేస్తే, రైతులు తమ ధాన్యాన్ని తక్కువ ధరలకు వ్యాపారులకు అమ్ముకుని నష్టపోతారు. మరింత అప్పుల ఊబిలో కూరుకుపోతారు.

తెలంగాణ రాష్ట్రంలో ఈ యాసంగిలో రైతులు పండించి తెచ్చే మొత్తం ధాన్యాన్ని ఎంఎస్‌పితో కొనుగోలు చేయడానికి ఏప్రిల్ 10 నాటికి వరి పండించిన అన్ని గ్రామ పంచాయితీలలో ఐకేపి లేదా రైతు సహకార సంఘాలు, ఎఫ్‌పిఓల ఆధ్వర్యంలో సేకరణ కేంద్రాలను ప్రారంభించాలి.

ముడి బియ్యం పట్టినప్పుడు వచ్చే నూకలకు ఎలాగూ కొంత విలువ ఉంటుంది. (కిలో 17 రూపాయలు). క్వింటాలుకు 50 కిలోలే ముడి బియ్యం వచ్చే అవకాశం ఉన్నప్పుడు, ఎఫ్‌సిఐ మార్గదర్శకాలను సవరించుకుని, ఆ మేరకే ప్రతి క్వింటాలు ధాన్యం నుండీ ముడి బియ్యం ఈ సంవత్సరం ప్రత్యేక సందర్భంగా పరిగణించి తీసుకోవచ్చు. లేదా యాసంగిలో అదనపు నూకలు రావడం వల్ల రైస్ మిల్లు యజమానులకు జరిగే నష్టాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చెరి సగం భరించవచ్చు. నష్టం అంచనాలను మిల్లర్లతో కలసి, ఉమ్మడిగా, శాస్త్రీయంగా లెక్కించి ఫైనల్ చేయవచ్చు. కేంద్రం నష్టం భరించడానికి ముందుకు రాకపోతే రాష్ట్ర ప్రభుత్వమే నష్టం మొత్తాన్ని భరించాలి. ధాన్యం కొనుగోలు చేయాలి. కేవలం రాష్ట్ర మార్కెట్ యార్డులలో ప్రైవేట్ వ్యాపారులకు కొనుగోలు సౌకర్యాలు కల్పించి చేతులు దులుపుకుంటే రైతులకు ఎంఎస్‌పి అందే అవకాశం లేదు.

ఎఫ్‌సిఐ ప్రతి సంవత్సరం ధాన్యం, గోధుమలు సేకరిస్తూ, నిలవ సౌకర్యాలు సరిగా కల్పించకుండా ఎలుకలకు, తడవడానికి వదిలేస్తూ, చేస్తున్న వేల కోట్ల నష్టం కంటే, రైస్ మిల్లర్లకు జరిగే ఈ నష్టం భరించడం చాలా తేలిక. అలాగే రాష్ట్ర ప్రభుత్వం కూడా అడ్డగోలుగా వ్యవసాయం చేయని భూములకు కూడా రైతుబంధు పంపిణీ చేస్తూ, వేల కోట్లు దుర్వినియోగం చేస్తున్న దానితో పోల్చినప్పుడు, రైస్ మిల్లర్లకు జరిగే ఈ నష్టాన్ని పూడ్చడం పెద్ద భారం కాదు.

తెలంగాణలో యాసంగిలో వచ్చే సంవత్సరం వరి విస్తీర్ణాన్ని మరింత తగ్గించాలి. ఖరీఫ్‌లో కూడా వరి, పత్తి విస్తీర్ణాన్ని తగ్గించడం కోసం ప్రయత్నం చేయగలిగితే మాత్రమే, యాసంగిలో ప్రత్యామ్నాయ పంటలు సకాలంలో సాగు చేయవచ్చు.

పప్పు ధాన్యాలు, నూనె గింజలు, చిరు ధాన్యాలు లాంటి ప్రత్యామ్నాయ పంటలు కూడా ఎంఎస్‌పితో సేకరించడానికి కేంద్ర నాఫెడ్ సంస్థ, రాష్ట్ర మార్క్ ఫెడ్ సంస్థ ముందుకు రావాలి. రైతులకు ఈ పంటలకు ఎంఎస్‌పి అందినప్పుడు మాత్రమే వచ్చే సీజన్‌లో మళ్లీ వాటిని సాగు చేస్తారు.

రాష్ట్రానికి ఈ వానాకాలం సీజన్ నుండే పంటల బీమా పథకాలు మళ్లీ ప్రవేశ పెట్టి రైతులకు భరోసా కల్పించాలి. 2018–2019, 2019–2020 సంవత్సరాల పంటల బీమా పరిహారాలను వెంటనే చెల్లించాలి. రాష్ట్ర హైకోర్టు తీర్పు మేరకు 2020 సంవత్సర పంట నష్ట పరిహారాన్ని వెంటనే రైతులకు చెల్లించాలి. హైకోర్టు తీర్పుపై సుప్రీంకోర్టులో వేసిన అప్పీల్‌ను ఉపసంహరించుకోవాలి. రాష్ట్ర రైతుల రుణమాఫీ హామీని ఒకే విడతలో అమలు చేసి రైతులను రుణ విముక్తులను చేయాలి. కౌలు, పోడు రైతులతో సహా వాస్తవ సాగు దారులకే రైతుబంధు సహాయాన్ని అందించాలి.

*(రచయిత రైతు స్వరాజ్య వేదిక)* వీ

# ప్రజలే ఇంధనంగా ఇథనాల్ ప్రాజెక్టు

***ఇథనాల్ ఉత్పత్తి పేరుతో వెనుకబడిన ప్రాంతాల్లో భూవనరులు, జల వనరులు కొల్లగొడుతూ, ప్రమాదకర కాలుష్యానికి దారితీయనున్న పరిశ్రమ గురించి వివరిస్తున్నారు* ఎం. రాఘవాచారి**

చిత్తనూరు, పరిసర 32 గ్రామాలు, ప్రజలు కాలుష్యం బారిన పడవలసిందేనా?

భూమి కోల్పోయి రైతాంగం వలసబాట పట్టవలసిందేనా?

'జూరాల ఆర్గానిక్ ఫార్మ్స్ & ఆగ్రో ఇండస్ట్రీస్ ఎల్ఎల్పి' కంపెనీ పెద్ద మొత్తంలో నీటిని, ఆహార ధాన్యాలను కబళించి ఇథనాల్ ఉత్పత్తి చేసేది ప్రభుత్వంతో వ్యాపారం చేయటానికి, సొంత అభివృద్ధికే కానీ ప్రజల అభివృద్ధికి కాదు.

నారాయణపేట జిల్లా మరికల్ నుండి ఆత్మకూరు వెళ్లే దారిలో పదమూడు కిలోమీటర్ల దూరంలో చిత్తనూరు గ్రామం ఉంది. ఆ ఊరికి జీవధారగా మన్నెవాగు పారుతుంటుంది. మన్నెవాగు క్రమంగా ఊకశెట్టివాగులోకి చేరి రామన్‌పాడు ప్రాజెక్టు నింపుతుంది. వానలు బాగా పడితే కరువులుండేవి కావు. కోయిల్‌సాగర్ ప్రాజెక్టు నిండి కొంత ఆధారమయ్యేది. క్రమంగా ఏర్పడిన వర్షాభావ పరిస్థితులు జిల్లా అంతటా సంక్షోభ కారణమైనాయి. ప్రజలకు వలసలు తప్పలేదు. కరువు వలసల నివారణ కోసం సాగునీటి సాధన ఉద్యమాలు చేపట్టవలసి వచ్చింది. జిల్లాలో జరుగుతూ వచ్చిన జలసాధన ఉద్యమాలలో తెలంగాణకు ప్రాతినిధ్యస్థాయి వుంటే తప్ప కోర్టుల ద్వారా నైనా నీరు సాధించుకోవటం సాధ్యం కాదనే అవగాహన పెరిగింది.

1973లో బచావత్ ట్రిబ్యునల్ కోయిల్‌సాగర్‌కు నీరు కేటాయించినా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆ తీర్పును అమలు చేయలేదు. అనివార్యంగా జిల్లాలో 1994లో మలిదశ తెలంగాణ ఉద్యమం మొదలైంది. జలసాధన పోరాటం, తెలంగాణ సాధన పోరాటం జమిలిగా జరిగాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జలయజ్ఞంలో భాగంగా కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, కోయిల్‌సాగర్ ఎత్తిపోతల పథకాల పనులు 2005లో ప్రారంభించి 2012 నాటికి తొలి దశ పూర్తి చేసింది. భీమాను ఫేజ్-1, ఫేజ్2గా విభజించి నారాయణపేట ప్రాంతానికి నష్టం చేసింది. అదొక ప్రత్యేక సమస్య. కోయిల్‌సాగర్ పథకంలో స్టేజి1 నాగిరెడ్డిపల్లి దగ్గర, స్టేజి 2 మరికల్ దగ్గర ఉన్నాయి. రెండు చోట్ల ఉన్న పంపులు రెండూ పని చేస్తే 90 రోజులలో, ఒక్కటే పనిచేస్తే 170 రోజులలో 4.5 టిఎంసిల నీటిని కోయిల్‌సాగర్‌లోకి ఎత్తిపోస్తాయి. 2012లో కోయిల్‌సాగర్ లిఫ్టు పనిచేయడం మొదలైన తరువాత మరికల్ మండలంలోను చిత్తనూరు పరిసర గ్రామాలలోను భూగర్భజలం పెరిగింది. కాలువ, భూగర్భ జలాలతో రైతులు రెండు పంటలు పండించుకోవటం మొదలైంది. గుంపువలసలు తగ్గుముఖం పట్టినాయి.

'మా బతుకు మేం బతుకుతున్నాం' అని ప్రజలు అనుకుంటున్న తరుణంలో 'జూరాల ఆర్గానిక్ ఫార్మ్స్ & ఆగ్రో ఇండస్ట్రీస్ ఎల్ఎల్పి' ఇథనాల్ ఉత్పత్తి పరిశ్రమ స్థాపన పేరుతో ముందుకు వచ్చింది. ఇది అక్కడ చేసే పనులతో అందమైన ఆ ప్రదేశంలో తిరుగాడుతూ రైతులతోడుగా జీవనం చేసే వందలాది జింకలు చెదిరిపోతున్నాయి. ఆగమాగం అవుతున్నాయి. వేలాది నెమళ్లు బెదిరిపోతున్నాయి. ఆ భూములలో రోజుకు ఒక ట్యాంకర్ ఆయిల్ వాడే స్థాయిలో భారీ వాహనాలు తిరుగుతున్నాయి. అవి భూమి మీద యుద్ధం చేస్తున్నట్లుగా పనిచేస్తున్నాయి. గ్రామ పంచాయితీ అనుమతి పొందకుండానే ఈ పనులు చేస్తున్నారు. గ్రామ సర్పంచ్, కార్యదర్శి స్వయంగా తాము అనుమతి ఉత్తర్వు ఇవ్వలేదని చెబుతున్నారు. అయినా పనులు సాఫీగా జరుగుతున్నాయి. ఇంకోవైపు చిత్తనూరు గ్రామ ప్రజలు, విద్యావంతులైన గ్రామ యువజనులు ఇప్పటికి మూడు నెలలుగా వివిధ రూపాలలో ప్రాతినిధ్యాలు, ఆందోళనలు చేస్తున్నారు. అప్పుడప్పుడు పత్రికలు ఈ విషయానికి ప్రచారం కల్పిస్తున్నాయి.

చిత్తనూరు గ్రామంలోని ఒక రైతు వలసపోయి వ్యాపారంలో స్థిరపడి మిగులు సంపాదించి భూమి కొన్నాడు. అది క్రమంగా చేతులు మారుతూ 400 ఎకరాలను మించిపోయింది. ఆ భూమిని జూరాల ఆర్గానిక్ ఫార్మ్స్ & ఇండస్ట్రీస్ ఎల్ఎల్పి వారు చేజిక్కించుకున్నారు. చదునైన భూమి, చదును చేసిన భూమి, కౌలురైతులు కనీసం వందకు మించిన కుటుంబాలు ఇరుకార్లు పండించుకుంటున్న భూమి సులభంగా కంపెనీకి దొరికింది. జింకలు, నెమళ్లు ఇంకా అదే నేలలో బెదిరి బెదిరి బతుకుతున్నాయి. రైతులు చెదిరి పోయారు. ఒకరకంగా కౌలు రైతులను తరిమేశారు. వారికి వేరే బతుకు తెరువులేదు. అంతమాత్రమే కాక ఆ భూమిని అనుకుని వున్న 20.20 ఎకరాల అసైన్డ్ భూమిని తేరగా కబ్జా చేశారు. మార్కెట్ రేటు కాని, రిజిస్ట్రేషన్ రేటు కాని పెద్ద మొత్తంలో వుండగా కొద్ది మంది దళారీల ద్వారా చిల్లర డబ్బులిచ్చి తెల్లకాయిదాల మీద సంతకాలు తీసుకుని 13 కుటుంబాల భూమిని కలిపేసుకున్నారు. ఆ భూమి మీద బతుకుతున్న కుటుంబాలకు చర్చించుకునే గడువు కూడా ఇవ్వలేదు. ప్రభుత్వం డెబ్బైలలో ఇచ్చిన ఈ భూమిని కంపెనీ కబ్జాకోరులు దురాక్రమించుకున్నారు. పేదల బతుకుదారి మూసి తమ దారి పరుచుకున్నారు. అంతేకాదు తరాలనాటి నక్షా దారులను చిత్తనూరు, జిన్నారం తదితర పల్లెలను కలిపే దారులను కూడా ఆక్రమించారు. ఆపవలసిన ప్రభుత్వం బాధ్యతారాహిత్యంగా ఉంది. ఇదేమని అడిగినా పట్టించుకోవడం లేదు.

భూమి తరువాత కంపెనీకి అవసరమైన నీరూ కలిసి వచ్చింది.

ఉమ్మడి మహబూబ్‌నగర్ రైతాంగం కనీసం రెండు దశాబ్దాలు పోరాడి సాధించిన నీరు అందుబాటులోకి వచ్చింది. కోయిల్‌సాగర్ కోసం ఎత్తిపోసిన కాలువ నీటిని మళ్లించుకునే అనుమతులు పొంది, మన్నెవాగునూ చూపి కనీసం వంద ఎకరాలు పారే చెరువులు నలభై దాకా నిండే నీరు, ఆరుతడి పంటలనే అయితే పదివేల ఎకరాలకు సరిపడే నీరు మలుపుకుంటారు. రాష్ట్ర నీటిపారుదల శాఖ వీరి సేవలోనే ఉంది. ఇదివరలో కోయిల్‌సాగర్ నీరు మహబూబ్‌నగర్ తాగునీటికి తీసుకుంటాం అంటే వ్యతిరేకించిన లీడర్లు, పాలమూరు-రంగారెడ్డి పథకంలో భాగంచేసి కోయిల్‌సాగర్ స్థాయి పెంచుతాం అంటే ప్రాజక్టు రూపురేఖలు మార్చకూడదని రైతులను రెచ్చగొట్టిన లీడర్లు ఇప్పుడు, కంపెనీ ఈ నీటిని తేరగా మలుపుకుపోతుంటే ఏమీ అనటం లేదు. మన్నెవాగు ఇక కలుషిత నీటి కాలువ కావచ్చు. అది ఊకశెట్టి వాగును రామన్‌పాడు ప్రాజెక్టును కాలుష్యం చేయవచ్చు. పంట భూములన్నీ, భూగర్భజలాలు కంపెనీ వ్యర్థాలు ఆవహించి పాడైపోవచ్చు. అయినా ఈ లీడర్లు ఎవరూ మాట్లాడటం లేదు. 'ఓటర్లే' పట్టనపుడు ఇక లేళ్ళను నెమళ్లను ఎవరు అడుగుతారు? అసైన్డ్ భూములను రైతులను ఎవరు కాపాడగలరు?

కంపెనీ నిర్మాణానికి భూమి ఎంత సులభంగా దొరికిందో, నిర్వహణకు నీరు ఎంతగా అందుబాటులోకి వచ్చిందో అంతకు మించి సులభంగా నిర్మాణ అనుమతులు, నిర్వహణ అనుమతులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి దొరుకుతున్నాయి. పై ప్రభుత్వాలు గ్రామ పంచాయితీ అనుమతుల అవసరాన్ని నొక్కి చెబుతున్నాయి. కానీ ఆ కాయితాలు ఉన్నదీ లేనిదీ చూడకుండానే అనుమతులు ఇస్తున్నారు. అసలు ఏ అనుమతులు లేకుండానే నిర్మాణపనులు చేపట్టే గ్లోబల్ స్థాయి అనుభవం తమకుందని, ఇంధన అవసరాలు తీర్చి విదేశీ మారక నిల్వల అవసరాన్ని తగ్గించి దేశ సేవ చేస్తామని కంపెనీ పెద్దలు చెప్పుకుంటున్నారు.

కేంద్ర ప్రభుత్వం 16-6-2021న ఒక గజెట్ విడుదల చేసింది. సరిగ్గా అదే 2399 రెఫరెన్సుతో ఈ కంపెనీ పర్యావరణ అనుమతులకోసం తమను బి2 క్యాటగిరిలో గుర్తించి అనుమతించమని కోరింది. చిత్తనూరులో భూముల మీద వాహనాలు ఎంతవేగంగా తిరగటం మొదలైందో ఆఫీసుల్లో ఆ కాయితాలు అంతవేగంగా కదిలాయి. అధికారులు హాట్‌లైన్‌లో కదిలి పనిచేశారు. అటు కేంద్రంలో ఇటు రాష్ట్రంలో కూడా ఈ ప్రతిపాదన రూపొందించిన పయనీర్ ఎన్విరో ల్యాబొరేటరీస్ & కన్సల్టెంట్స్ ప్రైవేట్ లిమిటెడ్‌పై అనేక ఫిర్యాదులున్నాయి. రిజిస్ట్రేషన్ డాక్యుమెంట్లు రాసినట్లుగా కాపీ, పేస్ట్ తరహాలో ప్రతిపాదనలు తయారుచేస్తారని. ఈ కాగితాలు కదిలిన వేగం ఎవరినైనా ఆశ్చర్యానికి గురిచేస్తుంది. నిజానికి చిన్న చిన్న భూ తగాదాలు దశాబ్దాలు మారినా తీరవు. తీరాలని రాజకీయ నాయకత్వాలు జోక్యం చేసుకోవు. కానీ ఈ కంపెనీ నిర్మాణ విషయాలలో ప్రమోటర్స్ అనుకున్నదే తడవు అధికారులు, రాజకీయ నాయకులు ఒకే మాటగా, ఏకాగ్రతతో పనిచేసిన తీరు అందుబాటులో ఉన్న కాగితాలు చూస్తే తెలుస్తుంది. ఈ వేగంలో రైతుమీద, భూమి మీద, ప్రాంతం మీద, పర్యావరణం మీద, ఇక్కడ ఎన్నడూ జరగని దాడికి రంగం తయారవుతున్నది. 32 గ్రామాలు చిక్కులలో పడబోతున్నాయి. ప్రత్యక్షంగా ఈ గ్రామాలు కనిపిస్తాయి. కానీ పరోక్షంగా మహబూబ్‌నగర్ ప్రజలంతా ఈ కాలుష్యపు బారిన పడతారు. ఎందుకంటే ప్రభుత్వాలు ప్రమోటర్స్ ఇచ్చిన చిన్న అఫిడవిట్‌ను విశ్వాసంలోకి తీసుకున్నాయి. ప్రత్యక్ష పరిశీలనలు, ప్రజాభిప్రాయాలు తీసుకోలేదు. చిత్తనూరు ప్రజలందరి వేడుకోలు స్థానిక నాయకులకు ప్రభుత్వాలకు వినిపించటం లేదు. ఇది రెడ్ క్యాటగిరీ కంపెనీ అని, డేంజర్ అని లోలోపల చర్చ జరుగుతోంది.

పాలమూరు అధ్యయన వేదిక పక్షాన నలుగురు సభ్యులతో కూడిన ప్రతినిధి బృందం 13-4-2022న చిత్తనూరు గ్రామంలో పర్యటించింది. కంపెనీ నిర్మాణ పనులు జరుగుతున్న వేగాన్ని గమనించింది. ఆ గ్రామంలో అందరిలోను తీవ్ర ఆందోళన ఉంది. భారతదేశం అమృతోత్సవాలు జరుపుకుంటున్న ఈ దశలో కూడా గ్రామంలో బడి ఏడవ తరగతి స్థాయి దాటలేదు. వైద్యం అందుబాటులో లేదు. ప్రజలు భూమిమీద రెక్కలు విరుచుకుని బతుకుతున్నారు. ఇపుడు ఆ భూమి సేద్యానికి అందకుండా పోతుంది. ఇక తమ పిల్లలు, వృద్ధులు అనారోగ్యాల పాలవుతారని, యువతకు పని ఉండదని, అభివృద్ధి ఎవరికి దక్కుతుందో కానీ తమ జీవన ప్రమాణాలు పడిపోతాయని దు:ఖ పడుతున్నారు. తమకు వీలైన పద్ధతులలో అధికార కార్యాలయాల చుట్టూ, రాజకీయనాయకుల చుట్టూ, పర్యావరణ వేత్తల చుట్టూ తిరుగుతూ తమ భవిష్యత్తు ఏమవుతుందో అని వ్యధ చెందుతున్నారు.

ఒక ప్రభుత్వం మారి మరొక ప్రభుత్వం వచ్చి అమలు పరుస్తున్న పారిశ్రామిక, పర్యావరణ ఇతర అభివృద్ధి విధానాలు ప్రజలకు విధ్వంసాన్నే మిగుల్చుతున్నాయి. తెలంగాణ ప్రభుత్వ పారిశ్రామిక విధానం, బడా పారిశ్రామిక వేత్తలకు, సంపన్న పెట్టుబడిదార్లకు వసతులు సమకూర్చేశక్తిగా పనిచేస్తూ పేద ప్రజల భవిష్యత్తును మరింత పేదరికంలోకి నెట్టేదిగా సహజ వనరులను భావితరాలకు దక్కకుండా చేసేదిగా ఉంది. దేశమంతటా వనరులను కార్పొరేట్లకు అప్పగిస్తూ ప్రజావ్యతిరేక విధానాలనే అభివృద్ధి విధానాలుగా ప్రభుత్వాలు ప్రచారం చేస్తున్నాయి. రాష్ట్రంలో వెనుక బడిన మహబూబ్‌నగర్ జిల్లాను సహజ వనరుల దోపిడీకి రియల్ ఎస్టేట్ దందాకు కేంద్రంగా చేస్తున్నారు. పెద్ద ఎత్తున భూమి కలవారి చేతిలో కేంద్రీకృతమవుతున్నది.

చిత్తనూరులో నిర్మాణమవుతున్న కంపెనీ ఆసియా ఖండంలోనే పెద్దది అంటున్నారు. అంటే ఎక్కువ ఆహార ధాన్యాలు ఉపయోగించి ఇథనాల్ తీస్తారు. అంటే ఆహారధాన్యానికి కొరత సృష్టిస్తారన్న మాట. దేశంలోనే అత్యంత వెనుకబడిన జిల్లాలో ఇంతపెద్ద కంపెనీ ఎందుకు పెడుతున్నారు? వెనుకబడిన చోట పెట్టుబడులు పెడితే కంపెనీదారులకి చాలా రాయితీలుంటాయి. స్థానికులకు ఉద్యోగాలు వస్తాయి అంటారు కానీ సరళీకరణ ప్రపంచీకరణ ప్రైవేటీకరణ విధానాలు దేశంలో అంతర్గత వలసలను తీవ్రం చేశాయి. ఒక రాష్ట్రంలో మరో రాష్ట్రపు వలస కూలీలు పనిలో ఉంటారు. చిత్తనూరులో పనిచేస్తున్న కొద్ది మందీ బయటివాళ్లే. దీన్ని ఆపే శక్తి ప్రభుత్వాలకి కూడా లేదు. అవి ప్రజల నుండి అధికారం పొంది కార్పొరేట్ల కంపెనీలకోసం పనిచేస్తున్నాయి. ఇక చిత్తనూరు రైతుల కూలీల బతుకులు చితికిపోతే ఎవరికి పడుతుంది? పెద్ద కంపెనీ అంటే పెద్ద ఎత్తున కాలుష్యం.

# ప్రైవేట్ కంపెనీల నిర్లక్ష్యం - వలస కార్మికుల మృతి

*సికిందరాబాద్ లోని వ్యర్థ పదార్థాల గోడౌన్‌లో అగ్ని ప్రమాదం జరిగి పన్నెండు మంది వలస కార్మికులు మరణించిన దుర్ఘటనను వివరిస్తున్నారు* **పి.ఎం. రాజు**

హైదరాబాద్ రాజధానిగా, మహానగరంగా అభివృద్ధి చెందుతున్న నేపథ్యంలో అనేక ప్రైవేట్ కంపెనీలు, రసాయనిక కంపెనీలు, ఫార్మా కంపెనీలకు నిలయంగా మారింది. ప్రైవేట్ అంటే కార్మికులకు రక్షణ ఉండదు. యాజమాన్యం లాభాలే ఉంటాయి అనే విషయాన్ని స్పష్టీకరిస్తూ, నిత్యం పరిశ్రమలలో ప్రమాదాలు జరుగుతూనే ఉన్నాయి. ఈ నేపథ్యంలో 2022 మార్చి 22 తెల్లవారు జామున 3.15కు సికింద్రాబాద్‌లోని బోయిగూడలో ఒక స్క్రాప్ గోడౌన్‌లో ఘోర అగ్ని ప్రమాదం జరిగి, బీహార్ నుండి వలస వచ్చిన 11 మంది కూలీలు మరణించారు. ఈ దుస్సంఘటనలో నిజనిర్ధారణకై పౌరహక్కుల సంఘం హైదరాబాద్ జిల్లా కమిటి నిజనిర్ధారణ బృందం 2027 మార్చ్ 22 నాడు సంఘటనా స్థలానికి, గాంధీ ఆసుపత్రికి, పోలీస్ స్టేషన్‌కు వెళ్లి బాధితులను, పోలీసువారిని కలవడం జరిగింది. విషయాన్ని సేకరించడం జరిగింది. ఈ నిజనిర్ధారణ రిపోర్టు వివరాలు:

పోలీసులు తెలిపిన వివరాల ప్రకారం దాదాపు 2022 మార్చ్ 22 తెల్లవారుజామున 3.45 నిమిషాలకు డయల్ 100కు బోయిగూడలోని స్క్రాప్ గోడౌన్‌లో మంటలు అంటుకున్నాయని ఫిర్యాదు అందిన వెంటనే పోలీసులు, అగ్నిమాపక సిబ్బంది సంఘటనా స్థలానికి చేరుకోవడం జరిగింది. గోడౌన్ ద్వారం షటర్ మూయబడి మంటలు లోపలి నుండి బయటికి ఎగసిపడుతున్నాయి. ఈ స్థలానికి 50 మీటర్ల రూపంలో దాదాపు 25 సంవత్సరాల యువకుడు మంటల్లో కాలిన గాయాలతో స్పృహ తప్పి పడి ఉన్నాడు. అతన్ని వెంటనే గాంధీ ఆసుపత్రికి తరలించామని చెప్పారు. అదే సమయంలో దాదాపు మూడు గంటల ప్రయత్నం తర్వాత మంటలను అదుపులోకి తీసుకొని రాగలిగారు. తరువాత మొత్తం పరిశీలించగా గోడౌన్‌లో ఒకవైపు ఉన్నటువంటి మొదటి అంతస్తులో 11 మంది

---

పెద్ద ఎత్తున పీడన. ఇప్పటికే బయటి రాష్ట్రాల వాళ్ళు ఇద్దరు మరణించారట, నీటి ట్యాంకర్‌నడిపే స్థానిక డ్రైవర్ పనిచేసుకోలేనంతటి ప్రమాదానికి గురైనాడట. ఇవి బయటికి రావు, ఇంకా ఈ కంపెనీ ఇక్కడ బొగ్గు ఆధారంగా 15 మెగావాట్ల విద్యుత్తును ఉత్పత్తి చేస్తుందట. ఫార్మా అవసరాలు తీరుస్తుందట. పనిలోపనిగా ఆల్కహాలూ ఉత్పత్తి చేస్తుంది. అనుమతులకోసం అనేక అసత్యాలు, అర్ధ సత్యాలతో ప్రభుత్వానికి వినతులు ఇస్తున్నది. పై అధికారులు ఏం జరుగుతున్నదో తమకు ఏమీ తెలియదంటున్నారు. పనులు చేసుకుపోతున్న కంపెనీ రాజకీయ శక్తి అలా ఉంది.

ఇప్పటికి నాలుగైదు దశాబ్దాలుగా జిల్లాలోని గుట్టలను క్వాట్జ్ తదితర తవ్వకాలకోసం మైనింగ్ కంపెనీలకు అప్పనంగా అర్పిస్తున్నారు. క్వాట్జ్ తవ్వకాలతో ఊరికిగుట్టలు లేకుండా పోతున్నాయి. ప్రజలు క్షయ ఇతర గుట్టల బీమారీల బారిన పడుతారు. ఇది మన జిల్లా అనుభవం. పదుల సంఖ్యలో యువకులు ప్రాణాలు కోల్పోయారు. కోర్టులు తీర్పులు ఇచ్చినా కూడా ప్రభుత్వాలు ఆ కుటుంబాలకు నష్టపరిహారం ఇవ్వలేదు. తెలంగాణ ప్రభుత్వం అనేక గుట్టలు తవ్వక పోవటానికి, తవ్వి విదేశాలకు అమ్ముకోవటానికి అనుమతులిస్తున్నది. ఈ దేశపు, ఈ రాష్ట్రపు సహజ వనరులు ఇక్కడి ప్రజలకు దక్కాలని ప్రభుత్వాలు అనుకోవటం లేదు. స్థానిక ప్రజలు అనుకున్నా సాగనీయటం లేదు. అయినా పెబ్బేరు మండలంలోని శాఖాపూర్ ప్రజలు చాలా పోరాడి తవ్వకాలు ఆపగలిగారు. మరికల్ మండలంలోని గున్ముక్ల గ్రామ ప్రజలు ప్రజాభిప్రాయ సేకరణ దశలోనే ఒక్కమాట మీద నిలిచి మైనింగ్ పనులు నిలువరించగలిగారు. కోయిలకొండ మండలంలోని కేశవాపూర్ గ్రామ గుట్టల తవ్వకానికి మైనింగ్ కంపెనీలు పోటీపడుతున్నాయి. ప్రభుత్వాలు రాజీలు కుదిర్చి మైనింగ్‌ను ప్రోత్సహిస్తున్నాయి. జిల్లా ప్రజలందరు జాగరూకతతో అడ్డుకుని ప్రభుత్వ మైనింగ్ విధానాలలో మార్పును సాధిస్తే తప్ప భవిష్యత్తరాలకు వనరులు మిగలవు.

విషాదం ఏమిటంటే తెలియని వారికి తెలియదు. తెలుసుకునే అవకాశాలు వసతులు లేవు. తెలియజెప్పి సహజ వనరులను కాపాడవలసిన సంస్థలు, వ్యవస్థలు పర్యావరణ విధ్వంసకుల చేతిలో బందీలైనాయి. ఉమ్మడి జిల్లాలో పెరుగబోతున్న ఫార్మా పరిశ్రమ కల్పించే పర్యావరణ విధ్వంసం సాధారణ స్థాయిలో ఉండదు. ప్రజలను కాపాడుకోవలసిన రాజకీయ నాయకులు తమకు అధికారం ఎవరిచ్చింది మరిచిపోయి విధ్వంసాన్నే అభివృద్ధిగా ప్రచారం చేస్తున్నారు.

ఈ పరిస్థితులలో చిత్తనూరు ప్రజల ఆందోళనను ప్రతిపక్ష, ప్రజాపక్ష నాయకత్వాలు, ప్రజా సంఘాలు, ప్రజా స్వామిక వాదులు అందుకోవాలని కోరుతున్నాము. ఈ సమస్యను, ఈ వలయం చుట్టూ అల్లుకున్న సమస్యలను చర్చించటం కేవలం చిత్తనూరు కోసంకాదు మనందరికోసం అత్యవసరమైన విషయమని తెలుపుతూ లోతుగా చర్చించి, తగిన కార్యాచరణతో, బాధిత ప్రజలకు విశ్వాసం కల్పించమని కోరుతున్నాం. వీ

*(రచయిత పాలమూరు అధ్యయన వేదిక కార్యకర్త)*

కార్మికుల మృతదేహాలు మాంసపు ముద్దవలె పడి ఉన్నాయి. వాటిని వెంటనే పోస్టుమార్టం నిమిత్తం గాంధీ ఆసుపత్రికి తరలించడం జరిగింది. విద్యుత్ షార్ట్ సర్క్యూట్ వలన గోడౌన్‌లో ఉన్న స్క్రాప్ అంటుకొని, మంటలు చెలరేగి ఉంటాయిని ప్రాథమికంగా పోలీసులు కేసు నమోదు చేయడం జరిగింది. షార్ట్ సర్క్యూట్ ద్వారా మంటలు ఆ స్క్రాప్‌కు అంటుకొని దట్టమైన పొగలు వ్యాపించి నిద్రపోతున్న 11 మందికి శ్వాస ఆడకపోవడం వలన చనిపోయి ఉంటారని నిర్ధారణకు వచ్చారు. ఈ కేసును ఫోరెన్సిక్ వారికి, ఎక్స్‌పోర్ట్ కమిటీకి, ఫైర్ సర్వీసెస్‌కు తదుపరి విచారణ నిమిత్తం పంపించడం జరిగిందని, వారి నివేదిక వచ్చిన తరువాతనే ఒక నిర్ధారణకు రాగలమని తెలిపారు. ఈ కేసులో ప్రాథమిక నిర్ధారణ ప్రకారం సంబంధిత గోడౌన్ యజమానిపై ఐపిసి 109, 304 ఐపిసి, 307 క్రింద కేసు నమోదు చేసి వారిని అదుపులోకి తీసుకోవడం జరిగిందని తెలిపారు.

27-03-2022 ఉదయం మా నిజనిర్ధారణ బృందం గోడౌన్‌కు వెళ్ళి క్షుణ్ణంగా పరిశీలించడం జరిగింది. ఈ గోడౌన్‌లో అన్ని రకాల వ్యర్థపదార్థాలు తెబడి, వాటిని వేరు చేసి పంపడం జరుగుతుంది. పేపర్లు, బాటిల్లు, ఉక్కు, ఇనుము, కాటన్లు, కేబుల్ వైర్లు, మొదలైన వాటిని ఇక్కడికి తీసుకొని వచ్చి, వాటిని విభజించి, దేనికి దాన్ని వేరుచేసి సంబంధిత కొనుగోలుదారులకు పంపించడం జరుగుతంది. ఒక 800 గజాల స్థలంలో రేకుల గోడలు ఉండి, ఈశాన్య మూలాన లోపలికి ట్రక్కులు వచ్చేంత షటర్ ఉంది. ఆ పక్కనే లోపల ఆఫీసు ఉంటుంది. లోపల వివిధ వస్తువులను వేరు చేసి కట్టి పంపించడం జరుగుతుంది. వీటన్నిటిని క్రమపద్ధతిలో కట్టడం ఈ కార్మికులు చేసే పని. అయితే ఈ షటర్ లోపలి నుండి వలయాకారంగా ఇనుప మెట్లు ఉండి ఆ మెట్ల ద్వారా పైకి వెళ్తే మొదటి అంతస్తులో రూము ఉంటుంది. ఆ రూములోనే ఈ 11 మంది శవాలు ఉండినాయి. వారికి ఆ రూము తలుపులు తెలుచుకొని ఇనుమెట్ల ద్వారా కిందకి వచ్చి షటర్ ద్వారా బయటికి రావడం మినహా వేరే దారి లేదు. ఈ కార్మికుల శవాలు లభించిన మొదటి అంతస్తు కింద బయటికి తూర్పు ముఖంలో వేరే షాపు ఉంది. ఈ గోడౌన్ షటర్ మూసి ఉండడంతో బయటి ప్రపంచానికి లోపలి కార్మికులకు సంబంధమే ఉండదు. విచారించగా తెలిసిందేమంటే 28 సంవత్సరాల ప్రేమ్ ఒక్కడే మొదటి అంతస్తు రూముకు ఉన్నటువంటి కిటికి ఊచలను బలవంతంగా లాగి మొదటి అంతస్తు నుండి దూకి కిందికి రావడం జరిగింది. కాబట్టి అతని ఛాతి ఎముకలు, కాలు విరిగిపోయి 30 శాతం కాలిన గాయాలతో మొదటి గాంధీ ఆసుపత్రికి, తరువాత డిఆర్‌డిఒ అపోలోకు తరలించడం జరిగింది. తరువాత వారం రోజుల అనంతరం అతను మరణించాడు.

ఈ కార్మికులందరు వలస కార్మికులు. బీహార్ నుంచి పొట్ట చేత పట్టుకొని వచ్చినారు. వీరంతా మధ్యవర్తి ఒప్పందం ప్రకారం వచ్చి పనిచేసుకుంటారు. ఇటువంటి వేల మంది కార్మికులు మనకు హైదరాబాదులోని ప్రతి పారిశ్రామిక వాడలో కనిపిస్తారు. చాలా తక్కువ జీతాలకు తీసుకురాబడి, ఎటువంటి భద్రత లేకుండా పనిగంటలు, కార్మిక చట్టాలు మొదలగు వాటికి ఎంతో దూరంగా వీరి బ్రతుకులుంటాయి. 2017లో అత్తాపూర్‌లో జరిగిన సంఘటనకు ఈ సంఘటనకు ఎన్నో పోలికలు ఉంటాయి. అత్తాపూర్‌లో కూలర్లు తయారు చేసే గోడౌన్‌లో వలస కార్మికులందరిని ఒక రూములో ఉంచి, తాళం వేసి, యజమాని వెళ్లిపోవడం వలన అర్ధరాత్రి జరిగినటువంటి షార్ట్ సర్క్యూట్, తదనంతరం మంటలు చెలరేగడం వలన, లోపలి నుండి కార్మికులందరు రక్షించడని, హాహాకారాలు చేస్తున్నా, ఎటువంటి సహాయం అందకపోవడం వలన 6గురు కార్మికులు అగ్నికి ఆహుతి కావడం జరిగింది. ఇక్కడ కూడా ఈ కార్మికులు బయటికి పోకుండా పని స్థలం వద్దే, రూములో ఉంచడం వలన బయటికి రాలేక, మాడి మసైపోయారు.

ఈ గోడౌన్, పనిస్థలాల గురించి ఏ ప్రభుత్వ అధికారులు పట్టించుకోలేదు. పర్మిషన్ ఇవ్వడం, నియంత్రిస్తున్నామన్నట్లుగా పేపర్లో మాత్రం ఉంటాయి. కార్మిక చట్టాలు, సురక్షిత పని స్థలం అనేది నీటిమూటలే. జిహెచ్ఎంసి కాని, లేబర్ కమిషనర్ కానీ, ఫైర్ సేఫ్టీ వాళ్లు కాని అందరికి ఈ వలస కార్మికులంటే నోట్ల కట్టలు. ప్రభుత్వ యంత్రాంగానికి పట్టింపు లేదు. అగ్ని అంటుకునే అవకాశం ఉన్నటువంటి ఇక్కడ, అత్యవసర సమయంలో ఉపయోగించేందుకు మరో దారి ఉండాలనే కనీస ఆలోచన కూడా లేదు. తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభం రావాలి. ఆ వచ్చిన లాభంలో అధికారుల నోరు మూయించాలి - అంతే ఇక్కడ నడిచేది. ఈ ప్రాంతంలో ఇటువంటి గోడౌన్‌లు ఎన్నో ఉన్నాయి, వాటిలో ప్రమాదం జరిగినా, రేపు పరిస్థితి ఇంతే. అతి తక్కువ కూలీలో ఎక్కువ పని గంటలు పని చేస్తూ, బానిసలుగా ఉంచుతూ ఈ బీహారిలందరు పొట్టచేత పట్టుకొని వచ్చిన వలస కూలీలు. వీరికి సంబంధించి ఎటువంటి గణాంకాలు లేవు. ఏ చట్టాలు పనిచేయవు. గోడౌన్ నుండి ఇంటికి వెళ్ళేటప్పుడు వీరు ఎటూ పారిపోకుండా అక్కడి సామాన్లు భద్రంగా ఉండాలనే ఉద్దేశ్యంతో ఈ సంస్థల యజమానులు వీరందరిని అక్కడే నివాసముంచి బయటి నుండి తాళం వేసి వెళతారు. వాళ్లంతా గోడౌన్ యజమానికి కట్టు బానిసలు. చట్టాలు అమలు చేయించాల్సిన ప్రభుత్వం నిష్క్రియాపరత్వం, మాజమాన్య అమానవీయ అక్రమ లాభాపేక్ష ఈ ప్రమాదానికి ముఖ్య కారణం.

మార్చి 23న ఉదయం సంఘటన జరిగినపుడు కింది నుండే మంటలు వచ్చి పొగలు కమ్ముకొని, శ్వాస ఆడకుండా చేసి, తర్వాత మంటలు చెలరేగి ఈ 11 మంది అసువులు బాసారు. ఒక కార్మికుడు మాత్రం ఎలాగోలా తప్పించుకున్నాడు కాని, అతను కూడా చికిత్స పొందుతూ మరణించారు. మొత్తం మృతుల సంఖ్య 12 మంది, ఈ 11 మంది శవాలు ఒకే గదిలో దొరికాయి. అంటే వీరందరిని ఆ గదిలో బంధించి యజమాని ఇంటికి వెళ్లాడనేది సుస్పష్టం.

ఈ 11 మంది సంఘటన స్థలంలో చనిపోయిన వారు బీహార్‌లోని చాప్ కడియార్ జిల్లాకు చెందిన దీపక్ వర్మ (26), బిట్టుకుమార్ (21), సికందర్ కుమార్ (40), సత్యేంద్ర కుమార్ (38), చతుర్ముఖ్ (28), దామోదర్ (25), సురేష్ కుమార్ (22), దినేష్ కుమార్ (35), చింటూ కుమార్ (25), అక్షయ్ కుమార్ (27), రమేష్ (27), ప్రేమ్‌కుమార్ (28). ఈ సంఘటన జరిగిన అనంతరం ఆ బాధిత కుటుంబాలను సికింద్రాబాద్ గాంధీ ఆసుపత్రికి పిలిపించి పోస్టుమార్టం

# ఆంధ్రప్రదేశ్ సంక్షేమ పథకాల అమలులో పెరిగిన ఆంక్షలు

*ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు సంక్షేమ పథకం అమ్మ ఒడిపై విధించిన ఆంక్షల వల్ల జరగబోయే పర్యవసానాలను వివరిస్తున్నారు*

**చిమ్మో. జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇటీవలనే 13 జిల్లాలను 26 జిల్లాలుగా ఏర్పాటు చేశారు. పాలనా సౌలభ్యం కోసం జిల్లాల విభజన ప్రక్రియ చేపట్టినట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు. అయితే జిల్లాల విభజన చాలా గందరగోళంగా ప్రకటించారు. పాత జిల్లా కేంద్రాలకు దగ్గరగా ఉండే మండలాలను సైతం కొత్త జిల్లాలలో కలిపేశారు. ఈ ప్రక్రియనంతా ముఖ్యమంత్రి అదనపు కార్యదర్శి జీఎస్ఆర్కె విజయకుమార్ చేసినట్లు తానే ప్రకటించుకున్నాడు. హిందూపురం, రాజంపేట పార్లమెంట్ స్థానాలను జిల్లా కేంద్రాలుగా చేయకుండా వాటికి సంబంధం లేని నియోజకవర్గ కేంద్రాలకు వాటిని మిళితం చేశారు. హిందూపురం నుంచి కేవలం గంటన్నర ప్రయాణంతో బెంగుళూరు నగరానికి చేరుకోవచ్చు. అయితే పుట్టపర్తి కేంద్రంగా శ్రీ సత్యసాయి జిల్లాను ప్రకటించారు. అదే విధంగా రాయచోటిని జిల్లా కేంద్రంగా ప్రకటించి, అసలు రాకపోకలతో సంబంధం లేని రాజంపేటను రాయచోటిలో కలిపేశారు. ఈ రెండింటి విషయంలో ప్రజలు ఇప్పటికీ తీవ్రమైన ఆందోళనలు చేపడుతున్నారు. వీటి విషయంలో అధికార పార్టీకి చెందిన వారే ఆందోళనలు చేపట్టడం, ఆందోళనల్లో పాల్గొనడం విశేషం.

జిల్లాల విభజననే చాలా ఆందోళనలు కలిగిస్తుంటే 'నవరత్నాల'లో భాగమైన 'అమ్మ ఒడి' పథకం 2021-22 విద్యా సంవత్సరంలో విద్యార్థులకు అమలు కాలేదు. అంతే కాకుండా ఈ పథకం ఒక విద్యార్థికి వర్తించాలంటే అనేక విధాలైన ఆంక్షలు విధించారు. ఈ ఆంక్షలు నిజంగా వర్తించేసరికి దాదాపు సగం మంది విద్యార్థినీ విద్యార్థులు ఈ సంక్షేమ పథకం పొందకుండా మిగిలిపోతారు. దానివలన వారి కుటుంబానికి చేరవలసిన సంక్షేమ నిధులు ప్రభుత్వానికి మిగిలిపోతాయి. తద్వారా రాష్ట్ర ప్రభుత్వం కొన్ని కుటుంబాలకు నష్టం చేసినదవుతుంది. ఇది పూర్తిగా పేద ప్రజలను మరింత పేద ప్రజలుగా మార్చడం, వారిని విద్యకు దూరం చేయడమే అవుతుంది. తద్వారా ప్రభుత్వం సంక్షేమ పథకాలను భవిష్యత్తులో ఎత్తివేసే ధోరణి కనబడుతున్నది. 2019 జూన్‌లో వై.ఎస్. జగన్‌మోహన్‌రెడ్డి ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌లో అధికారంలోకి వచ్చినప్పటి నుండీ 'అమ్మ ఒడి' పథకం 'నవరత్నాలు'లో భాగంగా అమలు చేస్తూ ఉంది. అయితే 2 విద్యా సంవత్సరాలు గడిచిన తర్వాత 2021-22

---

తర్వాత సంబంధిత కుటుంబాలకు శవాలను అప్పగించడం జరిగింది. కేంద్ర ప్రభుత్వం, తెలంగాణ, బీహార్ ప్రభుత్వాలు కలిపి ఒక్కొక్క కుటుంబానికి రు. 5,00,000 నష్టపరిహారం ఇవ్వడం జరిగింది. ఈ నష్టపరిహారాన్నిచ్చి ప్రభుత్వాలైతే చేతులు దులుపుకున్నాయి. ప్రమాదం జరిగిన వెంటనే రాష్ట్ర హోం మంత్రి మహమూద్ అలీ సంఘటనా స్థలానికి వచ్చి ఇటువంటి సంఘటనలు మళ్లీ జరగకుండా కఠినమైన చర్యలు తీసుకుంటామని పత్రికా ముఖంగా చెప్పడం జరిగింది. ప్రమాదం జరిగి నెల గడిచింది, కాని ఇంతవరకు ఎక్కడా ఒక చిన్న దిద్దుబాటు కార్యక్రమం కూడా ప్రభుత్వ యంత్రాంగం వైపు నుంచి జరగలేదు.

కాని ఇంకా ఇలాంటి ప్రమాదాలు ఎందుకు జరుగుతున్నాయి? వాటిని ఆపేందుకు ఎటువంటి కార్యాచరణ జరగాలి? చట్టాలను ఎవరు అమలు చేయాలి? యాజమాన్యం నిర్లక్ష్యం వైఖరి వహిస్తే ఏ విధమైన చర్యలు తీసుకోవాలి? అసలు వలస కార్మికులకు సంబంధించి ఎటువంటి చట్టాలు అమలు చేయాలనే కనీస చర్చ ఎక్కడా లేదు. మరో ప్రమాదం, మరోసారి వార్తలు, మరోసారి నష్టపరిహారం ఇలా జరిగే అవకాశం కచ్చితంగా ఉంది. కాబట్టి ప్రభుత్వం ఇప్పటికైనా ప్రమాదంలోని అన్ని కోణాలపై సమగ్ర విచారణ జరిపించి, మరోసారి ఇలాంటి ప్రమాదాలు జరగకుండా, మరో కార్మికుని ప్రాణాలు పోకుండా కఠినమైన చర్యలు తీసుకోవాలని వలస కార్మికుల చట్టం 1979ను కచ్చితంగా అమలు చేసి, వలస కార్మికుల జీవించే హక్కుకు పూర్తిగా బాధ్యత వహించాలని డిమాండ్ చేస్తూ, ఈ ఘటన తర్వాత పౌరహక్కుల సంఘం ఈ సిఫార్సులను ప్రభుత్వం ముందుకు తీసుకువచ్చింది.

బోయిగూడ స్క్రాప్ గోడౌన్‌లో 12 మంది అమాయక వలస కార్మికులు సజీవదహనం కావడానికి కారణమైన సంఘటనపై జ్యూడీషియల్ విచారణ జరిపించాలి. చనిపోయిన వారందరికి నష్టపరిహారంగా కుటుంబానికి 25 లక్షల రూపాయలు అందజేయాలి. అంతర్‌రాష్ట్ర వలస కార్మికుల భద్రతా సంక్షేమంపై ఒక ఉన్నత స్థాయి కమిషన్‌ను ఏర్పాటు చేసి, దాని కనుసన్నల్లో వలస కార్మికుల రక్షణకు బాధ్యతలు తీసుకోవాలి. ఈ 12 మంది సజీవ దహనంపై సంబంధిత కార్మిక శాఖ అధికారులపై క్రిమినల్ చర్యలు చేపట్టాలి. వలస కార్మికులను పరిశ్రమ పరిసరాల్లోనే నేరస్తులుగా బంధించి, వారి జీవించే హక్కును హరించివేస్తున్న ఫ్యాక్టరీల, గోడౌన్‌ల నిర్లక్ష్య వైఖరిని వారి నేరంగా పరిగణించి, వారిపై కూడా చట్టపరమైన చర్యలు తీసుకోవాలి.

*(రచయిత అధ్యక్షులు, హైదరాబాద్ జిల్లా కమిటీ పౌరహక్కుల సంఘం)*

విద్యా సంవత్సరానికి అమలు కాలేదు. ఈ సంవత్సరం అంతా ఆర్థిక లోటుతో ఉన్న కారణంగా 'అమ్మ ఒడి' పథకంలో భాగంగా విద్యార్థినీ విద్యార్థుల తల్లుల బ్యాంక్ ఖాతాలలో నగదు డబ్బు జమ కాలేదు. ఈ సంవత్సరం అమలు చేయకపోవడం అటుంచి, ఈ సంవత్సరం జూలై మొదటి వారంలోగా డబ్బు జమ చేస్తాం. అందుకు అనేక ఆంక్షలను దాటుకొని రావలసి ఉంటుందని ప్రభుత్వం ఇప్పటికే ప్రకటించింది. అందులో మొట్ట మొదటిది విద్యార్థినీ విద్యార్థులకు 75 శాతం హాజరు తప్పనిసరి చేసింది. ఆ తర్వాత విద్యార్థినీ విద్యార్థుల కుటుంబం గృహ విద్యుత్ వాడకం 300 యూనిట్లు మాత్రమే ఉండాలి. విద్యార్థినీ విద్యార్థుల ఆధార్ కార్డులలో పాత జిల్లాల పేర్లు ఉన్నాయి. కానీ వాటిలో కొత్త జిల్లాల పేర్లు నమోదు చేసుకోవాలి. అనగా 'అమ్మ ఒడి' లబ్ధి పొందాలనుకునే వారంతా ఆధార్ కేంద్రాల వద్దకు వెళ్లి అందులో పాత జిల్లాల పేర్లను మార్చి కొత్త జిల్లాల పేర్లతో ఆధార్‌ను సరికొత్తగా తయారు చేసుకోవాలి. ఇది విద్యార్థినీ విద్యార్థులకు అదనపు భారం అవుతుంది.

అంతే కాకుండా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జారీ చేసిన (వై.ఎస్. జగన్‌మోహన్‌రెడ్డి బొమ్మతో) కొత్త రేషన్ కార్డు (బియ్యం కార్డు) ఉండాలి. ఇంటింటి సర్వే మ్యాప్‌లో విద్యార్థినీ లేదా విద్యార్థి ఒకే మ్యాపింగ్‌లో ఉండాలి. విద్యార్థి ఈ కెవైసి సరి అప్‌డేట్ చేసుకోవాలి. గ్రామ – వార్డ్ వాలంటీర్ల వద్దకు వెళ్లి విద్యార్థి పేరు, వయస్సు సరిచూసుకోవాలి. తల్లుల బ్యాంక్ ఖాతా నంబర్‌కు ఆధార్ లింక్ అయిందో లేదో చూసుకోవాలి. ఆధార్ నంబర్‌ని ఫోన్ నంబర్‌తో కూడా లింక్ చేసుకోవాలి. అన్నింటికన్నా ముఖ్యంగా తల్లుల బ్యాంక్ ఖాతాలో కొంత నగదు ముందే ఉండి ఉండాలి. కనీసం ఒక వేయి నుంచి రెండు వేల దాక మూలధనం తల్లుల ఖాతాలో ఇప్పటికే ఉండి ఉండాలి. అంతే కాకుండా ప్రభుత్వ ఉద్యోగులు, అవుట్ సోర్సింగ్ ఉద్యోగులు, ఆదాయం పన్ను కట్టేవాళ్లకు అమ్మ ఒడి పథకం వర్తించదు. ఇలాంటి వారిలో ఎవరైనా ఇప్పటికే అమ్మ ఒడి తీసుకొని ఉంటే క్రిమినల్ కేసులు నమోదు చేయాలని ఉన్నతాధికారులు స్పష్టం చేశారు.

ఏటా సుమారు 44 లక్షల మంది అమ్మ ఒడి పథకం కింద లబ్ధి పొందుతున్నారు. దీనికింద ఒక విద్యార్థికి సంవత్సరానికి రు. 15,000 అందిస్తున్నారు. ఇందులో ఒక వేయి పాఠశాలల ఆయాల జీతాల కోసం మినహాయిస్తూ మిగతా 14 వేలు ఇస్తున్నారు. ఈ పథకం పదేళ్ల పాటు అందిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఏటా జనవరిలో ఈ పథకం కింద విద్యార్థినీ విద్యార్థులకు డబ్బు జమ అయ్యేవి. అయితే ప్రస్తుత విద్యా సంవత్సరానికి మాత్రం జనవరిలో కాకుండా జూలై మొదటి వారంలో ఇస్తామంటున్నారు. దీనివలన ఈ విద్యా సంవత్సరం అమ్మ ఒడి పథకం అమలు చేయనట్లే లెక్క.

పైన తెలిపిన నిబంధనలన్నీ వర్తింపజేసుకొని విద్యార్థినీ విద్యార్థులు అమ్మ ఒడి పథకానికి అర్హత సంపాదించుకోవడానికి తల ప్రాణం తోకకు వస్తుంది. అంతే కాకుండా వలస వెళ్లి కూలీ చేసుకొని జీవనోపాధి చూసుకొనే తల్లిదండ్రులు సుదూర ప్రాంతాలకు పోయి జీవనం గడుపుతుంటారు. అమ్మాయి లేదా అబ్బాయి తన అవ్వ – తాత దగ్గరనో లేదా సమీప బంధువుల దగ్గర ఉండి చదువుతూ ఉంటారు. ఇటువంటి వారికి బ్యాంక్ లింకేజీలు, ఆధార్ మార్పులు చేసుకోలేని కారణం చేత అమ్మ ఒడి పథకం చేజారిపోతుంది.

అంతే కాకుండా జగన్‌మోహన్‌రెడ్డి ఎన్నికల హామీలలో ఇంట్లో ఎంత మంది విద్యార్థినీ విద్యార్థులు ఉంటే అందరికీ అమ్మ ఒడి అమలు చేస్తామని హామీ ఇచ్చారు. ఇప్పుడు మాత్రం కుటుంబంలో ఒకరికే ఇస్తామని చెబుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో మగ పిల్లలు తమ వద్దే ఉంటారు కాబట్టి వారిని మాత్రమే చదివించి, ఆడ పిల్లలను చదువుకు దూరం చేసే పరిస్థితి కనబడుతున్నది. ఎందుకనగా గ్రామీణ ప్రాంతాలలో బాలికా విద్యను ఇప్పటికీ సగం మధ్యలోనే నిలిపివేసే పరిస్థితి కనబడుతున్నది. వారిని వ్యవసాయ కూలీలుగా, పత్తి, మిరప చేన్లలో పనిచేయడానికి తీసుకెళుతున్నారు. కుటుంబ ఆర్థిక పరిస్థితి బాగాలేని కారణం చేత రోజుకు రు. 200 – 300 సంపాదించే కూలీలుగా ఆడ పిల్లలు తయారవుతున్నారు. అంతే కాకుండా పత్తి చేన్లలో కేవలం ఆడ ప్లిలు మాత్రమే బాగా పనిచేస్తారనే ప్రచారం కూడా ఉన్నది. అమ్మ ఒడి పథకం కుటుంబంలో 'ఒక అన్న – చెల్లెలు' ఉంటే, తల్లిదండ్రులు అన్న వైపు మొగ్గు చూపి, అమ్మాయికి ఎలాగూ డబ్బులు రావు కాబట్టి చదువు మధ్యలోనే మాన్పించే పరిస్థితి కనబడుతున్నది. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అమ్మ ఒడి పథకం కొన్ని కుటుంబాలలో వివాదాలను సృష్టిస్తున్నది. మధ్యలో చదువు మాన్పించి వేస్తే కొంత మంది అమ్మాయిలు ఆత్మహత్యలకు పాల్పడే అవకాశం ఉన్నది. అంతే కాకుండా రాష్ట్రంలో డ్రాప్ అవుట్స్ (మధ్యలో బడి మానేయడం) పెరిగే అవకాశం ఉంది. చాలా మంది పిల్లలు బాల కార్మికులుగా తయారు అవుతారు. అప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం బాల కార్మికుల రాష్ట్రంగా మారే ప్రమాదం ఉన్నది.

ఒకవైపు విద్యుత్ చార్జీల పెంపు, బస్సు చార్జీల పెంపుతో పేద, మధ్యతరగతి ప్రజలు ఆందోళన బాట పడుతుంటే, అమ్మ ఒడి పథకం ఆంక్షలతో విద్యార్థినీ విద్యార్థులు కూడా తీవ్రమైన ఆందోళన చెందుతున్నారు. చాలా ప్రభుత్వ పాఠశాలల్లో కనీసం మంచినీటి సౌకర్యం కూడా లేదు. 'నవరత్నాల' అమలు గురించి గొప్పలు చెప్పుకుంటున్న ప్రభుత్వం కనీసం రోడ్ల గురించి పట్టించుకోవడం లేదు. గ్రామీణ ప్రాంతాలలో రోడ్డు, రవాణా సౌకర్యం, డ్రైనేజీ వ్యవస్థ చాలా అధ్వాన్నంగా ఉన్నది. గ్రామాలలో కుక్కలు కరిచి చనిపోయే పిల్లల సంఖ్య కూడా పెరిగింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో కనీసం సిబ్బంది సౌకర్యం కూడా లేదు. దాదాపు అన్ని రంగాల అవుట్ సోర్సింగ్ ఉద్యోగులంతా తమ ఉద్యోగ భద్రత కోసం ఏదో ఒక రూపంలో ఆందోళన బాట పడుతున్నారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ఆందోళనా ప్రదేశ్‌గా మారిపోయింది.

(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు) వీ

# జాతీయ రాజకీయాల్లోకి తెలంగాణ ముఖ్యమంత్రి

*తెలంగాణ రాష్ట్ర సమితి నాయకులు కె. చంద్రశేఖరరావు జాతీయ రాజకీయాల్లో ప్రవేశిస్తారనే వార్తల నేపథ్యంలో ఆ పరిణామాన్ని చర్చిస్తున్నారు* **తక్కళ్లపెల్లి సూరి**

ఐరిష్ రచయిత రాబర్ట్ విల్సన్ లిండ్ చెప్పినట్లు చట్టాన్ని రూపొందించే వారు చట్టాన్ని ఉల్లంఘించే వారు కాకూడదు. కానీ తెలంగాణ రాష్ట్రంలో ఇలాంటి ఉల్లంఘనలు అనేకమని రుజువైంది.

నెత్తుటి గుర్తులు చెదరని వీరుల అమరత్వం పునాదుల మీద ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం పురుడుపోసుకుంది. నాటి ప్రత్యేక రాష్ట్ర తొలి, మలిదశ ఉధృత పోరాటంలో సకల జనులు త్యాగాలకు సిద్ధం అయినప్పటికీ ముఖ్యంగా విద్యార్థులు తమ ప్రాణాలను అగ్గి దివిటీలుగా మార్చి అమరులై మనకు వెలుగును ఇచ్చారు, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించిపెట్టారు. నాడు ఉద్యమ పార్టీగా ప్రత్యేక రాష్ట్ర సాధనకై ఏర్పడ్డ తెలంగాణ రాష్ట్ర సమితి పక్షాన చంద్రశేఖర రావు పోరాటపటిమను ఎవరూ తక్కువ చేసి తప్పు పట్టడం లేదు. కానీ నాటి ఉద్యమ పార్టీ ఉత్త రాజకీయ పార్టీగా మారిన తర్వాత జరిగిన, జరుగుతున్న, జరగబోయే రాజకీయ, సామాజిక, లౌకిక, ఆర్థిక, సాంస్కృతిక అంశాలతో పాటు విద్యా వైద్య రంగాలలో జరుగుతున్న పరిణామాలు ప్రజలకు తీవ్ర నష్టం కలిగిస్తున్నాయి. సామాన్య సగటు కార్మిక, కర్షక, బీద, పేద, వివిధ అణగారిన వర్గాలను దోపిడీకి గురిచేసే సామ్రాజ్యవాదులకు తెలంగాణ కేంద్రంగా మారబోతుంది.

మావోయిస్టు ఎజెండాను అమలు చేస్తామన్న ముఖ్యమంత్రి దానికి భిన్నంగా రాచరికపు బూర్జువా ఎజెండాను మనుస్మృతిలో ముంచి ఎగరేస్తున్నాడనే చర్చ బలంగా వినబడుతుంది. అయినా ముఖ్యమంత్రి ప్రజల జీవన విధానంలో భాగమైన భాషను, యాసను ఉపయోగించి విశ్వాసాన్ని పొందుతూనే ఉన్నాడు. రాజకీయ నాయకుల వేషభాషలు, ఆలోచనలు, ఎత్తుగడలు, వ్యూహాలు, హామీలు, అభివృద్ధి పేరుతో వల్లించే ఉపన్యాసాలు ప్రజల మెదడు నిండా సామ్రాజ్యవాద భావాన్ని నింపే చదరంగం ఆట లాంటిదని అర్థం చేసుకోవాలి. చదరంగం ఆట ప్రపంచంలో అమితమైన తెలివి తేటలను పెంచే క్రీడగా గుర్తింపు పొందినప్పటికీ, అందులో సైనికులు, గుర్రాలు, ఏనుగులు, ఒంటెలు, చివరికి మంత్రి కూడా రాజ్యం, రాజు రక్షణకై తమ ప్రాణాలను కోల్పోవలసినదేననే భావనను నేర్పే పెట్టుబడిదారుల భద్రతకై సామాన్యులు సిద్ధమవ్వాలి అనే ఆలోచనలు పెంచే బహు రాజకీయ ఎత్తుగడల బూర్జువా ఆటలాగా చదరంగాన్ని గుర్తించినప్పుడే, ప్రజల కోణంలో ఆ చదరంగ క్రీడ పూర్తిగా అవగతమౌతుంది.

తెలంగాణ ముఖ్యమంత్రి వరాల వాగ్దాటి కూడా చదరంగం ఆట లాంటిదే. దళితులకు ముఖ్యమంత్రి పదవి, మూడెకరాల భూమి, డబుల్ బెడ్ రూమ్ ఇళ్లు, ఆరోగ్యశ్రీ, 57 ఏళ్లకే పెన్షన్, నిరుద్యోగ భృతి, రైతులకు ఉచిత ఎరువులు, హైదరాబాద్‌ను విశ్వనగరం, డల్లాస్, లండన్ చేస్తాననడం, ఐటీఐఆర్ ప్రాజెక్ట్, అంబేద్కర్ 125 అడుగుల విగ్రహం, దళిత బంధు, యూనివర్సిటీల ఆధునికీకరణ, హుస్సేన్ సాగర్ ప్రక్షాళన, జిల్లాకు ఒక సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి, కేజీ నుంచి పీజీ ఉచిత విద్య, ప్రైవేట్ విద్యా సంస్థల ఫీజుల నియంత్రణ, ఇంటికొక ఉద్యోగం, ఏకకాల రైతుల రుణమాఫీ, ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయ ఉద్యోగాల భర్తీ, ధరణి పోర్టల్ ఇబ్బందుల తొలగింపు, మూతపడిన పరిశ్రమల పునరుద్ధరణ, కాంట్రాక్టు ఉద్యోగుల క్రమబద్ధీకరణ – ఇలా రాష్ట్రంలో అనేక హామీలు నెరవేరక నీరు లేక నెర్రెలు పట్టిన నేలలా నోళ్లు తెరిచి తెలంగాణలో నేటికీ బ్రతుకీడుస్తున్నాయి. ప్రత్యేక రాష్ట్రంలో కూడా పౌరహక్కులు ప్రమాదంలో పడ్డాయి. ప్రశ్నించేతత్వం, సమ్మె హక్కులు, ధర్నాలు చేయడం, ధిక్కార స్వర స్వభావం, సభలు, సమావేశాలు జరపడం లాంటి రాజ్యాంగ హక్కులు అప్రకటిత నిషేధంగా పరిపాలన కొనసాగుతుంది. నేడు ప్రతిపక్షం, మిత్రపక్షం, వామపక్షం, స్వపక్షం తేడా లేకుండా పాలన, పాలసీ అధికారులు సైతం ఫామ్ హౌస్ లోని పరిపాలన ఏకచక్ర ఆధీన ఆధిపత్యంలో ఎవరికీ ప్రశ్నించే హక్కు లేకుండా కలిసి నడిచిపోక తప్పనిస్థితిలోకి తెలంగాణ జారిపోయింది. రాష్ట్రంలో కఠిన నియంత్రణ చర్యలు పాటించకుంటే యావత్ తెలంగాణ మావోయిస్టులమయం కాబడి దేశం నిలువెల్ల ఎగబాకి ఢిల్లీని శాసిస్తారని ప్రజలను భయ పెడుతూ, రాజ్యం భయపడుతూ వరవరరావు, సాయిబాబా లాంటి మేధో వయో వృద్ధులు సైతం జైళ్ళల్లో నెట్టి జంతువులకు హక్కులున్న మనదేశంలో, జంతువుల కన్నా హీనంగా అమానవీయ ధోరణిలో కేంద్ర ప్రభుత్వ పరిధిని సృష్టించి శిక్షిస్తున్నారు. తెలంగాణ ముఖ్యమంత్రి జాతీయ రాజకీయాల్లో కూడా ఇలాంటి పాలనే కొనసాగుతుందని, అద్భుతాలు జరిగి ప్రజల బతుకు మారదని తెలుసుకోవాలి.

మోడీని గద్దెదింపేందుకు జాతీయ రాజకీయాల్లోకి ప్రవేశమన్నట్లుగా వ్యూహాత్మక శత్రుత్వాన్ని సహజ నాటకీయంగా నేర్పుతో ప్రదర్శిస్తున్నారు. దేశం అప్పులు 100 లక్షల కోట్లు దాటించిన మోడీ, రాష్ట్రం అప్పులు నాలుగు లక్షల కోట్లకు చేరిన చంద్రశేఖరరావు – ఇద్దరూ సామ్రాజ్యవాదులకు మనదేశ శ్రామిక, కార్మిక కర్షక అణగారిన వర్గాల శ్రమ చెమట చుక్కలతో తడిచి ముద్దగా మారిన దేశ సంపదను తాకట్టు పెట్టే గుత్తేదారులుగా చరిత్రలో ఎప్పటికైనా

నిరూపితమవుతారు. పాలకవర్గాల శత్రుత్వం నీటి బుడగలాంటిదని, అది జాతీయ రాజకీయమైనా, రాష్ట్ర రాజకీయమైనా పాలనకు అలవాటుపడిన పాలకులు అధికారం అనే నెత్తురు రుచి విడిచి జీవించలేరని, బీభత్స రక్తపాతంలోనూ తడిచిన అధికార కుర్చీ అయితే, ప్రజల రక్తాన్ని సైతం నుదటి విజయ తిలకంలా దిద్దుకుని అధికారానికి అతుక్కుపోతారనే నిజాన్ని ప్రజలు తప్పక గ్రహిస్తారు.

తెలంగాణలో రెండు విడతలుగా ముఖ్యమంత్రి పదవి చేపట్టి మూడోసారి అధికారం చేజారకుండా ఉండేందుకు, జాతీయ రాజకీయాలపై డేగ దృష్టి పెట్టినట్లుగా వార్తల్లోకి ఎక్కి దేశమంతా పర్యటిస్తున్నారు. ఇందులో భాగంగానే మహారాష్ట్ర ముఖ్యమంత్రి ఉద్ధవ్ థాక్రే, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ, తమిళనాడు ముఖ్యమంత్రి స్టాలిన్, జార్ఖండ్ ముఖ్యమంత్రి హేమంత్ సొరేన్, ఢిల్లీ ముఖ్యమంత్రి కేజ్రీవాల్, కేరళ ముఖ్యమంత్రి పినరయి విజయన్, ఒరిస్సా ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్‌లతో పాటు సుబ్రమణ్య స్వామి, కుమారస్వామి, శరద్ పవార్, అఖిలేష్ యాదవ్ ను కలిసి జాతీయ రాజకీయాల చర్చలు పతాక స్థాయి ప్రచారానికి నెట్టారు. తెలంగాణలో నీళ్లు, నియామకాలు, నిధుల కోసం ఉద్యమాలు జరిగాయని, నీళ్లకు కాళేశ్వరం ప్రాజెక్టును, మిషన్ భగీరథను, నిధులకు రైతుబంధుతోపాటు ఇతర ఉచిత స్కీమ్లను, నియామకాలకు 80 వేలకు పైగా ఉద్యోగ ఖాళీలను నింపి తెలంగాణ ఉద్యమ లక్ష్యం నెరవేర్చాననే బుకాయింపు ప్రచారం జాతీయస్థాయిలో బయటకు వస్తుంది. తెలంగాణ రాష్ట్ర సమితికి 2014లో 119 అసెంబ్లీ సీట్లకు గాను అరవై మూడు సీట్లు(63) వస్తే, 2018 ముందస్తు ఎన్నికల్లో 88 సీట్లు సాధించారు. 2018లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో మొత్తం అభ్యర్థులకు స్వయంగా అధికార పార్టీ వేల కోట్లు డబ్బుల వరద ఏరులై పారించి గెలిపించారని, ప్రపంచ చరిత్రలో జరగని, చూడని ప్రజాస్వామ్య విలువల పాలన డబ్బుతో జమ కూడిందనే ప్రజల రచ్చబండ ఉపన్యాసాలు ఇంకా వినబడుతూనే ఉన్నాయి. రాష్ట్రంలో మళ్లీ మూడోమారు పాలనకై రాజకీయ చదరంగ పావులు (పీకే) చకచకా కదులుతున్నాయి. రాజకీయ పండితుల పేరుతో దేశ రాజకీయ నాయకులలోకెల్లా అత్యంత నైపుణ్యాలతో, చాణక్య రాజకీయ ఎత్తుగడలతో, వ్యూహాలతో, కొత్త కొత్త స్కీమ్‌లతో ప్రజల జీవన విధాన సరళిలోకి, వారి అవసరాలలోకి, వారి బతుకులలోకి సేవ చేయడానికే వస్తున్నట్లు, ప్రజల కోసమే జీవిస్తున్నట్లుగా తమ రాజకీయ అధికార అవసరాన్ని ప్రజల శ్రేయస్సుగా మార్చి. ప్రజాస్వామ్యాన్ని నోట్లు, ఓట్లు, సీట్లుగా భావించేలా, భ్రమించేలా పరితపిస్తారు. ప్రత్యేక సర్వేలతో సమీక్షలతో, సామ్రాజ్యవాద శక్తుల కనుసైగలతో కార్పొరేట్ మోసపూరిత అబద్ధ ప్రచార దినపత్రికలై, రచ్చబండ రొచ్చు కాకుల గడిబిడి గోలల గందరగోళ ఎలక్ట్రానిక్ ముఖాలతో చర్చ కొనసాగిస్తారు.

నేడు రాజకీయ వ్యూహకర్తల పేరుతో, విశ్లేషకుల పేరుతో, రాజకీయ అధికార దండాన్ని ప్రసాదించే అపర తెలివిగల మేధావుల పేరుతో సామ్రాజ్యవాద శక్తులు తమ కార్పొరేట్ దళారి పెంపుడు కుక్కలను వేల కోట్ల కిరాయి ప్యాకేజీలకు ఆశ పెట్టి, అమ్మకానికి పెట్టాయి. ఈ కోవలోనే చంద్రశేఖరరావు జాతీయ రాజకీయాలపై, రాష్ట్రంలో రాబోయే ఎన్నికల విజయానికై బీహార్ రాష్ట్రానికి చెందిన ప్రశాంత్ కిషోర్ (పీకే) రాజకీయ పరిశీలకులుగా, విశ్లేషకులుగా, వ్యూహకర్తగా ఉంటారని, అతనిలో గొప్ప కళ ఉందని స్వయంగా ప్రకటించారు. గుజరాత్‌లో 2012లో జరిగిన ఎన్నికల్లో ప్రస్తుత ప్రధానమంత్రి మోడీని మూడోసారి ముఖ్యమంత్రిగా గెలిపించాడనే వార్త పతాక శీర్షికై నిలిచి మొట్టమొదటిసారిగా పీకే విస్తృత ప్రచారం పొందారు. మనదేశంలో 2014లో జరిగిన లోక్ సభ ఎన్నికల్లో సైతం ప్రశాంత్ కిషోర్ నరేంద్ర మోడీకి రాజకీయ సలహాదారుడిలా ఉండి తనదైన ప్రత్యేక ఆలోచనా మార్గంలోనే, రాజకీయ సమీకరణాలను కూడికలు, తీసివేతలతో విభజించి, భాగించి ఈ దేశానికి ప్రధానమంత్రి మోడీ అనే ఫలితాన్ని సాధించిపెట్టాడనే మరో సంచలన వార్త ప్రపంచ మీడియా తనకు ప్రత్యేక ప్రచారాన్ని తెచ్చిపెట్టింది. దేశంలో వివిధ రాష్ట్రాలలో జరిగిన ఎన్నికలకు పీకేను నమ్ముకోవడం అనేక మంది రాజకీయ నాయకులు అలవాటుగా మార్చుకున్నారు. బీహార్‌లో 2015లో జరిగిన ఎన్నికల్లో జేడీయూ గెలుపులో, పంజాబ్‌లో 2017 జరిగే ఎన్నికలలో కాంగ్రెస్ గెలుపులో, ఆంధ్రప్రదేశ్ లో జరిగిన ఎన్నికలలో వైఎస్ఆర్సిపి జగన్మోహన్‌రెడ్డి గెలుపులో, ఢిల్లీలో 2020లో జరిగిన ఎన్నికల్లో ఆమ్ ఆద్మీ పార్టీ (ఆప్) కేజ్రీవాల్‌ను గెలిపించడంలో, తమిళనాడు, పశ్చిమ బెంగాల్‌లలో 2021లో జరిగిన ఎన్నికలలో డీఎంకే పార్టీ స్టాలిన్ గెలుపులో, మమతా బెనర్జీ తృణమూల్ కాంగ్రెస్ గెలుపులో, పీకే తన సర్వశక్తులూ, ఆలోచనలు అద్ది విజయాలను సాధించి పెట్టారనే గ్లోబల్ ప్రచారం అతన్ని మరింత రాజకీయ పండితుడిగా మార్చి ఎక్కువ ఎన్నికల మార్కెట్‌ను సాధించిపెట్టింది.

అసలు పీకే తెలివిగల వాడేనా? అనే ప్రశ్న ప్రజా కోణంలో విశ్లేషించినప్పుడు ప్రజల నిస్వార్థ శ్రమకు, చెమటకు విలువ ఇవ్వని తెలివితేటలు, శ్రామిక, కార్మిక, కర్షకుల నెత్తురే ఈ దేశానికి వెన్నెముకని గుర్తించని మేధస్సును గౌరవించడం ప్రజలను అవమానించడమే. ప్రభుత్వాలు ఉత్పత్తి రంగాలను బలోపేతం చేయకుండా ఆర్థిక స్వావలంబన సాధ్యంకాదు. ఆర్థిక పరిపుష్టి లేకుండా సామాజిక భద్రతకు తావులేదు. ప్రజల సామాజిక, రాజకీయ, సాంస్కృతిక వృద్ధికి తోడ్పడే ఏ కళ ప్రశాంత్ కిషోర్ వద్ద లేదు. ఓటు హక్కు గల ప్రజల మానసిక బలహీనతలు, ఆలోచనలపై పీకే తాను ఎంచుకున్న పార్టీకే ఓటు వేసేలా చేసే ప్రజల కళ్ళకు గంతలు కట్టి నిజం చూడకుండా చేసే ఇంద్రజాల కళ మాత్రమే ఉంది. అక్రమం, అన్యాయం, అధర్మం, అవినీతి, అనైతికత, అలక్ష్యం పెంచుటకు ఉపయోగపడే కళ ప్రజలకు నిరుపయోగమైంది.

స్వార్థం, లంచగొండితనం, నిరుద్యోగం, కులం, మతం, ప్రాంతం, లింగభేదాలు రెచ్చగొట్టి ప్రజల్లో ఓట్ల వేట వేగాన్ని పెంచి, మోసాలతో అధికార సీట్లు సాధించి పెట్టే కళ ఎవరి ప్రయోజనం కోసమో ఆలోచించాలి. ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం, రాజ్యాంగ హక్కుల రక్షణ కోసం, ప్రజల క్షేమం కోసం, భద్రత కోసం, ముఖ్యంగా ప్రజలకు మంచి ప్రజా పాలన కోసం ఉపయోగపడని తెలివితేటలు, వ్యూహాలు, ఎత్తుగడలు అన్ని కూడా దళారీ, బూర్జువా, పెత్తందారీ ఆక్రమిత

# జీయర్ స్వామి వ్యాఖ్యలు ఆదివాసుల అస్తిత్వంపై దాడి

***సమ్మక్క, సారలమ్మల మీద చిన జీయర్ చేసిన అన్యాయమైన వ్యాఖ్యల సందర్భంలో ఆ పరిణామానికి కారణాలనూ పూర్వాపరాలనూ చర్చిస్తున్నారు*** **తండా సదానందం**

దేశ మూలవాసులైన, శ్రమజీవుల ప్రతీకలు, కోట్లాదిమంది కొలిచే ఇలవేలుపులు, తమను నమ్మిన ఆదివాసుల సంక్షేమం కోసం ప్రాణ త్యాగాలు చేసిన అమరవీరులు, ఆధిపత్య ధోరణికి వ్యతిరేకంగా పోరాటం చేసిన, ఆదివాసి వీరవనితలైన సమ్మక్క, సారలమ్మ లను కించపరుస్తూ చిన్న జీయర్ స్వామి చేసిన వ్యాఖ్యలు అగ్రవర్ణ ఆధిపత్య ధోరణికి నిలువెత్తు నిదర్శనం. అడవి బిడ్డలు అంటే చులకన భావంతో ఆదివాసుల అస్తిత్వంపై దాడి గానే పరిగణించాలి. ప్రకృతి సంపదను కాపాడుతూ ప్రకృతిలో విహరిస్తూ మానవాళి సంక్షేమానికి నిరంతరం కృషి చేస్తున్న ఆదివాసీలపై, వారు నమ్ముకున్న, విశ్వాస ప్రతీకలైన వారి తల్లులైన సమ్మక్క సారక్కలను ఉద్దేశించి మాట్లాడుతూ..

"అసలు సారక్క సమ్మక్క ఎవరు? ఏమన్నా దేవతలా? బ్రహ్మ లోకం నుండి దిగి వచ్చిన దేవతలా? ఏమిటి చరిత్ర? అదేదో ఒక అడవి దేవత, అదేదో కేవలం ఒక గ్రామ దేవత, సరే చేసుకోనివ్వండి అక్కడ ఉండేవాళ్లు. కానీ చదువుకున్న వాళ్ళు, పెద్ద పెద్ద వ్యాపారస్తులు చేరి ఆ పేరిట బ్యాంకులు పెట్టేశారండి. దట్ బికేమ్ ఏ బిజినెస్. ఎంత అన్యాయం చేశారు అండి? అది ఒక చెడు. చెడును వ్యాపింపచేస్తున్నారు"

అని అవహేళనగా, చిన్న చూపుగా స్వామి గారు వ్యాఖ్యానించడం వారి అవివేకానికి నిదర్శనం. కానీ ఆదివాసి వీరవనితలైన సమ్మక్క సారలమ్మలు నమ్మిన ప్రజల కోసం నిరంకుశ రాజరికానికి, సామ్రాజ్యవాద ఆధిపత్య ధోరణికి వ్యతిరేకంగా పోరాడి అమరత్వం పొందినవారు. వారిని బ్రహ్మలోకం నుండి దిగి వచ్చినారా? అని చులకనగా నవ్వుతూ మాట్లాడుతూ ఎద్దేవా చేయడం వీడియో ద్వారా బహిర్గతం అయింది. మనుషులు ఎవరైనా తల్లి గర్భం నుండి మాత్రమే జన్మిస్తారు. ఎవరు బ్రహ్మలోకం నుండి ఊడిపడరు. అసలు బ్రహ్మలోకం ఉంటే కదా! స్వామి వారు అనుచిత వ్యాఖ్యలు చేయడానికి కారణం ఏమిటి?

ఎవరీ చిన్న జీయర్ స్వామి? బతుకు తెరువు కోసం ఉద్యోగాన్ని వెతుక్కుంటూ హైదరాబాద్ వచ్చి కోట్లాది రూపాయలు గడించిన వేదగురువు, ఉప దేశస్తుడైన త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామి సాధారణ పేద కుటుంబంలో రాజమండ్రి దగ్గర మండపేట సమీపంలోని అర్థమూరు అనే గ్రామంలో జన్మించారు. పదవ తరగతి చదువుతున్న సమయంలోనే జీయర్ తండ్రి మరణించడంతో కుటుంబ పోషణ బాధ్యత తల్లిపై పడింది. దీంతో కుటుంబ అవసరాల నిమిత్తం ఉద్యోగం కోసం హైదరాబాద్ వచ్చి ఔషధ కర్మాగారంలో కార్మికుడిగా చేరి, ఖాళీ సమయాలలో టైప్, షార్ట్ హ్యాండ్ నేర్చుకుని టైపిస్ట్‌గా స్థిరపడ్డారు. 1975లో కాకినాడలో ఒక కార్యక్రమానికి విచ్చేసిన పెద్ద జీయర్ స్వామి పరిచయం, తర్వాత ఆయన దగ్గరే షార్ట్ హ్యాండ్ ఉద్యోగిగా చేరి, ఆయన పరమపదించిన తర్వాత ఆయన వారసుడిగా, చిన్న జీయర్ స్వామిగా మారి 24వ ఏట సన్యాసం పుచ్చుకొని గీతజ్యోతి వంటి సేవా కార్యక్రమాలు చేపట్టి అమెరికా, కెనడా, హాంకాంగ్, సింగపూర్ దేశాలలో పర్యటించి ప్రవచనాలు వల్లెవేస్తూ, తనదైన శక్తియుక్తులతో రాజకీయ నాయకులను, బడా పారిశ్రామిక వేత్తలను, పెద్ద పెద్ద రియల్టర్లను సైతం తన భక్తులుగా మార్చుకున్న ఘనత జీయర్ స్వామిదే. జీయర్ అంటే సింహం అని అర్థం. ఆయన చేతిలో ఉన్న త్రిదండం ఒక్కొక్కటి ఒక్కో ప్రత్యేకతను అనగా ఒక కర్ర ప్రకృతిని, రెండవది జీవుడును, మూడవది

---

విధానాలే. చంద్రశేఖర రావు జాతీయ రాజకీయం వీటికి అతీతం కాదు. ప్రపంచ దేశాల్లో ఆశ్చర్యపడే స్థాయిలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో విద్యార్థులు తమ ప్రాణాలను త్యాగం చేసి, చరిత్రలో నిలిచినట్లుగానే మనదేశంలో మరో ప్రపంచ స్థాయిలో నిలిచే మరో ఉద్యమం ఢిల్లీలో రైతుల నాయకత్వంలో జరిగింది. దేశ రాజధానిలో ఎండనక, వాననక, తిండి తినక, ఇళ్ళు, భార్య, పిల్లల్ని, పొలాల్ని విడిచి, కోవిడ్ వైరస్‌ను ఎదిరించి 750 మందికి పైగా రైతుల ప్రాణాలు ఇచ్చి, 16 నెలల రెండు రోజులు సుదీర్ఘ రైతు పోరాటానికి ఒకరోజు మద్దతు ఇచ్చి, ఢిల్లీకి వెళ్లిన వెంటనే మద్దతు విరమించిన చరిత్ర మరువకూడదు. అందుకే తెలంగాణ ముఖ్యమంత్రి జాతీయ రాజకీయ ప్రవేశం వార్త అవకాశవాద రాజకీయ ప్రచార పెట్టుబడి వార్త. ఏది ఏమైనా చంద్రశేఖర రావు జాతీయ రాజకీయ ప్రవేశం వలన సామ్రాజ్యవాదుల ఆశయాలు నెరవేరుతాయి తప్ప ప్రజల అవసరాలు తీరవని, దోపిడీదారుల పీడన ఆగదని, ప్రజల కనీస జీవన స్థాయి పెరగదని, రాజ్యాంగాన్ని మార్చే వివాదాస్పద వ్యాఖ్యలు మారవని బుద్ధిజీవులు అర్థం చేసుకోవాలి. మానవ చరిత్ర గతిని నిర్ణయించేవి ఆర్థిక పరిస్థితులే కానీ రాజకీయ, మత, సాంస్కృతిక పరిస్థితులు కావని మార్క్స్ చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకోవాలి. అదే విధంగా ఏ మాటల వెనుక ఎవరి ప్రయోజనాలు దాగి ఉన్నాయో తెలుసుకునే వరకు ప్రజలు మోసపోతూనే ఉంటారన్న లెనిన్ మాటల సాక్షిగా తెలంగాణ ముఖ్యమంత్రి జాతీయ రాజకీయాలను అర్థం చేసుకోవాలి. వీ

*(రచయిత ఉపాధ్యాయుడు)*

దేవుడు అని తెలియజేస్తుందట. ఈ మూడింటికి ప్రాధాన్యత ఇచ్చేవారు త్రిదండకాన్నీ ధరిస్తారు. గతంలో స్వామి వారు తిరుపతిలో ఆగమ శాస్త్ర పండితుడిగా దేవస్థాన నిర్మాణ కార్యక్రమాలలో జోక్యం చేసుకొని వివాదాస్పదం కావడంతో వెనుదిరిగి నెమ్మదిగా హైదరాబాద్ చేరుకొని తెలంగాణ ప్రాంతంలో వికాసతరంగిణి పేరిట హిందుత్వ ఆచార వ్యవహారాలను యువతలో పెంపొందింప చేసేందుకు గ్రామాలవారీగా శ్రీమన్నారాయణ భక్త పటాలంను తయారు చేస్తూ హైదరాబాద్‌లో ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకుని తిష్టవేయడం జరిగింది.

అదే విధంగా తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రిగా కెసిఆర్ ఎన్నికయ్యాక జీయర్ స్వామి ఆస్థాన వాస్తు పండితుడిగా పలు కార్యక్రమాలకు ముహూర్తాలు నిర్వహిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానానికి దీటుగా యాదగిరిగుట్ట నరసింహ స్వామి దేవాలయాన్ని యాదాద్రిగా తీర్చిదిద్దుటకు ప్రభుత్వానికి ముఖ్య ఆగమశాస్త్ర సలహాదారుడిగా తనదైన పాత్రను పోషించాడు. పాలకులతో, రియల్టర్ వ్యాపారులతో, హిందుత్వ వాదులతో సత్సంబంధాలను కలిగి ఉండి హోమియోపతి మెడికల్ కాలేజీ, వందల ఎకరాల ఆశ్రమం, పదుల సంఖ్యలో గోశాలలు, రాష్ట్రవ్యాప్తంగా పలు యజ్ఞయాగాది కార్యక్రమాలు నిర్వహింప చేశాడు. హైదరాబాద్‌కు సమీపంలోని ముచ్చింతల్‌లో సమతామూర్తి తమ కులజుడైన రామానుజచార్యుల పేరిట 120 కేజీల బంగారంతో చైనాలో తయారు చేసిన విగ్రహ ప్రతిష్టాపన కార్యక్రమం ప్రధాన మంత్రి, హోం మంత్రి, మిగతా కేంద్ర మంత్రులతో పాటు, భారతదేశ అత్యున్నత పదవిలో ఉన్న రాష్ట్రపతితో పాటు, దేశంలోని పలు రాష్ట్రాల ముఖ్యమంత్రులను ఆహ్వానించి భారీ స్థాయిలో దాదాపు పన్నెండు వందల కోట్ల రూపాయలు కుమ్మరించి ఘనంగా చేశాడు.

ఈ కార్యక్రమానికి మొదటి వాలంటీరు ముఖ్యమంత్రి కెసిఆర్ అని ప్రకటించి మొదటి రెండు రోజులు ఆయన పర్యవేక్షణలో కార్యక్రమాలు ప్రారంభించడం జరిగింది. ముందుగా అనుకున్న కార్యక్రమం ప్రకారం విగ్రహ ప్రతిష్టాపన రాష్ట్రపతి చేయాల్సి ఉండగా, అలా కాకుండా ప్రధానమంత్రి విగ్రహ ప్రతిష్టాపన చేయడం, ఆ ప్రతిష్టాపన శిలాఫలకంలో ముఖ్యమంత్రి పేరు రాయకపోవడంతో ఆగ్రహం చెంది, ముఖ్యమంత్రి కెసిఆర్ ఆ కార్యక్రమంలో పాలు పంచుకోలేదు.

ఇది జరిగిన కొన్ని రోజులకు జీయర్ స్వామి సమ్మక్క – సారలమ్మలపై తీవ్ర వ్యాఖ్యల వీడియో ఫేస్‌బుక్, వాట్సాప్, సామాజిక మాధ్యమాలలో వైరల్ అయ్యింది. దీంతో భక్తుల విశ్వాసాలను, ముఖ్యంగా ఆదివాసీ సంస్కృతిని అవమానపరిచే విధంగా వ్యాఖ్యలు ఉన్నాయంటూ తీవ్ర విమర్శలు వ్యక్తమయ్యాయి. ఆదివాసీల, కోట్లాది మంది భక్తులు కొలుచుకునే దేవతల వైభవాన్ని, కీర్తిని తగ్గించే విధంగా చేసిన వ్యాఖ్యలను చిన జీయర్ తక్షణమే వెనక్కి తీసుకోవాలని, సమ్మక్క సారక్కలు ప్రకృతి దేవతలు, ప్రజల గుండెల్లో ఉన్నారని, మేడారం జాతర ప్రజా విశ్వాసాలకు అనుగుణంగా జరుగుతుందని ములుగు ఎంఎల్ఎ, ఆదివాసీల ఆత్మ బంధువు సీతక్క సైతం డిమాండ్ చేశారు. రాష్ట్రవ్యాప్తంగా పలు ప్రజా సంఘాలు, వివిధ రాజకీయ పార్టీల అధినేతలు, ఆదివాసీ గిరిజన సంఘాలు, మేడారం సమ్మక్క సారక్క పూజారుల సంఘం నిరసనలు వ్యక్తం చేయడం, చిన జీయర్ దిష్టి బొమ్మలు దగ్ధం చేయడం జరిగింది.

గతంలోనూ స్వామీజీ కులాల కుంపటిపై, తినే ఆహారంపై వివాదాస్పద వ్యాఖ్యలు చేశాడు. ప్రపంచంలో ఎక్కడాలేని నిచ్చెన మెట్ల కుల వ్యవస్థ భారతదేశంలోనే ఉండటం వల్ల సాటి మానవున్ని హీనంగా చూసిన మధ్యరాతియుగపు ఆలోచనలను రేకెత్తించేలా కులాలు ఉండాలి, ఏ కులం వాళ్లు అదే వృత్తిని చేపట్టాలని, మనువాద సంస్కృతిని పెంపొందింప జేసే విధంగా అనుచిత వ్యాఖ్యలు చేశాడు. మనుషులంతా ఒక్కటేనని, దేవుడి ముందు అందరూ సమానులేనని ప్రవచనాలు వల్లించే స్వామి, కులాలు ఉండాలి అని అనడం బానిస సమాజ సంస్కృతిని కోరుకోవడమే. బ్రాహ్మణులు శ్రేష్టులు, కింది కులాల వారు అనగా ఉత్పత్తి కులాల వారు అధములని భావించే స్వామీజీ సమతా మూర్తి పేరిట విగ్రహ స్థాపన చేయడం హాస్యాస్పదమే. ఆయన వ్యాఖ్యలలో సమత లేదు, సమానత్వం లేదు.

అలాగే మాంసాహారుల గురించి మాట్లాడుతూ ఏ జంతువు మాంసం తింటే ఆ జంతువులాగనే ప్రవర్తిస్తుంటారని, పంది మాంసం తిన్న వారు పంది లాగే, మేక మాంసం తిన్నవారు మేక లాగే, కోడి మాంసం తిన్నవారు కోడి లాగే పెంట కుప్పల వెంట తిరుగుతూ ఏరుకొని తింటున్నట్లే ప్రవర్తిస్తారని నవ్వుతూ హేళనగా మాట్లాడిన సందర్భాలు ఉన్నాయి. ప్రపంచ దేశాలలో ఎక్కువ శాతం మాంసాహారులు అన్న సంగతి వివిధ దేశాలు పర్యటించిన స్వామికి తెలియదా? మానవులు మానవుల లాగా కాకుండా జంతువుల లాగా ప్రవర్తిస్తారు అనడం శాస్త్రీయత లేని వ్యాఖ్యలు. అమెరికా వాళ్లు మాంసాహారులు. కానీ శాస్త్ర సాంకేతిక రంగాలలో, అంతరిక్ష పరిశోధనా రంగంలో, అంతర్జాతీయ సినీ రంగంలో, అణ్వాయుధాల తయారీలో ఎన్నో ఆవిష్కరణలు చేసి నోబెల్ ప్రైజ్‌లు, ఆస్కార్ అవార్డులు పొందారు. చైనాలో కూడా ఔషధ రంగంలో, వస్తు తయారీ రంగంలో ప్రతిభ కనబరిచి ప్రపంచవ్యాప్తంగా వస్తు సామాగ్రిని సప్లై చేస్తూ ముందంజలోఉన్నవారు సైతం మాంసాహారులే. ఇలా ప్రపంచ దేశాలలో ప్రతిభ కలిగిన మేధావులు, రచయితలు, శాస్త్రవేత్తలు, రాజకీయవేత్తలు చరిత్రకారులు మాంసాన్ని భుజించే వారే. స్వామి చెప్పినట్లు జంతు మాంసం తింటే ఆ జంతువు లాగా ప్రవర్తించే వారైతే ప్రపంచ దేశాలలో మానవ నాగరికత అభివృద్ధి ముందుకు సాగేది కాదు. ఇలా అసాధ్యమైన, అశాస్త్రీయమైన వ్యాఖ్యలు చేస్తూ ప్రజలను గందరగోళ పరచడం సామాన్య ప్రజలను, సేవలు చేసేవాళ్లను అవమానించడం ఏ శాస్త్ర ధర్మం? ధర్మం, సత్యం, సాంప్రదాయం అంటూ మాట్లాడే స్వామి అర్ధ సత్యాలు మాట్లాడటం దేనికి సంకేతమో వారికే తెలియాలి. ప్రతి మనిషి మొదట మాంసాహారం తీసుకున్న వాళ్లు. ఆదిమ మానవులు వేటాడి బతికిన వారే. జీయర్ స్వామి మాటలకు, ఆచరణకు చాలా తేడా ఉంది. కుల రహిత సమాజం ఏర్పడాలని భారత రాజ్యాంగం చెబుతూ ఉంటే కులాలు ఉండాలనటం రాజ్యాంగ విరుద్ధం. కోట్లాది మందిని, వారి అలవాట్లు, విశ్వాసాల పట్ల హీనంగా చూసేవారు, మాట్లాడేవారు

గురువులు ఎలా అవుతారు?

**రాజ్యాంగ విరుద్ధ అనుచిత వ్యాఖ్యల పట్ల జీయర్ స్వామి వివరణ:**

ఇటీవల వెలుగులోకి వచ్చిన, సామాజిక మాధ్యమాలలో వైరల్ అవుతున్న స్వామీజీ వ్యాఖ్యలు 20 ఏళ్ల కిందటివని, వాటిని ఎడిటింగ్ చేసి తప్పుడు ప్రచారం చేయడం జరుగుతుందని, నేను కామెంట్ చేశాను అని అన్న వారే వాటిని సవరించుకోవాలి అని వేద విశ్వవిద్యాలయ వ్యవస్థాపకులు, చిన్న జీయర్ స్వామి గుంటూరు జిల్లా తాడేపల్లి పరిధిలోని విజయ కీలాద్రి కొండపై విలేకరుల సమావేశంలో వివరణ ఇచ్చారు. ఎవరైనా పత్రికా సమావేశం పెట్టినప్పుడు తమ మీద ఆరోపణలు వస్తే నిజాయితీగా ఆరోపణలకు సమాధానం చెప్పుకుంటారు. అవి తప్పయితే తప్పయింది అని ఒప్పుకుంటారు. అలా కాకుండా ఆ ఆరోపణలు విమర్శలు నిజమైతే వివరణ ఇచ్చుకుంటారు. కానీ స్వామి పత్రికా సమావేశంలో ఇటువంటి సందర్భం ఎక్కడా కనిపించలేదు. మాట్లాడిన వీడియో కండ్ల ఎదురుగా ఉండగా ఆ వ్యాఖ్యలు నేను చేయలేదని బుకాయించడం, కామెంట్ చేశానని అన్నవారే సవరించుకోవాలి అనడం ఏ మేరకు సమంజసం? ఉత్పత్తి కులాల పట్ల, వారి విశ్వాసాల పట్ల, వారి ఆహారపు అలవాట్ల పట్ల హేళనగా, చులకనగా మాట్లాడిన స్వామి తప్పు ఒప్పుకోకుండా నర్మగర్భంగా ఇతరుల మీదికి తోసివేయడం అగ్రకుల ఆధిపత్య ధోరణికి నిదర్శనమే.

**తలెత్తిన వివాదాలకు కారణం:**

స్వాములు స్వాములు గానే ఆశ్రమాలకు పరిమితమైతే ఎటువంటి సమస్యలు తలెత్తవు. కానీ ఆడంబరాలకు పోయి రాజకీయ నాయకులతో అంటకాగుతూ, అధికార దర్పం కోసం వెంపర్లాడితే సమస్యలు తలెత్తుతాయి. సమతా సమానత్వం గురించి చెబుతున్న జీయర్ స్వామి ప్రధాన మంత్రిని, తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులను మాత్రమే వ్యక్తిగతంగా వెళ్లి ముచ్చింతల్ కార్యక్రమానికి ఆహ్వానించారు. కానీ ప్రతిపక్ష నాయకులను ఎవరినీ పట్టించుకోలేదు. రాజకీయ నాయకులు భక్తులుగా వస్తే ఏ సమస్య తలెత్తదు కానీ, వారు అతిథులుగా వచ్చినప్పుడు మాత్రమే ఇలాంటి వివాదాలు తలెత్తుతాయి. రాజకీయ నాయకులు ఎంత మంచి వారు అయినా అందరివారు కాలేరు. శిలాఫలకంపై ముఖ్యమంత్రి పేరు లేకపోవడానికి జీయర్ స్వామి వివరణ ప్రధానమంత్రి కార్యాలయం సూచించిన ప్రకారమే తయారు చేశామని, మా ప్రమేయం తప్పు ఏమీ లేదని. ముచ్చింతల్ కార్యక్రమానికి, ప్రధానమంత్రి కార్యాలయానికి సంబంధం లేదు. ఇది ప్రభుత్వ కార్యక్రమం కాదు, ప్రోటోకాల్ వర్తించదు అన్న సంగతి స్వామి వారికి తెలియదు కాబోలు. ప్రైవేట్ కార్యక్రమాలకు, అందులోనూ ధార్మిక కార్యక్రమాలకు ప్రోటోకాల్ వర్తించదు. మనదేశంలో బహుళ విశ్వాసాలు, ఆచారాలు, సాంప్రదాయాలు ఉన్నాయి. అనేక విశ్వాసాల ఆచారాల సమాహారం. విభిన్న అభిప్రాయాలను కలిగి ఉన్నప్పుడు వాటిని గౌరవించాల్సిన అవసరం ఉంది. మనదేశంలో ప్రజలు అనేక రకాలుగా దేవతలను కొలుస్తారు. చెట్టు పుట్ట, నీరు నిప్పు లాంటి ప్రకృతి దేవతలను, పోచమ్మ, మారెమ్మ, ఉప్పలమ్మ, ఎల్లమ్మ లాంటి గ్రామ దేవతలను కొలుస్తారు. ఎవరి అభిప్రాయం మేరకు వారు విశ్వసించి పూజించుకుంటారు. ప్రజల విశ్వాసాలకు విభిన్నంగా వ్యాఖ్యలు చేయకుండా, ధార్మిక కార్యక్రమాలు రాజకీయ సాన్నిత్యం లేకుండా నిర్వహిస్తే ఎలాంటి వివాదం ఏర్పడదు.

**ఎవరిదీ వ్యాపారం?**

ఆదివాసీల ఆత్మ గౌరవాన్ని చాటి చెప్పే విధంగా విరాజిల్లుతున్న సమ్మక్క – సారక్కల జాతర ప్రపంచంలోనే అతి పెద్ద జాతర. దేశంలోని దాదాపు పది రాష్ట్రాల ప్రజలు ఈ జాతరలో పాలుపంచుకుంటారు. ఆ జాతర వైభవాన్ని, గొప్పతనాన్ని తగ్గించే విధంగా అహంకార పూరితంగా వ్యాఖ్యలు చేయడం తగదు. సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండే వన దేవతలు. అక్కడ దర్శనానికి ధనవంతులకు ఒక విధంగా, పేదవారికి ఒక విధంగా, డబ్బులను బట్టి వివిధ మార్గాలు, దర్శనాలు ఉండవు. ఎవరైనా ఒకే లైన్లో వెళ్లి దర్శించుకోవాల్సిందే. విలువైనటువంటి బంగారు, వెండి, రాగి ఇత్తడి లోహాలతో తయారు చేసిన ఖరీదైన విగ్రహాలు ఉండవు. ప్రకృతి నుంచి ప్రసాదించబడిన మానవాళికి ప్రాణవాయువునిచ్చే వృక్షాలు మాత్రమే ఉంటాయి. వాటిని పసుపు కుంకుమలతో మాత్రమే పూజిస్తారు. ఖరీదైన విలువైన పూజా సామాగ్రి ఉపయోగపడదు. ఈ ప్రకృతి దేవతల వద్ద, ప్రకృతి ఒడిలో విహరించే జాతరలో వ్యాపారం ఎక్కడ జరుగుతుందో? పెద్ద పెద్ద వ్యాపారస్తులు చేరి బ్యాంకులను ఎక్కడ కట్టారు? ఎందుకు వ్యాపారమయం అయిందో స్వామి వారికే తెలియాలి! ఎప్పుడైనా అతడు దర్శించినాడా? చాలా సార్లు ఆ జాతరకు వెళ్లిన వ్యక్తిగా నేను గ్రహించినదేమిటంటే ఏ దేవాలయానికి వెళ్లిన రకరకాల దర్శనాలు, ఖరీదైన పూజలు, విలువైన వస్తు సామాగ్రి సమర్పణలు కనిపిస్తాయి. అటువంటి దేవాలయాలలో లేని వ్యాపారం, నయా పైసా ఖర్చు లేకుండా ప్రకృతి దేవతలను దర్శించే అవకాశం ఉన్న చోట వ్యాపారమయం ఎలా?

స్వామి వారు వందల కోట్ల రూపాయలు గుమ్మరించి, వందల ఎకరాలలో 120 కిలోల బంగారంతో సమతా మూర్తి పేరుతో విగ్రహాన్ని పెట్టి, ఆ విగ్రహాన్ని దర్శించుకునేందుకు 150 రూపాయల టికెట్ పెట్టి అనుమతించడం వ్యాపారం కాదా? అందరూ సమానత్వమే అంటూ, టికెట్ పెట్టి కొందరికి అవకాశం కల్పించడం సమానత్వం ఎలా అనిపించుకుంటుంది? ఆ విగ్రహం చుట్టూ రియల్ ఎస్టేట్ వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చెందనున్నది. ప్రకృతి దేవతల వద్ద వ్యాపారమా? సమతా మూర్తి వద్ద వ్యాపారమా? సులభంగా ఎక్కడ వ్యాపారం జరుగుతుందో అర్థం చేసుకోవచ్చు. స్వామి వారు చేసే వ్యవహారాలన్నీ డబ్బుతో కూడుకున్నవి కాదా? స్వామి వారు అడుగు పెడితే ఒక రకమైన ఫీజు, యజ్ఞయాగాలు చేస్తే ఒక విధమైన దక్షిణ, ఏవైనా గుళ్లు గోపురాలలో ప్రతిష్ఠా కార్యక్రమాలు చేస్తే మరొక విధమైన ఫీజు, తనను ముట్టుకోనిస్తే మరొక విధమైన వాయింపు. ఇలా ప్రతి పనికి వేలాది రూపాయలు

వసూలు చేయడం, మానవాళి సంక్షేమం కోసం క్రతువులు నిర్వహిస్తున్నామని చెప్పి కోట్లాది రూపాయలు చందాల పేరిట వసూలు చేయడం వ్యాపారమయం కాదా? తమరు చేసేవన్నీ జనోద్ధరణ సేవా కార్యక్రమాలు, శ్రమజీవుల తరపున పోరాటం చేసి అసువులు బాసిన వనదేవతల వద్ద వ్యాపారమయం అయిందా? పదో తరగతి ఫెయిల్ అయిన మీరు, కొంతకాలం ఫార్మా కంపెనీలో పనిచేసి, టైపు నేర్చుకొని పెద్ద జీయర్ స్వామి వద్ద టైపిస్ట్‌గా చేసిన మీకు వేల కోట్ల రూపాయలు ఎక్కడి నుండి వచ్చాయి? వాటి వెనక మతలబు ఏమిటి? మీరు రియల్ ఎస్టేట్ వ్యాపారంలో భాగస్వామి కాదా? ఎవరిది వ్యాపారం, ఎవరిది సేవా కార్యక్రమం ప్రజలకు తెలుసు. బాబాలు, స్వాముల ఆశ్రమాలు చీకటి వ్యాపారం, అసాంఘిక కార్యకలాపాలకు నిలయాలుగా బయట పడిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. స్వాములు చీకటి సామ్రాజ్యాధినేతలుగా జోరుగా వ్యాపారం చేస్తూ, పాలకవర్గాల నల్లధనాన్ని దాచిపెట్టే బినామీలుగా అక్రమ వ్యాపారం చేస్తున్న సంగతి విదితమే.

**ముగింపు:**

2014 నుండి ప్రజల ఆచార వ్యవహారాలపై, మత విశ్వాసాలపై, ప్రజల ఆహారపు అలవాట్లపై సాంస్కృతిక విధ్వంసం కొనసాగుతూ ఉంది. తమకు అనుకూలంగా తమ ఆచార వ్యవహారాలను పాటించని ప్రజలను అవమానపరుస్తూ కించపరిచే విధంగా చులకన భావంతో అవహేళనగా మాట్లాడుతూ భౌతిక దాడులను కొనసాగిస్తూ, ప్రశ్నించిన వారిని నానా రకాలుగా చిత్రహింసలకు గురి చేస్తూ, అక్రమ కేసులు బనాయించడం, జైళ్ల పాలు చేయడం, వీలైతే కాల్చి చంపడం లాంటి అమానవీయ ఘటనలు కోకొల్లలుగా జరుగుతున్నాయి. అందులో భాగంగానే అహంకార పూరితమైన, శాస్త్రీయత లేని చిన్న జీయర్ వ్యాఖ్యలు. పాలకులు రాజకీయ వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి, ప్రజా సంక్షేమం నుండి తప్పించుకోవడానికి ప్రజలను దారి మళ్లించే ఈ విధంగా వ్యాఖ్యలను తమకు అనుకూలమైన వారిచేత పలికిస్తారు. ప్రజా సమస్యలను మర్చిపోయి, ప్రభుత్వ వైఫల్యాల గురించి ఆలోచించకుండా సామాన్య ప్రజలు వీటి గురించి చర్చించుకోవడం జరుగుతుంది. ఇలా పాలకులు తమ పబ్బం గడుపుకోవడానికి చేసే ప్రయత్నంలో భాగమే ఈ అనుచిత వ్యాఖ్యలు. ప్రజలందరూ వీటి పట్ల చర్చిస్తూ నిమగ్నమై పోవడంతో, ఈ ముసుగులో పాలకులు తాము చేయాల్సిన, తమ అనుయాయులకు దోచి పెట్టే కార్యక్రమాలు సవ్యంగా అమలు చేస్తారు. తెలుగు రాష్ట్రాలలో హిందుత్వ మనువాద సంస్కృతిని అభివృద్ధి పరిచేందుకు సంఘ్ పరివార్ ప్రతినిధిగా జీయర్ స్వామి వ్యవహరిస్తున్నాడు. వీటన్నింటి పట్ల జాగరూకతతో వ్యవహరించి, శాస్త్రీయ విధానాన్ని, శాస్త్రీయ విలువలను పెంపొందించేందుకు ప్రజాస్వామిక వాదులు, పౌరసమాజం కృషి చేయవలసిన అవసరం ఆవశ్యకం.

*(రచయిత టిపిటిఎఫ్ రాష్ట్ర కౌన్సిలర్, మహబూబాబాద్)* వీ

## సంస్మరణ

**ప్ర**ఖ్యాత సాహిత్య విమర్శకులు, తెలుగు అధ్యాపకులు కడియాల రామమోహన్ రాయ్ (78) అనారోగ్యంతో గుంటూరులో ఏప్రిల్ 6న కన్నుమూశారు. గుంటూరు సమీపంలోని సిరిపురం గ్రామానికి చెందిన రామమోహన్ రాయ్ నాలుగు దశాబ్దాల పాటు తెలుగు అధ్యాపకులుగా పనిచేశారు. గుంటూరు జె కె సి కాలేజీలో తెలుగు శాఖాధిపతిగా పని చేశారు. తెలుగు కవితా వికాసం (1947–80), తెలుగు సాహిత్యంపై శ్రీశ్రీ ప్రభావం, కృష్ణశాస్త్రి కవితా వైభవం వంటి పదికి పైగా పుస్తకాలు, వందలాది సాహిత్యవిమర్శ వ్యాసాలు, పుస్తకసమీక్షలు, రేడియో ప్రసంగాలు, సాహిత్యోపన్యాసాలు చేశారు.

**భా**రత కమ్యూనిస్టు పార్టీకి అనుబంధంగా అనేక రంగాలలో క్రియాశీల కార్యకర్తగా, నాయకురాలిగా పనిచేసిన పి వసుమతి దేవి (65) ఏప్రిల్ 14న తిరుపతిలో గుండెపోటుతో కన్నుమూశారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థిగా అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్తగా రాజకీయ జీవితం ప్రారంభించిన వసుమతి, సిపిఐ నాయకులు కంకణాల నారాయణను ఆదర్శ వివాహం చేసుకున్నారు. సహకార బ్యాంకు ఉద్యోగిగా పనిచేస్తూ, రాష్ట్రస్థాయి వర్కింగ్ ఉమెన్ కమిటీ కన్వీనర్ గా పని చేశారు. బ్యాంకు మేనేజర్‌గా పదవీ విరమణ తర్వాత మీడియా రంగంలో పని చేశారు. మరణానంతరం కూడ తన దేహం వైద్య విద్యార్థుల పరిశోధనకు ఉపయోగపడాలని శరీరాన్ని ఎస్ వి మెడికల్ కాలేజికి అప్పగించాలని కోరారు.

**తె**లంగాణ రైతాంగ సాయుధ పోరాట కార్యకర్త కొండపల్లి దుర్గాదేవి (89) వృద్ధాప్యంతో, అనారోగ్యంతో హైదరాబాద్ లోని ఒక ఆస్పత్రిలో ఏప్రిల్ 19న మరణించారు. ఖమ్మం జిల్లాకు చెందిన దుర్గాదేవి రైతాంగ పోరాటంలో సహకార్యకర్త, ఆ తర్వాత కాలంలో సిపిఐ, సిపిఐ (ఎం) శాసనసభ్యుడిగా పనిచేసిన కె ఎల్ నరసింహారావును 1949లో ఆదర్శ వివాహం చేసుకున్నారు. 1954 నుంచి కమ్యూనిస్టు పార్టీ సభ్యురాలిగా, 1964 తర్వాత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) నాయకురాలిగా, మహిళా సంఘం నాయకురాలిగా పనిచేశారు.

# చిన జీయర్ స్వామి గురించి ఆలోచించాలి!

*ఒకవైపు సమతా మూర్తి ఆవిష్కరణ, మరొక వైపు అణగారిన వర్గాల పట్ల అనుచిత వ్యాఖ్యలు చేస్తున్న చిన జీయర్ స్వామి గురించి ప్రజలు ఆలోచించాలని అంటున్నారు* **మేరుగు రాజయ్య**

వలస పాలకులైన బ్రిటిష్ వారు భారతీయులను పౌరులుగా తీర్చిదిద్దడానికి వచ్చామని చెప్పుకునేవారు. సంస్కృతి, నాగరికతలేని అనాగరికులని నిందించేవారు. పంది, నల్లజాతీయులు మొదలైన పదాలతో భారతీయులను సంబోధించేవారు. యూరోపియన్లు ఉన్న హోటల్స్, క్లబ్‌లకు అనుమతించేవారు కాదు. 'కుక్కలకు, భారతీయులకు ప్రవేశం నిషేధం' అనే బోర్డులను క్లబ్‌ల ముందు ప్రదర్శించేవారు. సరిగ్గా చిన జీయర్ స్వామి కూడా తెలుగు ప్రజలపై అలాగూ అనుచితంగా ప్రవర్తిస్తున్నాడు. హైదరాబాదుకు మకాం మార్చిన తర్వాత, ముఖ్యమంత్రులతో హెలికాప్టర్లలో ప్రయాణించిన తర్వాత, యాదగిరి పేరును యాదాద్రిగా మార్చిన తర్వాత చిన్న జీయర్ స్వామి పోకడలో చాల మార్పు వచ్చింది. శరీర అవయవాల మాదిరిగా ఏ కులపోదు ఆ కులం పనిని చేయాలని, పంది, కోడి మాంసం తిన్నవాడు జంతువుల వలెనే ప్రవర్తిస్తారని, సమ్మక్క సారలమ్మ బ్రహ్మ నుండి పుట్టలేదని, దేవతలు కారని, చదువుకున్న వారు, వ్యాపారులు ఆరాధిస్తూ సమాజంలో చెడును వ్యాప్తి చేస్తున్నారని ఆవేదనను వెలిబుచ్చాడు. చిన జీయర్ స్వామి అహంకారంగా ప్రవర్తించడానికి కారణం ఏమిటని ఆలోచించినట్లయితే ధనం, అధికారం అని చెప్పక తప్పదు. ఇంతకు తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం దగ్గర కావడానికి చిన జీయర్ స్వామి చేస్తున్న పనిపై ఆలోచించాలి.

చిన జీయర్ స్వామికి ముందు 11వ శతాబ్దంలో శ్రీ రామానుజాచార్యులు, తరువాత పెద్ద జీయర్ స్వామి వైదిక ప్రచారాన్ని కొనసాగించారు.

భగవంతుడి కృపను పొందడానికి, అజ్ఞానం నుండి విముక్తమై మరణానంతరం మోక్షం పొందడానికి భక్తి మార్గాన్ని అనుసరించాలని ప్రచారం చేశారు. అందులో 'నీవు దైవం, నేను జీవున్ని, నీవు గురువు, నేను శిష్యుడన'ని ద్వైతం చెప్తుంది. మధ్వాచార్యులు ప్రవచించిన మతం, జీవాత్మ, పరమాత్మలు రెండూ వేర్వేరుగా ఉంటాయని చెబుతుంది. సృష్టిలో కంటికి కనిపించే ప్రతిదీ, కంటికి కనిపించని పరమాత్మ వాసుదేవుడి మీద ఆధారపడి ఉంటుందని ఆయనే ఈ సృష్టికి మూల కారకుడని తెలుపుతుంది. భాషాపరంగానైతే ద్వైతం కానిది అద్వైతం అని అర్థమవుతుంది. కాని ఆధ్యాత్మిక భావనలో మాత్రం నీవు, నేను ఒకటేనన్న భావనను చెప్పుతుంది. జీవాత్మ, పరమాత్మల ఏకత్వ భావనే అద్వైత సిద్ధాంతంగా ఆదిశంకరాచార్యులు ప్రతిపాదించాడు. శంకరుడు బోధించిన తత్వం, అద్వైతం, రెండూ కూడా ఆత్మ, బ్రహ్మం (పరమాత్మ) ఒకటే అనేది మూల సూత్రంగా చెపుతాయి. నీవు, దేవుడు, నేను, జీవి, ప్రకృతి, పంచభూతాలనేవి వేర్వేరు అయినా ఒక దానిలో ఒకటి మిళితమై వ్యాపించి ఉంటాయి అని విశిష్టాద్వైతం అనేది 11వ శతాబ్దిలో రామానుజాచార్యులు ప్రతిపాదించిన వేదాంత దర్శనం. జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు మూడు సత్యాలనేవి విశిష్టాద్వైతం అని, చిత్ అనబడే జీవునితోను, అచిత్ అనబడే ప్రకృతితోను ఈశ్వరుడు ఉంటాడని, శరీరంలో జీవుడు ఉన్నట్లుగానే జీవునిలో అంతర్యామిగా శ్రీమన్నారాయణుడు ఉంటాడని చెప్పాడు. అజ్ఞానవశంతో జీవులు సంసార బంధంలో చిక్కుకుంటారని, భగవదనుగ్రహం వలన సద్గురుల కృప వలన భగవంతుడి శరణాగతులై అజ్ఞానం నుండి విముక్తులై మరణాంతరం మోక్షం పొందుతారని, అట్లా మరో జన్మ లేకుండా నారాయణ సాన్నిధ్యంలో ఉంటారని బోధించాడు.

తరువాత కాలంలో విశిష్టాద్వైత బోధనలను శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి కొనసాగించారు. జీయర్ అంటే వైష్ణవ సాంప్రదాయంలో చరమాశ్రమంలో ఉండే వారికి ఆపేరు పెడుతారు. జీయర్ స్వామి 1909లో అవతరించాడు. 1930లో బ్రాహ్మణేతరులను విష్ణు సహస్రనామ స్తోత్రం, భగవద్గీత చదివే వారిని సమాజం నుండి వెలివేసే వారు. అప్పుడు స్వామి మహిళా మండలిల ద్వారా గ్రామాలలో సంచరించి ఇండ్లల్లో ప్రతి రోజు పూజ చేసుకునే సాంప్రదాయం అలవాటు చేశారు. 26 సంవత్సరాల వయస్సులో వెంకటేశ్వర స్వామి సేవలో చేరాడు. తిరుమల ఆలయ ప్రధాన అర్చకులలో ఒకరిగా బ్రహ్మోత్సవాలను నిర్వహించాడు.

ఇప్పటి చిన జీయర్ స్వామి ఆంధ్రప్రదేశ్, తూర్పు గోదావరి జిల్లా, మండపేట మండలం, అర్తమూరు గ్రామంలో 1956 అక్టోబర్ 31న నారాయణాచార్యులు (చిన జీయర్ స్వామి) జన్మించాడు. 1980 ఫిబ్రవరిలో కాషాయం ధరించి, ధ్వజం పట్టి సన్యాసాశ్రమం తీసుకున్నాడు. మానవత్వానికి ప్రతీకగా చెప్పుకునే పెద్ద జీయర్ స్వామి అడుగుజాడల్లో చినజీయర్ స్వామి ప్రయాణాన్ని మొదలు పెట్టాడు. శ్రీమన్నారాయణ వేద వేదాంగ పాఠశాల బాధ్యతలను గోపాలచార్య స్వామి నుండి తీసుకున్నారు. 1979లో తిరునాటికి నడచి వెళ్లి పెద్ద జీయర్ స్వామి పరమపదించారు. దానితో చిన జీయర్ స్వామిపై బాధ్యతలు పెరిగినవి. వైదిక ప్రచార కార్యక్రమాలను, ఉభయ వేదాంతాచార్య పీఠంలో పండిత సదస్సులను నిర్వహించాడు. వైదిక సాంప్రదాయ గ్రంథాలను ముద్రించారు. వేద విద్య ఆగమ శాస్త్రాలను విద్యార్థులకు నేర్పించేందుకు జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ (జెట్)ను స్థాపించారు. మూడంతస్తుల దివ్య సాకేత క్షేత్రం, గురుకులం, గోశాల నడిపిస్తున్నారు. జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ (జీవా) స్థాపించారు.

రంగారెడ్డి జిల్లా, శంషాబాద్ దగ్గర ముచ్చింతల్ శ్రీరాం నగర్‌లో

# రాజ్యాంగం అమలుపై సమీక్ష జరగాలి

*రాజ్యాంగాన్ని మార్చాలని తెలంగాణ ముఖ్యమంత్రి వ్యాఖ్యానించిన నేపథ్యంలో రాజ్యాంగం గురించీ, దాని అమలు గురించీ వివరిస్తున్నారు* **ఎన్. నారాయణరావు**

తెలంగాణ ముఖ్యమంత్రి రాజ్యాంగాన్ని మార్చాలని మాట్లాడటంతో మిగతా రాజకీయ పార్టీలన్నీ రాజ్యాంగ ద్రోహిగా ఆందోళన చేసాయి. కేంద్ర ప్రభుత్వం రాజ్యాంగానికి అనుకూలంగా ఫెడరల్ స్ఫూర్తికి కట్టుబడి ఉండడం లేదనే విషయాన్ని మనందరం గుర్తించాల్సిన అవసరం ఉంది. చివరికి బహుజనుల కోసమే పుట్టిన పార్టీ కూడా ఆంధ్రలో కారంచేడు ఘటన తర్వాత సాధించిన ఎస్సీ/ఎస్టీ అత్యాచార నిరోధక చట్టం 1989 కూడా బలహీనపడేలా చేస్తూ, దళితులకు కూడా ఉపయోగం లేకుండా చేస్తున్న స్థితిలో దళితుడు ఎలా జీవించాలి? అనే విషయానికి స్పష్టత లేకుండా పోయింది.

ఇప్పటికీ కరువు జిల్లా ఉమ్మడి మహబూబ్‌నగర్ జిల్లాలో రెండు గ్లాసుల సిద్ధాంతం ఉనికిలో ఉంది. రాజ్యాంగం బలంగా రాసుకున్నప్పటికి పేద ప్రజలకు నేడున్న స్థితిలో జీవనమే లేకుండా పోతున్నది. సాధించుకున్న హక్కులు అమలుకు నోచుకోలేక ఒకప్పటి దుర్భర జీవితాన్నే ప్రజలు అనుభవిస్తున్నారు. రైతాంగ పోరాటాల మూలంగా వచ్చిన భూసంస్కరణలు అమలుకు నోచుకోకుండా పోయాయి. సిరిసిల్లా జగిత్యాల పోరాటాల వల్ల గడీల రాజ్యాన్ని కూలదోసినప్పటికి ఉత్తర తెలంగాణ జిల్లాలో వెలమ దొరల రాజ్యం కొనసాగుతూనే ఉన్నది. 50 యేళ్ల కిందట భూస్వాముల దొరల కబంధ హస్తాల్లో ఎలాగైతే తెలంగాణ బందీ అయి ఉందో అదే స్థితిలో మరో రూపంలో కొనసాగుతుంది. అప్పుడు కనీసం వామపక్ష ఉద్యమాలు, పోరాటాలు ప్రజలకు అండగా కొనసాగేవి. నేడు ఆ పోరాటాలే లేకుండా నిర్బంధం ముందుకు వచ్చే సరికి ప్రజలకు మరొకదారి లేక ఆత్మహత్యల జాతర కొనసాగిస్తున్నారు.

ఒక రాష్ట్ర ముఖ్యమంత్రిగా తానుగా కోల్పోతున్న హక్కుల కోసం రాజ్యాంగంలో మార్పులు చేయాల్సిన అవసరం ఉందని కెసిఆర్ భావించారు. అదే విధంగా ప్రజలు సాధించుకున్న హక్కు అమలుకు నోచుకోవడం లేదు. అందుకోసం ప్రజలందరు రాజ్యాంగంలో మార్పు కోరుకుంటున్నారు. ప్రభుత్వాలు రాజ్యాంగ హక్కుల అమలు చేయలేకపోయేసరికి వాటి అమలుకోసం ప్రజలు వెంపర్లాడుతున్నారు. హక్కుల సాధనకు ఒక పోరాటం, అమలుకు మరొక పోరాటం అవసరమైన నేటి స్థితిలో ప్రజలు నిత్యం పోరాటానికి సిద్ధం కావాల్సిన అవసరం ఉంది. కెసిఆర్ జిల్లాలో పర్యటనకు బయలుదేరినపుడు స్థానిక ప్రజాసంఘాలు, రాజకీయ పార్టీల నాయకులను గృహ నిర్బంధం చేయడమో, లేక పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించడమో చేసిన సందర్భాలు కోకొల్లలు. రాష్ట్రాలపై కేంద్రం, జిల్లాలపై రాష్ట్రం హక్కుల అణచివేతలో పోటీ పడుతున్నాయి. ఆ అణచివేతే దేశంలో ఉండాల్సిన ఫెడరల్ స్ఫూర్తికి విరుద్ధంగా పాలన కొనసాగుతున్నది. రాష్ట్రంలోని ఆదాయ వనరుల అన్ని విభాగాలు కేంద్రం నూతన చట్టాల్లో చేర్చి ఆధీనంలో తీసుకోవడం వలన రాష్ట్రాలన్నీ కేంద్రంపై ఆధారపడే స్థితికి చేరుకుంటున్నాయి. రాష్ట్రాల స్వయంపాలన కనుమరుగవుతున్న స్థితి ఏర్పడుతుంది.

రాజ్యాంగం ఒకవైపు ప్రజలకు స్వేచ్ఛ, సమానత్వం, ప్రజాస్వామ్యం, సామాజిక న్యాయం అందించే సాధనంగా ఉంటూ మరొకవైపు భూస్వాముల, పెట్టుబడిదారుల, దళారీ బూర్జువా ప్రయోజనాలను వారి అధికారాన్ని పరిరక్షించే విధంగా ఉనికిలో ఎలా ఉండగలుగుతుందో మనందరం ఒకసారి ఆలోచించాలి. రాజ్యాంగం ఒక బలమైన భావజాలంగా సమాజం మీద పనిచేస్తుంది. పాలక వర్గాలు, రాజ్యాంగం, చట్టం ద్వారానే అధికారాన్ని వ్యక్తీకరించి అమలు చేస్తాయి. అధికారానికి

11వ శతాబ్దికి చెందిన హిందూ వేదాంత వేత్త, తత్వవేత్త, రామానుజాచార్యుల విగ్రహాన్ని విరాళాలు సేకరించి, 216 అడుగుల ఎత్తుతో, పంచలోహంతో చైనా దేశంలో తయారు చేయించి, సమతా మూర్తి, స్టాచ్యూ ఆఫ్ ఈక్వాలిటీ పేర ప్రధానమంత్రి నరేంద్ర మోడీ చేతుల మీదుగా 2022 ఫిబ్రవరి 5న ఆవిష్కరణ చేయించాడు. రు. 1,000 కోట్ల ఖర్చుతో, 150 కిలోల, 54 అడుగుల సమతా మూర్తి స్వర్ణ ప్రతిమను రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ చేత ఫిబ్రవరి 13న లోకార్పణం చేయించారు. ఈ కార్యక్రమాన్ని నిర్వహించడానికి 5,000 మంది రుత్వికులను, 2 లక్షల కిలోల ఆవు నెయ్యిని వినియోగించారు. ఇంకా వంద పడకల హోమియో ఆస్పత్రిని, హోమియో కళాశాలకు 200 ఎకరాల భూమిని వినియోగించు కుంటున్నారు.

ప్రభుత్వం, మతం రెండూ కూడా నాణెంకు బొమ్మ, బొరుసు వంటివి. ఇచ్చి పుచ్చుకునే ధోరణితో వ్యవహరించుకుంటాయి. ఒకరినొకరు ప్రశంసించుకుంటూ, సమర్థించుకుంటూ ప్రజలను మోసం చేస్తారు. ప్రజలను భౌతికం, వర్తమానం, భవిష్యత్తు గురించి ఆలోచనలు చేయకుండా మతం, కులం, మూఢ విశ్వాసాలను తెర మీదకు తెస్తారు. ఉధృతంగా, ఆర్భాటంగా ప్రచారం చేస్తారు. అందులో భాగంగానే చిన జీయర్ స్వామి స్థాపించిన సమతా మూర్తి విగ్రహ ఆవిష్కరణ కార్యక్రమానికి రెండు తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం పూర్తి సహాయ, సహకారాలు అందించారు. స్వయంగా పాల్గొన్నారు. కాబట్టి ప్రజలే చిన జీయర్ స్వామి, బాబాల గురించి ఆలోచించి తమ నిర్ణయాన్ని, భవిష్యత్తును ప్రకటించుకోవలసి ఉన్నది.

*(రచయిత కేంద్ర కార్యదర్శి, సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్, ఎఐటియుసి)*

వీ

సామాజిక ఆమోదాన్ని పొందడానికి రాజ్యాంగంపై ఆధారపడతారు. భారత రాజ్యాంగ నిర్మాతలపై ప్రధానంగా మూడు చారిత్రక పోరాటాల స్రవంతులు, వాటి ఆలోచనల ప్రభావం ఉంది. పాశ్చాత్య దేశాల్లో జరిగిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలు, సోషలిస్టు విప్లవాల ప్రభావంతో పాటు మన దేశంలో బ్రిటిష్ వలస పాలనకు వ్యతిరేకంగా వివిధ వర్గాలు జరిపిన పోరాటాలు, స్వాతంత్ర్య పోరాటం ముందుకు తెచ్చి ఆకాంక్షలు, ఆశయాలు, భారత రాజ్యాంగంలో వ్యక్తీకరించబడ్డాయి. రాజ్యాంగం పీఠిక, ప్రాథమిక హక్కులు, ఆదేశికసూత్రాలుగా రూపొందించబడ్డాయి.

రాజ్యాంగంలోని ఆశయాలకు, ఆదర్శాలకు సామాజిక వాస్తవానికి మధ్య చాలా వ్యత్యాసం ఉంది. వైరుధ్యం ఉంది. దేశంలో సామాజిక రాజకీయ సంక్షోభాలు ఏర్పడినపుడు ఈ వైరుధ్యాలు తీవ్రతరం అవుతున్నాయి. సమాజంలో వర్గాల మధ్య ఘర్షణపై రాజ్యాంగం స్పందిస్తుంది. కాని స్పందన భూస్వాములు, పెట్టుబడిదారుల వైపే ఉంటుంది. కాబట్టి రాజ్యాంగం ద్వారా బాధ్యతల్లోకి వచ్చిన న్యాయమూర్తులు ప్రజల వైపు కాకుండా పెట్టుబడిదారులవైపు స్పందిస్తున్నారు. ఈ స్థితిలో దేశంలో సమానత్వం, ప్రజాస్వామ్యం ఎలా నిలబడతాయి?

పోరాటాలు, ఆందోళనలు, నిరసనలు అభివృద్ధికి ఆటంకాలుగా ప్రభుత్వాలు భావిస్తాయి. చివరికి సుప్రీంకోర్టు కూడా భావించేలా అవి ప్రయత్నం చేస్తాయి. చివరికి సుప్రీంకోర్టు కూడా భావిస్తుంది. హక్కులు ఒకరిస్తే రావు, రాజ్యాంగంలో రాయబడవు. ప్రజలే పోరాడి సాధించుకుంటారు. అవి ప్రజా ఉద్యమాల ఒత్తిడి మేరకు రాజ్యాంగంలో చేర్చబడతాయి. అమలు చేయాల్సిన ప్రభుత్వాలు ప్రజాస్వామ్యానికి విరుద్ధంగా తమ వర్గానికి అనుకూలంగా ఉండేసరికి, హక్కుల అమలు కోసం కూడా ప్రజా ఉద్యమాలు తప్పనిసరియైన పరిస్థితిని ప్రభుత్వాలే కల్పిస్తాయి. హక్కుల అమలు ఉద్యమాలను తీవ్ర రూపంలో అణచివేతకు గురి చేస్తాయి. చివరికి ప్రజలను నిశ్శబ్దం చేయడానికి ఎంతటి రక్తపాతానికైనా ప్రభుత్వాలు ఒడిగడతాయి. ప్రభుత్వాలు దాన్ని పూర్తిగా శాంతి భద్రతల సమస్యగా మార్చేసి, ప్రజాస్వామ్యం పేరుతో అణచివేతను ప్రయోగిస్తాయి. అమలు విషయం వచ్చే సరికి బాధిత ప్రజలకు అనుకూలంగా కాక, ఆధిపత్య అగ్రవర్ణాల పక్షాన ఉండి, చివరికి న్యాయస్థానాల వత్తాసు తీసుకొని బాధితులకు న్యాయం అందించని ఘటనలు ఎన్నెన్నో ఉన్నాయి. అందుకే ప్రజలు ప్రజాస్వామ్యం మీద, న్యాయస్థానాల మీద విశ్వాసం కోల్పోతున్నారు. ఆ కోల్పోయిన స్థితిలో అసహనాన్ని, కోపాన్ని నిర్బంధ రూపాలతో ఎప్పటికప్పుడు నియంత్రించగలనని ప్రభుత్వం భ్రమల్లో ఉంటుంది. కాని అక్కడే ప్రజా ఉద్యమాలు విజయం సాధిస్తాయి. ప్రభుత్వాలు పడిపోతాయి. వ్యవస్థలో సమూల మార్పుకై ప్రజల తిరుగుబాటు వస్తుంది. సమాజంలో ఒక బలమైన మార్పుగా ఉత్పన్నమౌతుంది, అభివృద్ధి చేస్తుంది. సమాజ తిరోగమనాన్ని చరిత్రలో కలిపేస్తుంది. దాన్ని మనమెవరం ఆపలేని స్థితి కచ్చితంగా మన ముందుకు వస్తుంది. కలలు కనలేని వారు, రేపటిని అంచనా వేయలేని వారు నిజాన్ని ఆస్వాదించలేరు. నిజమెప్పుడూ ఒక కచ్చితత్వంగానే ఉంటుంది. అలాగని ఎప్పుడూ మెత్తగా ఉండదు, చాలా కఠినంగానే ఉంటుంది.

పెట్టుబడిదారీ సమాజంలో దోపిడికి వ్యతిరేకంగా, శ్రమ విముక్తి కోసం సోషలిస్టు విప్లవాలు జరిగాయి. రష్యాలో విప్లవం తర్వాత సోషలిస్టు సమాజ నిర్మాణానికి దోహదపడే విధంగా కార్మిక వర్గ దృక్పథంలో రాజ్యాంగాన్ని రచించారు. కమ్యూనిస్టు రాజకీయ ఆర్థిక విధానాలను అమలు చేయడానికి, రాజ్యాంగాన్ని సాధనంగా ఉపయోగించారు. ఆ తరువాతి కాలంలో రష్యాలో సోషలిజం పేరుతో పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరించబడింది. రాజ్యాంగం కార్మిక వర్గ దృక్పథాన్ని కోల్పోయింది. 1992లో సోషలిస్టు రష్యా విచ్ఛిన్నమైపోయి చాలా దేశాలు స్వతంత్రతను పొందాయి. ఆ విధంగా పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద దేశాలుగా మారిపోయాయి. సామ్రాజ్యవాదమంటేనే పెట్టుబడిదారీ అత్యున్నత దశ. పెట్టుబడిదారీ సమాజం సంక్షోభాల నుండే యుద్ధాలు పుడతాయి. సోషలిస్టు సమాజాలే ప్రజలకు సమానత్వాన్ని అందించేవిగా ఉంటాయి.

రాజ్యాంగంపై రాష్ట్రాల ముఖ్యమంత్రులు మాట్లాడితేనే రాజ్యాంగ ద్రోహిగా మార్చబడే స్థితిలో రాజ్యాంగం పెట్టుబడిదారుల ఆస్తుల రక్షణకు విస్తరణకు ఒక చట్టబద్ధ అస్త్రంగా ఉపయోగపడుతుంది.

స్వాతంత్ర్యం వచ్చి రాజ్యాంగం రాసుకొని ఏడు దశాబ్దాలు దాటుతున్నా, దళితులకు, ఆదివాసీలకు, మహిళలకు సమాజంలో సమానత్వ హక్కు అనేది చాలా దూరమైపోయింది. ఒక్కొక్క వర్గ ప్రజలు ఒక్కొక్క తీరుగా వేటాడబడుతున్నారు. చివరికి పసి పిల్లలు కూడా పితృస్వామ్య భావజాలానికి బలైన స్థితిలో రాజ్యాంగం ఉండి, దేశంలో ఏ పౌరుడికి రక్షణ లేని స్థితిలో, రాజ్యాంగ అమలులో ఉన్న లోపాలను వెతికి పరిష్కరించుకోవాల్సిన బాధ్యత మనందరిపై ఉంది. ప్రధానంగా మేధావి వర్గంపై ఉంది. అలాంటి బాధ్యత గల మేధావి వర్గాన్ని అర్బన్ నక్సల్స్ పేరుతో సుదీర్ఘకాలం జైలులో నిర్బంధించి, అందులోనే హత్యచేయాలనే నీచ సంస్కృతికి పాలక వర్గాలు దిగజారిపోయాయి.

ప్రజా ఉద్యమాలన్నీ సమానంగా ముందుకు రావాల్సిన అవసరం ఉంది. అప్పుడే ప్రజాస్వామ్యం దాని విలువలు ప్రజలందరికి అందుబాటులోకి వస్తాయి. స్వేచ్ఛ, సమానత్వం, ప్రజాస్వామ్యం అమలులోకి వచ్చి ప్రజలందరు సమానంగా జీవించే అవకాశం ఏర్పడుతుంది. మన రాజ్యాంగాన్ని ఢిల్లీ జంతర్ మంతర్ దగ్గర అధికార పార్టీ అనుబంధ సంఘ వ్యక్తులు దగ్ధం చేసినా కాని ప్రభుత్వాలు స్పందించలేదు. ఆదివాసీల, దళితుల దృష్టిలో రాజ్యాంగం అంతకంతకు విఫలమౌతూ వస్తుంది. ఆదివాసీ అటవీ ప్రాంతంలో అమలుకావాల్సిన పెసా చట్టం అమలు కాకుండా పెట్టుబడిదారుల భారీ పరిశ్రమలు లక్షలాది ఎకరాల అడవిని విధ్వంసం చేసి నిర్మిస్తున్నప్పటికి న్యాయస్థానాలు నోరు మెదపడం లేదు. పర్యావరణ అటవీశాఖ అనుమతులు లేకున్నా నిర్మాణాలు కొనసాగించ బడుతున్నాయి. ఆదివాసీల జీవనోపాధి హక్కును విధ్వంసం చేస్తున్నప్పటికి రాజ్యాంగం విఫలత గురించి ఆదివాసీలు మాట్లాడితే నిషేధ పార్టీ సభ్యులుగా మార్చి కాల్చి చంపేస్తున్నారు. ఆదివాసీలకు అడవిలో జీవనోపాధి కూడా కనుమరుగవుతున్నది.

రాజ్యాంగ అమలులోని లోపాలను సమీక్షించడం కోసం కేంద్ర స్థాయిలో మేధావుల కమిటీని ఏర్పాటు చేసి, లోపాలను సవరించుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. అటువైపుగా దృష్టి సారించకుండా ప్రభుత్వం మనుధర్మ శాస్త్రం వైపు అడుగులేస్తారేమోనని దేశ ప్రజలందరూ ముఖ్యంగా ప్రజాస్వామికవాదులందరూ ఒక రకంగా భయానికి గురౌతున్నారు. రాజ్యాంగాన్ని రక్షించుకోవడం, బలంగా అమలు చేసుకోవడం కూడా మనందరి బాధ్యతగా భావిస్తూ, మనం ముందుకు పయనించాల్సిన అవసరం ఉంది.

*(రచయిత ప్రధాన కార్యదర్శి, పౌరహక్కుల సంఘం, తెలంగాణ)* వీ

# కర్ణాటకలో హిందుత్వ బలపడిన తీరు

*కర్ణాటకలో అతివాద హిందుత్వ బలపడడం వెనుక 25 సంవత్సరాలుగా జరుగుతున్న కుటిల ప్రయత్నాలు ఉన్నాయని వివరిస్తున్నారు* **శివ సుందర్**

ఇటీవల కాలంలో కర్ణాటకలో పెరుగుతున్న హిందూ దూకుడు ఆశ్చర్యకరమైనది ఏమీ కాదు; ఇది గత 25 సంవత్సరాలుగా క్రమ క్రమంగా పెరుగుతూ వస్తోంది.

కర్ణాటకలో గతంలో కూడా బిజెపి ప్రభుత్వం అధికారంలో ఉన్నప్పుడు మైనారిటీ వర్గాలు దాడికి గురయ్యాయి. అయితే అప్పటికి ఇప్పటికి తేడా ఏమిటంటే ఇంతకు ముందు ఈ మత శక్తులన్నిటికీ అప్పటి ప్రభుత్వం ఇంత బహిరంగంగా మద్దతు తెలిపేది కాదు. కర్ణాటకలో ముస్లింల జీవితాలు, జీవనోపాధి, వాళ్ల సంస్కృతిపై హిందూత్వ సంస్థలు ఇటీవల చేస్తున్న దాడులు, చూపిస్తున్న దూకుడులో ఆశ్చర్యకరమైన, గమనించదగ్గ విషయం అందులో ఉన్న వేగం మాత్రమే. ఇప్పుడు కొత్తగా తీసుకువచ్చిన విషయాలు ఏమీ లేవు. 2008-13 మధ్య కాలంలో భారతీయ జనతా పార్టీ అధికారంలో ఉన్నప్పుడు కూడా పరివార్ శక్తులు మైనారిటీ వర్గాల మీద నిర్దాక్షిణ్యమైన దాడులు చేశాయి.

అపుడు కూడా అప్పటి ముఖ్యమంత్రులైన యడ్యూరప్ప, జగదీష్ షెట్టర్, సదానందగౌడ్ – వారి పదవీ కాలంలో ఈ అంశాలకు పరోక్షంగా మద్దతు ఇచ్చారు. అయితే ప్రభుత్వానికి ఇబ్బంది కలిగించే వారిని, ఆ అంశాలను దూరంగా ఉంచేవారు.

ఈసారి తేడా ఏమంటే ఇప్పుడు ఇలాంటి చర్యలన్నిటికి బిజెపి ప్రభుత్వం బహిరంగంగా, చాలా స్పష్టమైన మద్దతు ఇవ్వడం, అది కూడా అత్యున్నత స్థాయి నుండి. సమాజంలోని ఆధిపత్య కులాలు, తరగతులు, వారి అనుబంధ సంస్థలు ఈ చర్యలను నిశ్శబ్ద మద్దతునివ్వడం, అంతేకాక కొన్నిసార్లు క్రియాశీలకంగా మారడం తద్వారా ఈ చర్యల వెనుక ఉన్న రాజ్యాంగ విరుద్ధ ఎజెండాలకు చటబద్ధత కల్పించడం వీటిని ప్రధాన స్రవంతిలోకి తేవడం లాంటివి జోడింపబడుతున్నాయి.

హిజాబ్, హలాల్, అజాన్ వంటి వాటిని బహిష్కరించాలని చేసిన గొడవలతో వాళ్ల సంస్కృతిపై, వాళ్ల దుకాణాలపై దాడి చేసి, వాళ్లను ఆర్థికంగా బలహీనులను చేయడం, బహిరంగ ప్రదేశాల నుండి వాళ్లను తొలగించి వాటిని హిందూమయం చేయడం లాంటి చర్యలు కేవలం అనుబంధ సంస్థలు చేసేవి కావు.

ఇప్పుడు ఈ దాడులు కర్ణాటక సమాజంలో మారుతున్న ప్రజల రాజకీయ, సామాజిక మనోభావాలని చెప్పవచ్చు. ఒకప్పుడు కర్ణాటకలో మత సామరస్యంతో నిండిన సామాజిక జీవితం ఉండేదనడం నిజం. కాని అది ఇప్పుడు పూర్తిగా రూపాంతరం చెందుతోంది.

ఈ కింది విషయాలను దీనికి ఉదాహరణలుగా తీసుకోవచ్చు. కర్ణాటక అసెంబ్లీ స్పీకర్ విశ్వేశ్వర్ హెగ్డే కాజిరి ఆ కుర్చీలో ఉండి తను రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌కి చెందిన వాడయినందుకు తనకి చాలా గర్వంగా ఉందని బహిరంగంగా చెప్పడం. ఇంకా ముఖ్యమంత్రి బసవరాజ్ బొమ్మయ్ కేబినెట్‌లో మంత్రి, సీనియర్ బిజెపి నాయకుడు కె.ఎస్. ఈశ్వరప్ప ఒక బహిరంగ ప్రకటనలో ఏదో ఒకరోజు కాషాయ జెండానే జాతీయ జెండాగా చూసే రోజు వస్తుందని, తాను అదే దారిలో పనిచేస్తానని అనడం.

హిజబ్ వివాదమప్పుడు కూడా అధికార పక్షం నుండి చాలా మంది ఇండియా హిందూ దేశమని, క్లాస్‌రూమ్‌లలో హిజాబ్‌ని, హిందూమత గుర్తులని ఒకే విధంగా గుర్తించలేమన్నారు. శ్రీరామ్ సేన, ఇంకా అంత ప్రసిద్ధి చెందని చిన్ని చిన్ని హిందూ సంస్థలు వేరే వివాదాన్ని ఆశ్రయించాయి. అది హిందూ దేవాలయాల దగ్గర ముస్లింల దుకాణాలు ఉండరాదని, దేవాలయాల ఉత్సవాల నుండి ముస్లింలను నిషేధించడం. ఈ వివాదాన్ని బలపరచడానికి, చట్టబద్ధత కల్పించడానికి రాష్ట్ర న్యాయ శాఖ మంత్రి జె.సి. మధుస్వామి ఈ విషయంలో ఏమీ సంబంధం లేని కాంగ్రెస్ ప్రభుత్వ సమయంలో ఉన్న కొన్ని నిబంధనలను ఉదహరించారు.

ముఖ్యమంత్రి బొమ్మయ్ స్వయంగా భజరంగ్‌దళ్ దూకుడిని, హింసా ధోరణిని అది ముస్లింల విపరీత మత ధోరణికి ప్రతిస్పందన అని కొన్ని నెలల క్రితం వ్యాఖ్యానించారు.

ఇటీవల తీసుకొచ్చిన హలాల్ వివాదంతో హిందూ సంస్థలు జంతువులను చంపేటప్పుడు హలాల్ చేసే ముస్లిం మాంస విక్రయదారులను బహిష్కరించాలని పిలుపునిచ్చాయి. అరబిక్‌లో 'హలాల్' అంటే అనుమతించదగినదని, అలా చేయడం ఇస్లాం మత నిబంధనలకు అనుకూలంగా ఉండేదని సూచిస్తుంది.

ముస్లింలు తమ తమ వ్యాపారాన్ని చేసుకోవడానికి వాళ్లకున్న రాజ్యాంగబద్ధమైన హక్కులను పరిరక్షించడానికి బదులు ముఖ్యమంత్రి బొమ్మయ్ హిందూ సంస్థలు లేవనెత్తిన అభ్యంతరాలను పరిగణించి చర్యలు తీసుకుంటామని హామీ ఇచ్చారు.

**బిజెపి దీర్ఘకాలిక ప్రణాళిక:**

ఇటీవలి కాలంలో జరుగుతున్న ఈ సంస్థల దూకుడు, రాజ్యాంగ విరుద్ధమైన చర్యలు పూర్తిగా బిజెపి కనుసన్నలలో జరుగుతున్నాయని పై ఉదాహరణలు తెలియజేస్తున్నాయి. అందుచేత ప్రభుత్వ దిశలో మార్పునే మనం కర్ణాటకలో ఇటీవల జరుగుతున్న ఘటనలకు కారణం అనుకుంటే మనం ఈ మార్పుకు కారణం చాలా తక్కువగా అంచనా వేసినట్టవుతుంది. అంతే కాదు లోపల లోపల జరుగుతున్న అంతఃప్రవాహాన్ని అర్థం చేసుకోలేని వాళ్లమవుతాం.

బిజెపి కర్ణాటకలోను, మిగిలిన చోట్ల కూడా దాని సైద్ధాంతిక ప్రభావాన్ని ఆ సమయంలో, అక్కడ దానికున్న బలాన్ని బట్టి, అక్కడ పరిస్థితిని బట్టి

అనుకూలంగా వ్యూహాలను ఎంచుకొని పెంచుకుంటూ పోయింది. సైద్ధాంతికంగా ఎక్కడా రాజీ పడకపోయినా అక్కడ ఉన్న పరిస్థితులను బట్టి ప్రజలపై ప్రభావం చూపించే విధంగా చేసుకుంటూ పోయారు.

అందుచేతనే 1994లో యడ్యూరప్ప లేక ఈశ్వరప్ప అధికారంలో ఉన్నప్పుడు హిందూ బలవే వాళ్ల రాజకీయ భావజాలం అయినప్పటికి, అప్పుడు ఆ సంస్థలు సాపేక్షికంగా బలహీనంగా ఉన్నందుకు 2008 లేక ఇప్పటి అవతారాలతో పోల్చినప్పుడు వారు మధ్యేవాదులుగా కనిపిస్తారు. వాళ్లు ఒకసారి అధికారంలోకి వచ్చిన తరువాత విపరీతమైన బంధుప్రీతి, అవినీతితో అపఖ్యాతి పాలవడమే కాకుండా ఆర్ఎస్ఎస్‌తో కలిసి అవే రాజకీయ భావాలతో వ్యూహాలు, రూపకల్పనలు చేశారు.

సమాజాన్ని సమీకరించి, సంస్థలన్నిటిని కాషాయీకరించడం ద్వారా హిందూ రాష్ట్రాన్ని సాధించాలనేది బిజెపి దీర్ఘకాలిక లక్ష్యం. అందుకే ఇప్పుడు వాళ్ల హిందూ ఎజెండాలో దానికి అనుబంధంగా దూకుడు పెంచడం చాలా వ్యూహాత్మకమైనది. నిర్మాణాత్మకమైనది. గత 25 సంవత్సరాలుగా హిందూ సంస్థలు బహిరంగ ప్రదేశాలను ఒక క్రమపద్ధతిలో తమ భావజాల అధీనంలోకి తెచ్చుకుంటూ వారి ఎన్నికల పునాదిని వ్యూహాత్మకంగా కాషాయీకరణ చేసుకుంటూ పోతున్నాయి.

ఉదాహరణకు, ఉత్తర కర్ణాటకలోని ఆధిపత్య లింగాయత్ సమూహం కాంగ్రెస్ భూస్వామ్య వ్యతిరేక నినాదాలతో విసిగి నిస్పృహతో ఉన్నప్పుడు ఆ సమూహాన్ని బిజెపి ఆశ్రయంగా మార్చుకుంది.

సమతా వాదిగా ఉన్న లింగాయత్ సమూహం ఆ తరువాత 25 సంవత్సరాలలో పూర్తిగా కాషాయీకరించబడింది. మొట్ట మొదట లింగాయత్ మఠాలకు బడ్జెట్ కేటాయిస్తూ, విద్య మొదలగు రంగాలలో వాళ్లకున్న వ్యాపార రంగాలన్నిటికి పూర్తిగా మద్దతునిస్తూ వాళ్ల నమ్మకాన్ని పూర్తిగా సంపాదించారు. ఆ తరువాత ఆ సమూహాన్ని, వాళ్ల పెద్ద పెద్ద సహకార సంస్థలను, కార్పొరేట్ సంస్థలను విశ్వహిందూ పరిషత్‌లో భాగస్వాములుగా చేసుకున్నారు.

పూర్వం చాలా మంది లింగాయత్స్ వీరశైవులుగా గుర్తింపబడడానికి ఇష్టపడే వారు కాదు. ఎందుకంటే ఇది హిందూమతంలో ఒక ఉప విభాగంగా గుర్తింపబడేది. అందువలన కాంగ్రెస్ వీరికి ఒక ప్రత్యేక మత హోదా కల్పించాలని ప్రయత్నించడంతో 2018 ఎన్నికలలో ఉత్తర కర్ణాటక అంతా ఎక్కడయితే లింగాయత్స్ ఓట్లు భారీ సంఖ్యలో ఉంటాయో అక్కడ దారుణంగా ఓడిపోయింది. దీనికి కారణం వేరే ఏమీ కాదు. సంఘపరివార్ నిరంతరం చేసిన వ్యూహాత్మక, కార్యాచరణ ఫలితమే ఈ ఎన్నికలలో గెలుపు.

ఈ మధ్యనే అమిత్ షా తుమకూరు, సిద్ధగంగా మఠం స్వామీజీ 115వ జయంతి సందర్భంగా దర్శించినప్పుడు బిజెపి ప్రభుత్వం స్వామివారి బోధనలను పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టడానికి చేస్తున్న ప్రయత్నం గురించి తెలియజేశారు.

కర్ణాటకలో వేరే ఆధిపత్య సమూహం అయిన ఒక్క లిగలది కూడా ఇదే పరిస్థితి. వీరి గురువు స్వామీజీ విశ్వహిందూ పరిషత్‌కి చాలా కాలం ఉపాధ్యక్షుడుగా అక్కడి స్థానిక సనాతన సంస్థలలో అనేక రకాలుగా నాయకత్వం వహించాడు. జర్నలిస్టు గౌరీ లంకేష్‌ని హత్య చేసిన వారు ఇదే సంస్థకు చెందినవారనే ఆరోపణలు ఎదుర్కొంటున్నారు.

గత రాష్ట్ర ఎన్నికలలో విద్యావంతులైన అనేక మంది ప్రముఖులు 'కుమారస్వామి ఫర్ సిఎం మోడీ ఫర్ పిఎం' అనే నినాదాన్ని తయారు చేశారు. మాజీ ముఖ్యమంత్రి అయిన కుమారస్వామి ఒక్కలిగ సమూహానికి, జనతాదళ్ సెక్యులర్ పార్టీకి చెందినవాడు. అయినప్పటికి గత పార్లమెంట్ ఎన్నికలలో జెడి(ఎస్) కాంగ్రెస్ పొత్తు కలిగి ఉన్నప్పటికి చాలా మంది ఒక్కలిగలు బిజెపికి ఓటు వేసినట్లు అనేక అధ్యయనాలు తెలియజెప్పాయి.

అలాగే మాదిగలను తమ వైపుకు తిప్పుకునేందుకు బిజెపి ప్రయత్నిస్తుంది. షెడ్యూల్ కులాల (ఎస్‌సి) రిజర్వేషన్ల అంతర్గత పునర్విభజన కోసం మాదిగ సంఘం చాలా కాలంగా డిమాండ్ చేస్తోంది. ఈ డిమాండ్ ప్రజాస్వామికమైనప్పటికీ గత ప్రభుత్వాలేవీ ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. ఇదే విషయాన్ని పరివార్ పూర్తిగా ఉపయోగించుకొని దళితుల ఐక్యత విచ్ఛిన్నం చేయడంలో, వారి అసంతృప్తిని పెంచడానికి పూర్తిగా ఫలితం సాధించింది.

అయితే విషయం ఏమిటంటే ఎస్‌సి రిజర్వేషన్‌ల అంతర్గత పునర్విభజన పార్లమెంట్‌లో సవరణ ద్వారా మాత్రమే జరుగుతుంది. ఇడబ్ల్యుఎస్ రిజర్వేషన్ చట్టాన్ని బిజెపి రూపొందించి 20 రోజుల వ్యవధిలో పార్లమెంట్‌లో ఆమోదింప జేసింది. కానీ ఇంకా ఎస్‌సి పునర్విభజన బిల్లును తీసుకురాలేదు.

అయినప్పటికి మత మార్పిడిలకు దూరంగా ఉంచే విధానాలతో దళితుల ఐక్యత విచ్ఛిన్నం చేయడంలోను, లంబానీలు వంటి అస్పృశ్యేతర షెడ్యూల్డ్ కులాల మద్దతును కొనసాగించడంలోను హిందూ ఎజెండాకు పూర్తి మద్దతు పొందడంలో విజయం సాధించారు.

బిజెపి రెండు దశాబ్దాలుగా సోషల్ ఇంజనీరింగ్, రాజకీయంగా, సైద్ధాంతికంగా వాళ్లకు మద్దతు ఇచ్చే వాళ్లను స్థిరత్వం చేసుకోవడానికి చేసిన ప్రయత్నాలు ఈ రోజు ఫలితం సాధిస్తున్నాయి.

నిజానికి 2019 ఎన్నికలలో బిజెపి కర్ణాటకలో 51 శాతం ఓట్లతో 28 సీట్లకు గాను 25 సీట్లు గెలుచుకుంది. అందుకే తీవ్ర హిందూత్వ ప్రచారకుడైన సూర్యతేజ లాంటి ఎటువంటి రాజకీయ అనుభవం లేని వ్యక్తి ఈ రోజు భారత ముస్లిం సమస్యకు 'చివరి పరిష్కారం' కనుగొనమని పిలుపునిచ్చాడు. అంతేకాదు ఇంటా బయటా, పగలు రాత్రి తేడా లేకుండా ముస్లింల మీద విషాన్ని చిమ్మే అనంతకుమార్ హెగ్డేని కూడా ఊహించని మెజారిటీతో కర్ణాటక ప్రజలు గెలిపించారు. ఇది పూర్తిగా మోడీకి రెండో సారి పూర్తి హిందూ దూకుడు విధానంతో, విపరీత హిందూ ఎజెండాలతో ముందుకు పోవడానికి అనుకూలతనిచ్చింది. అంతేకాదు ఇప్పటివరకు వాళ్లలో దాచిపెట్టిన, అణచి పెట్టిన హిందూత్వాన్ని పూర్తిగా బట్టబయలు చేసుకోవడానికి పూర్తి స్థాయి ధైర్యాన్ని కూడా ఇచ్చింది.

అదే కాకుండా, ఇక ఎన్నికలలో గెలవడానికి ఈ హిందూ ఎజెండా, మోడీ కార్డ్ చాలనే నమ్మకాన్ని పరివార్ వ్యూహకర్తలకు ఇచ్చేసింది. ఇప్పటివరకు అనుసరిస్తున్న కొద్ది ఉదారవాద హిందూ ఎజెండాలు,

# కన్నీళ్లతో రాజకీయం 'కశ్మీర్ ఫైల్స్'

*వివాదాస్పద రాజకీయ, మత విద్వేష చిత్రం 'కశ్మీర్ ఫైల్స్' ఏ ప్రయోజనాల కోసం ఎవరిచేత నిర్మాణమయిందో వివరిస్తున్నారు* **చుంచు శ్రీశైలం**

ప్రజా వ్యతిరేక విధానాలను ఎదిరిస్తూ ఈ దేశంలో దశాబ్దాలుగా సాగుతున్న ధిక్కార ధోరణులకు వీటికి భిన్నంగా 90 వ దశకంలో బలంగా వేళ్లూనుకున్న మత వాదం ఇటీవల జడలు విప్పుతుంది. నిజానికి దీనిని ఉన్మాదం తప్ప వాదం అనడానికి వీలు లేదు. ఆచార వ్యవహారాల్లో వైవిధ్యం నుంచి పుట్టిన మతాల మధ్య వైషమ్యాలను పెంచడానికి, ఆ విషాన్ని ప్రజల ఆలోచనల్లోకి ఎక్కించడానికి ఉద్ధరణ పేరుతో జరుపుతున్న ఉన్మాదం. మతానికి ఎక్కువ పాళ్లలో ఉన్మాదాన్ని జోడించి, రక్త దాహంతో తిరగాడుతున్న మతోన్మాదం అది. ఏ మతాలు, వాటి గ్రంథాలు బోధించని రాజకీయోన్మాదం. మతోద్ధారకులుగా తమను తాము ప్రకటించుకుంటూ, దోపిడీదారులకు కొత్త దారులను వెతికి చూపుతున్న అన్వేషణ అది. తమను తామే దేశభక్తులుగా చిత్రీకరించుకుంటూ దేశ ప్రజల శ్రమను, సంపదను కారుచౌకగా విదేశీ కంపెనీలకు కట్టబెట్టే దేశద్రోహమది. ఇది పాలకులకు, వారి దోపిడీ విధానాలకు అడ్డుకట్ట వేయడానికి ప్రజలు ఎంచుకునే నిరసన లేదా పోరాట మార్గాల నుంచి దారి మళ్లించడానికి ఏలికలు ఎంచుకున్న దుర్నీతి.

కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీ తమ దోపిడీని, దేశద్రోహాన్ని, రాజకీయోన్మాదాన్ని ప్రజలు గుర్తించకుండా జాగ్రత్త పడుతుంది. గుర్తించినా తిరగబడకుండా ప్రజలకు అసలు శత్రువు ఐన తన స్థానంలో ఇంకో వర్గానికి చెందిన ప్రజలనే శత్రువులుగా చూపేందుకు ఎన్నో రకాల కుట్రలకు పాల్పడుతుంది. ఈ దుష్ట పన్నాగం సాంస్కృతిక, కళారంగం వైపు మళ్లింది. చరిత్రలో చేదు జ్ఞాపకాలుగా మిగిలిన, ప్రజలు మరిచిపోదగిన సంఘటనలను తట్టి లేపుతూ వక్రీకరణలను ప్రోత్సహిస్తుంది. చరిత్ర మాటున దాగి, మానిపోతున్న గాయాలను తిరిగి రేపుతుంది. గాయాలను మళ్లీ కెలికి రక్తమోడే సమాజాన్ని సృష్టించడానికి కళా రంగం వేదికగా మారుతుంది. ప్రజల్లో రాజకీయ, సామాజిక చైతన్యాన్ని నింపడానికి కళలు సాధనాలుగా వాడడం ఈ దేశంలోనే కాదు ప్రపంచవ్యాప్తంగా కొత్తేమీ కాదు. కానీ, వాస్తవ సంఘటనలకు భిన్నంగా, ఏకపక్షంగా, వక్రీకరణలకు పాల్పడుతూ, చరిత్రను మార్చే కుట్రలకు కళ ను వాడడం , దానికి ఈ దేశ అత్యున్నత స్థాయి నాయకులు సమర్ధకులుగా, ప్రచారకులుగా మారడం మాత్రం కొత్త.

1990లో కశ్మీర్ లోయలో అక్కడి ప్రజలపై ఉగ్రవాదులు, వేర్పాటువాదులు జరిపిన దాడిని కేవలం ఒక మతానికే చెందిన వారిపై దాడిగా, ఆ దాడిని చేసింది మరొక మతం వారుగా, దేశంలో ఏ ప్రాంతంలో ఆ మతం వారు ఉన్నా ఈ దాడికి బాధ్యత వహించాలనే అంతగా ద్వేషాన్ని తెరకెక్కించిన (వి)చిత్రం కశ్మీర్ ఫైల్స్. నిజానికి సినిమా పేరుతో వచ్చిన ఈ వక్రీకరణ లేదా అర్ధ సత్యం మొత్తం కశ్మీర్ ప్రజల రక్తంతో సాగిన వ్యాపారం. రక్త వ్యాపారం. మానడానికి సిద్ధంగా ఉన్న గాయాల మీదనే మళ్లీ చేసిన తాజా గాయం. గతంలో హేట్ స్టోరీ, ద తాష్కెంట్ ఫైల్స్ వంటి సినిమాలు రూపొందించిన దర్శకుడు వివేక్ అగ్నిహోత్రి భారతీయ జనతా పార్టీ పెద్దల సహకారంతో, ఆ పార్టీ మద్దతుదారులే నటీనటులుగా, మతాల మధ్య నాటిన విద్వేష బీజాలను పెంచడానికి కశ్మీర్ ఫైల్స్‌ను తెరకెక్కించినట్లు అర్ధమవుతుంది. రాబోయే రోజుల్లో మరిన్ని ఫైల్స్ ను నిర్మిస్తామని ప్రకటించడం ఈ వాదనకు బలం చేకూర్చే అంశం.

1990 ప్రారంభంలో నెత్తురోడిన లోయ నుంచి కశ్మీర్ పండిట్‌లు ఆ ప్రాంతాన్ని వదిలి దేశంలోని ఇతర ప్రాంతాలకు వలస వెళ్లడం ఒక చారిత్రక విషాదం. ఐతే ఆనాడు దౌర్జన్యాలు, దాష్టీకాలు, అఘాయిత్యాలు, మారణకాండ కులమతాలతో సంబంధం లేకుండా అక్కడ నివసిస్తున్న ప్రజలందరిపై జరిగింది. ఉగ్రవాదానికి కులం, మతం ఉండదని ఎన్నో సార్లు నిరూపితం ఐనట్లుగానే ఆ దారుణ విషాదంలోనూ జరిగింది. కశ్మీరీ పండిట్లను కాపాడడానికి అక్కడి ముస్లిం కుటుంబాలు చూపిన తెగువను, ఆశ్రయం కల్పించిన సోదర

---

దొంగ ప్రజాస్వామిక కార్యాచరణల అవసరం ఏమీ లేదనీ, ఇంకా ఆధిపత్య కులాల, సమూహ నాయకులపై ఆధారపడవలసిన అవసరం ఏమీ లేదనీ గట్టి నమ్మకం ఏర్పడింది. అందుకే రామ్ మనోహర్ లోహియా జనతా పార్టీ నేపథ్యంతో వచ్చిన బొమ్మయ్ కాని, అస్సాంలో కాంగ్రెస్ నుండి వచ్చిన హిమంతా బిశ్వాస్ శర్మ కాని ఇప్పుడు వాళ్ల వ్యక్తిగత పలుకుబడి ఏమీ లేదు. వాళ్లు ఇప్పుడు అధికారంలో నిలబడాలంటే పూర్తిగా ఈ అతివాద హిందూ ఎజెండాలను అనుసరించాల్సిందే. డా. అంబేద్కర్ హెచ్చరించినట్టే ఈ రోజు పరివార్ హిందూ సమాజ యుద్ధోన్మాదులకు అతివాద హిందూ వాదుల ఓటు బ్యాంక్‌ని, దాదాపు శాశ్వతమైన సమూహ మెజారిటీని కూడగట్టుకుంటూ వచ్చింది. ఈ హిందూ సమాజం మరల మరల హిందూ రాష్ట్రాన్ని నిర్మిస్తామనే వాగ్దానానికి వీళ్లనే ఎన్నుకుంటూ ఉంటుంది.

ఈ దూకుడుని విచ్ఛిన్నం చేసి ప్రజలకు వేరే ప్రత్యామ్నాయ సామాజిక, రాజకీయ ఎజెండా వచ్చే వరకు ఈ హింసాత్మక మతతత్వం ఇలానే కొనసాగుతుందంటే ఎలాంటి ఆశ్చర్యం లేదు.

*(తెలుగు: రాణి నిడదవోలు)* వీ

భావాన్ని నేటికీ గుర్తుంచుకున్న పండిట్లు ఉన్నారు. సినిమా ద్వారా ఆ మత సామరస్యాన్ని చూపితే ఈ దేశ ఔన్నత్యాన్ని చాటిచెప్పినట్లు అయ్యేది. అలాగే మేము భారతీయులం అంటూ గొంతెత్తడం వల్ల అదే వేర్పాటువాద తీవ్రవాదానికి బలైన ముస్లింలను, వారి స్థితిగతులను కూడా నిష్పక్షపాతంగా చూపించాల్సింది. అప్పుడు దేశభక్తికి మతంతో ముడిపెట్టలేమని ప్రస్ఫుటమయ్యేది. ఆ దురదృష్టకర సంఘటనలో నాడు మొత్తం 1724 మంది చనిపోగా, 89 మంది పండిట్లు, 1635 మంది ఇతర మతాల వారు ఉన్నారని సమాచార హక్కు చట్టం ప్రకారం శ్రీనగర్ పోలీసు కార్యాలయం ధృవీకరించిన అధికారిక సమాచారం. అంటే ఆనాటి మారణకాండ లో పండిట్లతో పాటు, ముస్లింలు, సిక్కులు బలయ్యారని స్పష్టంగా తెలుస్తుంది. కన్నీళ్లకు, రక్త దాహానికి కులం, మతం, వర్గం ఉండదని రుజువు చేసిన ఒకానొక దారుణం ఇది. ఇందులో జరిగిన మరణాలే విషాదమంటే, ఆ మరణాలను కూడా మతాల వారీగా విభజించాల్సి రావడం అత్యంత విషాదం. ఈ వాస్తవాల ఉద్దేశ్యపూర్వక విస్మరణ వెనుక మత వైషమ్యాలకు ఆజ్యం పోయాలనే లక్ష్యం ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది.

సినిమా దర్శకుడు ఎంచుకున్న అర్ధసత్యం, అసత్యం, వక్రీకరణల వెనుక పాలక పెద్దల హస్తం, వారిచ్చిన ధైర్యం ఉన్నట్లు అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. దేశ ప్రధాని మోడీ, హోం మంత్రి అమిత్ షా లను ఈ సినిమా దర్శకుడు కలిసిన తర్వాత సినిమా పట్ల వారు చేసిన వ్యాఖ్యలు, సమర్థనలు ఈ అనుమానాలకు బలం చేకూర్చాయి. ఇది చాలా మంచి చిత్రమని, అందరూ తప్పక చూడాలని, ఇలాంటి చిత్రాలు మరిన్ని రావాలని మోడీ ఆకాంక్షిస్తే, సినిమా సత్యానికి అద్దం పడుతుందని, చారిత్రక తప్పిదాలు పునరావృతం కాకుండా సమాజం జాగృతం కావడానికి ఈ సినిమా దోహదపడుతుందని అమిత్ షా ప్రకటించాడు. కానీ, ఆనాటి పరిస్థితులకు ఎదురొడ్డి నిలిచి, సజీవ సాక్ష్యంగా ఉన్న అక్కడి ప్రజలు ఈ సినిమానే ఒక చారిత్రక తప్పిదంగా, వక్రీకరణగా, అవాస్తవంగా తమ రచనల్లో, ప్రసంగాల్లో పేర్కొంటున్నారు. ఇలాంటి పక్షపాత, విద్వేష ప్రేరేపిత సినిమాలు మళ్ళీ రాకుండా సమాజం జాగృతం అయ్యేందుకు ఈ సినిమా దోహదపడాలని వారు హెచ్చరిస్తున్నారు.

ఐతే కశ్మీర్ లోయను వదిలి వెళ్లిన పండిట్ల కుటుంబాలను నేటికీ తమ స్వస్థలాలకు చేర్చకపోవడం, కనీసం పూర్తి స్థాయి పునరావాసం కల్పించకపోవడం అత్యంత బాధాకరం. ఇది గత పాలకుల నిర్లక్ష్యానికి నిదర్శనమైతే, ప్రస్తుత పాలకుల కపట ప్రేమకు, ద్వంద్వ వైఖరికి అద్దం పడుతుంది. కశ్మీర్ పండిట్ల పట్ల అమిత ప్రేమను మాటల్లో చూపుతున్న పాలకులు తమ ఎనిమిదేళ్ల పాలనలో ఆచరణలో అణువంతైనా చూపని వాస్తవం కళ్లముందుంది. దేశవ్యాప్తంగా వందలాది థియేటర్లలో విడుదలైన కశ్మీర్ ఫైల్స్ సినిమా ప్రజల కన్నీళ్లు, విషాదం, కడుపు మంటలే ముడి సరుకుగా వ్యాపారం చేసింది. ఇందులో వేల కోట్లు సంపాదించిన దర్శకుడు ఆ ప్రజల పునరావాసం కొరకు కొంతైనా సాయపడమంటే అది తన లేదా తన సినిమా ఎజెండా కాదని నర్మగర్భంగా వ్యాఖ్యానించాడు. అంటే, తన సినిమా ద్వారా దేశంలోని మొత్తం ఇస్లాం మతాన్ని, ముస్లింలను తీవ్రవాదులుగా చూపాలన్న ఎజెండా మాత్రమే తనకు అప్పగించారని అది మాత్రమే నిర్వర్తించానని పరోక్షంగా అంగీకరించినట్లైంది. ఒక మతం మాత్రమే కాకుండా అన్ని మతాలను సమంగా చూసే, లేదా అసలు మతాలనే పట్టించుకోని మానవ వాదాన్ని, మతోన్మాదాన్ని ఎదిరించే లౌకికవాదాన్ని కూడా ప్రమాదకారిగా చూపే ప్రయత్నం జరిగింది. ఈ సినిమా చూడని వాళ్లు, లేదా చూసి వాస్తవాలను విశ్లేషణలు చేసే వాళ్లను కూడా దేశద్రోహులుగా కాషాయ సోషల్ మీ(మో)డియా ముద్ర వేస్తోంది. రాష్ట్రాల్లో ఈ సినిమాకు, అది చేస్తున్న కోట్ల రూపాయల వ్యాపారానికి వినోద పన్ను రాయితీ ఇవ్వాలని డిమాండ్లు తలెత్తాయి. ప్రజలందరూ చూడాలనుకుంటే సినిమాను యూట్యూబ్‌లో అప్‌లోడ్ చేయండి, వచ్చిన డబ్బుతో పండిట్లకు పునరావాసం కల్పించండి అన్న ఢిల్లీ ముఖ్యమంత్రి అరవింద్ కేజ్రీవాల్ ఇంటిపై కాషాయ మూకలు దాడులకు దిగడాన్ని మించిన తీవ్రమైన ఉన్మాదం ఇంకేముంటుంది?

దేశంలో పాలకులు, సంఘ్ పరివార్ సభ్యులు కొంత కాలంగా ముస్లింల పట్ల చేస్తున్న విద్వేష వ్యాఖ్యలకు కొనసాగింపుగానే ఈ సినిమాను తీసుకొచ్చినట్లు అర్థమవుతుంది. ముస్లింలను చంపేయాలని, హిందూ స్త్రీలను కన్నెత్తి చూస్తే, ముస్లిం స్త్రీలను బహిరంగంగా రేప్ చేస్తానని, కరోనా జిహాదీలని చేస్తున్న విపరీత వ్యాఖ్యలకు ఆచరణలో బలం చేకూర్చేందుకు దోహదపడడమే ఈ సినిమా ఎజెండాగా కన్పిస్తుంది. ఈ క్రమంలో పద్ధతి ప్రకారం ముస్లింలను లక్ష్యంగా చేసుకోవాలనే ప్రణాళికకు కొనసాగింపుగానే ఈ సినిమాను భావించాలి.

జమ్మూ కశ్మీర్ రాష్ట్రానికి, అక్కడి సంస్కృతికి, సౌందర్యానికి ప్రత్యేక రక్షణలు కల్పించే ఆర్టికల్ 370ని రద్దు చేసి, రాష్ట్రాన్ని ముక్కలుగా విడగొట్టినారు. అక్కడి భూములను కార్పొరేట్లకు కట్టబెట్టడానికి, పర్యాటక రంగాన్ని అంబానీ, ఆదానీలకు కట్టబెట్టి ప్రకృతి రమణీయతతో వ్యాపారం చేయాలనే లక్ష్యాలతో పాలకులు ఈ పని చేసినట్టు అర్థమవుతుంది. ఈ పని మరింత సులువు కావాలంటే అక్కడి కశ్మీరీ ముస్లింల నుంచి ప్రతిఘటన ఎదురవ్వకుండా చూసుకోవాలి. అది జరగాలంటే ముస్లింలంతా భయభ్రాంతులకు గురి కావాలి. దానికి కొంతమేరకైనా ఉపయోగపడాలన్న కుట్రే కశ్మీర్ ఫైల్స్. ప్రభుత్వ దోపిడీ విధానాల నుంచి ప్రజల ఆలోచనలను మళ్లించాలనే రాచరిక నీతిలో భాగం కూడా. ప్రభుత్వ రంగ సంస్థలన్నింటిని మూకుమ్మడిగా కార్పొరేట్లకు అప్పగిస్తూ, నగదీకరణ పేరుతో ప్రజల ఆస్తులను, దేశ సంపదను, వనరులను ప్రైవేట్ వ్యక్తులకు కారుచౌకగా అమ్మేస్తున్నప్పటికీ, నిత్యావసర సరుకుల ధరలు విపరీతంగా పెరుగుతూ ఉన్నా ప్రజలు ప్రశ్నించకుండా ఉండాలంటే వారినెప్పుడూ మత్తులోనే ఉంచాలని పాలకులు గ్రహించారు. ఆ మత్తు మందులే మతం, దేశభక్తి. వీటిని తన దోపిడీని, దోచిపెట్టడాన్ని నిరాటంకంగా కొనసాగించడానికి, అధికారాన్ని అంటిపెట్టుకోవడానికి ఆయుధాలుగా వాడుకుంటున్నారు. ఈ కుట్రలను బహిర్గతం చేయనంత కాలం, దోపిడీని ఎదిరించడమే అసలు సిసలు దేశభక్తి అని గ్రహించనంత కాలం ఇలాంటి కుట్రపూరిత ఫేక్ ఫైల్స్ ప్రజల మెదళ్ల పైన, చరిత్ర, సంస్కృతి పైన దాడి చేస్తూనే ఉంటాయి. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# ప్రజల మధ్య విద్వేషాన్ని పెంచే 'కశ్మీర్ ఫైల్స్'

*'కశ్మీర్ ఫైల్స్' సినిమా నేపథ్యంలో అసలు పండిట్ల వలస సమస్య వివరాలను రెండు సుప్రసిద్ధ పుస్తకాల సాయంతో వివరిస్తున్నారు* **పి.వి. రమణ**

ఆంధ్రజ్యోతిలో మార్చి 30న కశ్మీరీ 'చందమామపై నెత్తుటి మరకలు' అన్న కృష్ణారావు గారి వ్యాసం రాహుల్ పండిట్ పుస్తకాన్ని పరిచయం చేసింది. స్వయంగా కశ్మీరీ పండిట్ అయిన రాహుల్ పండిట్ ఉద్వేగాన్ని, ఆగ్రహాన్ని అర్థం చేసుకోవచ్చు. "తోటి ముస్లిం స్నేహితులే తమకు వ్యతిరేకం కావడం, పాకిస్తాన్ అనుకూల నినాదాలు చేయడం, ఒకప్పుడు ఇరు మతాల పండుగలను, వివాహాలను తాము కలసి జరుపుకున్న శుభదినాలు సమసిపోవడం, ఒకరినొకరు ద్వేషించే రోజులు రావడం లాంటి" విషయాలను కూడా అర్థం చేసుకోగలం. కాని మొత్తం మెజారిటీ మతస్తులు కశ్మీరీ పండితులపై ఎందుకు దాడి చేశారో, సాధారణ ప్రజలు కూడా తమ పట్ల క్రూరంగా ఎందుకు వ్యవహరించారో తేలాలని ఆయన అన్న విషయాలపై, అది నిజం కాదు అని కనీసం సూచన ప్రాయంగా కృష్ణారావు గారు తన అభిప్రాయంగా వివరించి ఉంటే బావుండేది.

అది సత్యం కాదు అనడానికి రుజువుగా మార్చి 31న ఒక ఇంగ్లిష్ దినపత్రికలో అనంతనాగ్ జిల్లా మట్టాన్ గ్రామంలో 2016 నుండి రెండంతస్తుల భవనాన్ని నిర్మిస్తున్న పండిట్ కాకాజీ విషయం ప్రకటించింది. ఇల్లు తయారైన వెంటనే తాను, తన సోదరుని కుటుంబాలు కొత్త ఇంటి లోనికి వచ్చేస్తామని చెప్పారు. మరి తీవ్రవాదుల బెడద వుంది కదా అంటే అలాంటిదేమీ లేదు ఇక్కడి ముస్లింలందరూ మాకు ఎంతో సహకరిస్తున్నారని, 1990లలో ఇక్కడి నుండి 80 పండిట్ల కుటుంబాలు వలస వెళ్లిపోతే అప్పటి నుండి మా ఇళ్లను, ఆస్తులను వారే కాపాడారని చెప్పారు. నిజానికి 1990ల్లో విధ్వంసం జరిగినప్పుడు కూడా పండిట్లను కాపాడటం కోసం అనేక మంది ముస్లింలు తమ ప్రాణాలను బలి ఇచ్చిన సంగతి చాలా మంది రాశారు. తీవ్రవాదుల తుపాకులకు భయపడి విధ్వంసంలో పాలుపంచుకున్నవారిలో అధికశాతం పండిట్ల వలసలను వ్యతిరేకించారని చాలా మంది పేర్కొన్నారు.

"బిజెపికి గట్టి మద్దతుదారునిగా ఉన్న వ్యక్తి తీసిన సినిమా కశ్మీరీ ఫైల్స్. ఉగ్రవాదిగా ముస్లిం అనేది దాని ఇతివృత్తం. ఉగ్రవాద దౌష్ట్యాల బాధితులకు న్యాయం సమకూర్చేందుకు కూడా సంక్లిష్ట కశ్మీర్ సమస్య పరిష్కారానికి దోహదం చేయడానికి బదులుగా ప్రమాదకర అర్ధ సత్యాలను మాత్రమే ఈ సినిమా ప్రచారం చేసింది" అనే రాజదీప్ సర్దేశాయ్ వ్యాఖ్య నిజాన్ని కుండబద్దలు కొట్టి చెప్పినట్టుగా ఉంది. కశ్మీరీ పండిట్లు ఎలా నష్టపోయారో అలాగే కశ్మీరీ ముస్లింలు అంతకన్నా ఎక్కువే నష్టపోయారనే అంశాన్ని, అలాగే ఇతరులు ఆడుతున్న చదరంగంలో ఇరువురు పావులేననే అంశాన్ని ఎంతో అద్భుతంగా 191లో విడుదలైన ఒనిర్ దర్శకత్వం వహించిన 'ఐ యామ్' సినిమాల్లో చూస్తాం. ఏ కళారూపమైనా మనుషులను దగ్గర చేయాలి గాని, విద్వేషంతో దూరం చేయకూడదనే విలువను ఆ సినిమా ప్రతిబింబించింది.

డాక్టర్ సయ్యద్ మొహినుద్దీన్ ఇచ్చిన సమాచారం మేరకు కశ్మీరీ పండిట్ల సంఘర్షణ సమితి 650 మంది పండిట్లు చనిపోయినట్లు చెబుతోంది. 1991లో ఆర్ఎస్ఎస్ రాసిన 'జెనొసైడ్ ఆఫ్ హిందూస్ ఇన్ కశ్మీర్' పుస్తకంలో ఈ సంఖ్య 600గా ఉంది. కేంద్ర హోమ్ మంత్రిత్వ శాఖ లెక్కల్లో 219గా ఉంది. సమాచార హక్కు చట్టం కింద హర్యానాకు చెందిన పి.పి. కపూర్ వివరణ కోరగా శ్రీనగర్ పోలీసులు 89 మంది మాత్రమేనని జవాబిచ్చారు. ఆ తరువాత చనిపోయిన పౌరుల సంఖ్య 1635. అయితే వీరిలో ముస్లింలతో పాటు సిక్కులు అధికంగా ఉన్నారు. తమకు సహకరించలేదనే కారణంతో మిలిటెంట్లు 15 వేల మందికి పైగా ముస్లింలను చంపేశారని అనధికారిక లెక్కలు చెబుతున్నాయి. నిజాలు ఇలా ఉంటే, కశ్మీరీ ఫైల్స్ దర్శకుడు వివేక్ అగ్నిహోత్రి మిలిటెన్సీ చర్యల వల్ల 1990లో 4 వేల మంది పండిట్లు చనిపోయారని చెప్పటం విద్వేషాన్ని ఏ స్థాయిలో కొనసాగిస్తున్నారో అర్థమవుతోంది.

కశ్మీర్ ఫైల్స్ సినిమా వచ్చిన తర్వాత దాని మీద చిన్నపాటి విమర్శ చేసినా ప్రభుత్వాలు, పరివార్ శక్తులు దాడి చేస్తున్నాయి. ఉదాహరణకు మధ్యప్రదేశ్ ప్రభుత్వంలో ఐఏఎస్ అధికారి నియాజ్ ఖాన్ "కశ్మీరీ ఫైల్స్ సినిమా కశ్మీరీ పండిట్ల బాధను వ్యక్తీకరించిందని, వారికి గౌరవంగా రక్షణ కల్పించి లోయలో నివసించే ఏర్పాట్లు చేయాలని, అదే విధంగా నిర్మాతలు దేశంలో అనేక రాష్ట్రాల్లో జరుగుతున్న ముస్లింలపై దమనకాండ గురించి కూడా సినిమా తీయాలని" ట్వీట్ చేసినందుకు అతనిపై చర్య తీసుకోవడానికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. అలాగే రాజస్థాన్ జైపూర్‌లో దళిత బ్యాంక్ మేనేజర్ రాజేష్ దేశంలో పండిట్స్ పైనే కాదు దళిత, ఇతర కులాల వారిపై దాడులు జరుగుతున్నాయని, కశ్మీర్ ఫైల్స్‌కు రాయితీలిచ్చిన పెద్దలు జై భీమ్ లాంటి సినిమాలకు ఎందుకు ఇవ్వటం లేదని ఫేస్‌బుక్‌లో పెట్టినందుకు అక్కడి అగ్ర కులస్తులు రాజేష్‌ను దేవాలయంలో ముక్కును నేలమీద రాయించారు. కశ్మీర్ ఫైల్స్ బూటకపు సినిమా అని విమర్శించిన నేరానికి ఢిల్లీ ముఖ్యమంత్రి కేజ్రీవాల్ ఇంటిపై డిజెవైఎం అధ్యక్షుడు, ఎంపీ అయిన తేజేస్వీ సూర్య నాయకత్వంలో పెద్ద సంఖ్యలో పరివార్ శక్తులు దాడి చేసి విధ్వంసం సృష్టించారు. ఇలాంటి సంఘటనలు అనేకం జరుగుతున్నాయి.

కశ్మీరీ పండిట్లపై పెరిగిన దాడుల గురించి, కారకుల గురించి తెలుసుకోవాలంటే కొంత చరిత్ర తెలుసుకోవాలి. 1990లలో జరిగిన విధ్వంసం గురించి, అన్యాయంగా అబద్ధపు అభియోగాలతో కృంగిపోతున్న కశ్మీరీ ప్రజలు ఎంత గొప్ప సంప్రదాయం నుండి కొనసాగుతున్నారో తెలుసుకోవాలంటే కనీసం 5, 6 సార్లు కశ్మీర్ పర్యటించిన హక్కుల నాయకుడు బాలగోపాల్ రచన 'కల్లోల లోయ-50 ఏళ్ల కశ్మీర్',

సిపిఐ(ఎంఎల్) న్యూ డెమోక్రసీ ప్రచురించిన పి. ప్రసాద్ రచన 'నెత్తుటి ధారల్లో కశ్మీర్ – నిప్పులాంటి నిజాలు' తప్పక చదవాలి. కశ్మీర్ సమస్యను అర్థం చేసుకోవడానికి ఈ రెండు పుస్తకాల్లో అవసరమైన మేరకు కొంత సమాచారం ఈ దిగువ ఇవ్వడం జరిగింది.

బాలగోపాల్ పుస్తకానికి ముందు మాటలో ఈ విధంగా వివరించారు. "1995 నుండి 2003 దాకా జమ్మూ కశ్మీర్ రాష్ట్రంలో పర్యటించిన 5 నిజ నిర్ధారణ కమిటీలు తమ నివేదికలను ఇంగ్లిష్‌లో ప్రచురించారు. దాన్ని సంక్షిప్తంగా అనువదించి, క్రమానుగత కథనాన్ని అందించే ప్రయత్నమే ఈ పుస్తకం (కల్లోల లోయ–50 ఏళ్ల కశ్మీర్). చారిత్రక నేపథ్యానికి సంబంధించిన సమాచారం పూర్తిగా నిజ నిర్ధారణ కమిటీలు సేకరించినవి కావు. వివిధ చరిత్ర గ్రంథాలపైన, కశ్మీరీ బుద్ధిజీవులతో జరిపిన సంభాషణల మీద ఆధారపడి రూపొందించటం జరిగింది. 1989లో మిలిటెన్సీ మొదలైన తరువాత నడిచిన వర్తమాన చరిత్రకు సంబంధించిన సమాచారం చాలా వరకు బాధితులతోను, భాగస్వాములతోను మాట్లాడి సేకరించటం జరిగింది".

"1989లో మిలిటెంట్ చర్యలు మొదలయ్యాయి. ఆగస్టు 21న నేషనల్ కాన్ఫరెన్స్ నాయకుడు మహమ్మద్ యూసుఫ్ హల్వాయిని చంపారు. సెప్టెంబర్ 14 నాడు భారతీయ జనతా పార్టీ ఉపాధ్యక్షుడు టికాలాల్ టిప్లును కాల్చి చంపారు. నవంబర్ 4న మక్బూల్ భట్‌కు మరణశిక్ష విధించిన సెషన్స్ జడ్జి నీల్ కంట్ గంజూను కాల్చి చంపారు. డిసెంబర్ 8న ముక్తి మొహమ్మద్ సయీద్ కూతురు డా. రుబియాను అపహరించి జైలులో ఉన్న 5 గురు జెకెఎల్ఎఫ్ మిలిటెంట్లను విడిపించుకున్నారు. దాంతో కేంద్రం కఠిన చర్యలు తీసుకోవాలని నిర్ణయించుకుంది, గవర్నర్‌గా జగ్మోహన్‌ను పంపించింది. అతను జనవరి 1990లో పదవి చేపట్టాడు. తాను మే 24న వెళ్లిపోయే లోపల భయానకమైన పరిస్థితిని కల్పించాడు. జగ్మోహన్ గవర్నర్‌గా పంపించగానే ఫరూక్ అబ్దుల్లా నిరసనగా రాజీనామా చేశాడు. ప్రజల్లో ఇంత వ్యతిరేకత ఉన్న వ్యక్తిని గవర్నర్‌గా పంపటం పట్ల అతని నిరసనను రాజీనామా రూపంలో తెలియజేశాడు. అయితే దీని ఫలితంగా జగ్మోహన్ రాష్ట్ర వ్యవహారాల పైన సంపూర్ణ అధికారాన్ని పొందాడు. అప్పట్లో కేంద్రంలో అధికారంలో ఉన్న జనతాదళ్ ప్రభుత్వం భారతీయ జనతా పార్టీ మద్దతుపై ఆధారపడి ఉండింది. భారతీయ జనతా పార్టీ ప్రోద్బలం మేరకే జగ్మోహన్‌ను జమ్మూ కశ్మీర్ గవర్నర్‌గా పంపించారు అని చాలా మంది నమ్ముతారు. అతను కశ్మీర్‌ను 'విషపురుగుల లోయగా' భావించాడు. రాష్ట్ర ప్రభుత్వం రాజీనామాతో సంతృప్తి చెందకుండా ఆ రాష్ట్ర అసెంబ్లీని కూడా రద్దు చేసేశాడు. ఎందుకు అన్న ప్రశ్నకు స్పష్టంగా ఏమి చెప్పాడంటే పెద్ద ఎత్తున బలప్రయోగం చేయడానికి నైతిక సాధికారత ఉండాలంటే అసెంబ్లీని రద్దు చేయడం అవసరం" అని అతని ఉద్దేశాలను స్పష్టం చేశాడు.

"జగ్మోహన్ పదవి చేపట్టగానే భారత సైన్యం, సిఆర్‌పిఎఫ్, బీఎస్ఎఫ్ నిత్యం కశ్మీర్ లోయలో సోదాలు మొదలు పెట్టాయి. ఈ సోదా చేసే క్రమంలో అరెస్టయిన వ్యక్తిని అప్పటికప్పుడే కాల్చి చంపడం అనేది చాలా సార్లు జరిగింది. వాళ్లను కాల్చి చంపేసి ఎదురు కాల్పుల్లో చనిపోయారని ప్రకటించడం మొదలుపెట్టారు. ఈ సోదాల క్రమంలో స్త్రీల పైన లైంగిక వేధింపులు, అత్యాచారాలు జరిగాయన్న ఆరోపణలు చాలా వచ్చాయి. ఎందుకంటే సోదా జరిగేటప్పుడు మగ వాళ్లందరినీ బయటికి రమ్మని ఒకచోట కూర్చోమనేవారు. ఇన్‌ఫార్మర్లు వాళ్లను దూరం నుంచి చూసి కావలసిన వాళ్లను గుర్తించేవారు. ఈలోపల సైనిక బలగాలు స్త్రీలు మాత్రమే ఉన్నటువంటి ఇళ్లలో సోదాకు పోయేవాళ్లు. ఈ క్రమంలో చాలా మంది స్త్రీలను లైంగికంగా వేధించినట్టు ఆరోపణలు వచ్చాయి. ఆర్మీ పాల్పడిన అత్యాచారాలకు నిరసనగా కశ్మీర్ లోయలో చాలా పెద్ద ఎత్తున ప్రదర్శనలు జరిగాయి. మొదటి నుంచి కూడా కశ్మీర్ ప్రజలలో భావోద్వేగం కల్గించిన విషయాల గురించి అటువంటి ప్రదర్శనలు జరుగుతూనే ఉన్నాయి."

"శ్రీనగర్‌లోని గౌకాదల్ ప్రాంతంలో 1990 జనవరి 21న నిరసన ప్రదర్శిస్తున్న 20 వేల ప్రజానీకం పైన సిఆర్‌పిఎఫ్ జరిపిన కాల్పుల్లో కనీసం 60 మంది చనిపోయారు. మరుసటి రోజు ఈ కాల్పులకు నిరసనగా మళ్లీ ప్రదర్శన జరుగగా దానిపై మళ్లీ సిఆర్‌పిఎఫ్ కాల్పులు జరిపి హవాల్ ప్రాంతంలో 8 మందిని చంపింది. 1990 మార్చి 1న, ఆజాదీ డిమాండ్ చేస్తూ దాదాపు 8 లక్షల మంది శ్రీనగర్‌కి ఊరేగింపుగా వచ్చారు. భారత సైనికులు వారిపైన మూడు చోట్ల (శ్రీనగర్ సిటీలోని దాకురా, టెంగ్ పురా, షాలిమార్) ప్రాంతాల్లో కాల్పులు జరిపి బస్సు పాసింజర్లతో సహా మొత్తం 33 మందిని చంపారు."

"అప్పటి అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ (సీనియర్) కూడా భారత ప్రభుత్వానికి సందేశం పంపుతూ ఊరేగింపులు, నిరసన ప్రదర్శనల పైన ఇటువంటి పాశవిక హత్యాకాండకు పాల్పడవద్దని చెప్పినట్లు తెలుస్తోంది. దీని ఫలితం జగ్మోహన్‌ను తొలగించి గిరీష్ సక్సేనాను తీసుకురావడం. ఈ దశలో గవర్నర్ జగ్మోహన్ లోయలో ఎక్కడెక్కడో ఉంటున్న పండిట్లకు రక్షణ కల్పించడం సైనిక బలగాలకు సాధ్యం కాదని ప్రకటించి, వారినందరినీ లోయనుండి వెళ్లిపొమ్మని సలహా ఇచ్చాడు. కశ్మీర్ పండితులందరూ వెళ్లిపోతే కశ్మీర్‌లో జరుగుతున్న పోరాటానికి మతం రంగు వస్తుంది. దానికి వ్యతిరేకంగా భారత్ చేస్తున్న ప్రచారానికి అది తగిన రంగు. మేధావి బల్‌రాజ్‌పూరి 1990 మార్చిలో కశ్మీర్ లోయకు వెళ్లి చాలా మంది ముస్లింలతో మాట్లాడారు. వారిలో చాలా మంది పండిట్లు మొత్తం వెళ్లిపోవటం చాలా బాధాకరమని ప్రకటించారు. రెండు మత వర్గాల ప్రతినిధులు సంతకాలు చేసిన ఒక ప్రకటన అప్పుడు విడుదల చేశారు. ముస్లిమ్స్ పక్షాన జమ్మూ కశ్మీర్ హైకోర్టు మాజీ ప్రధాన మూర్తి అయిన ముఫ్తి బాహబవుద్దీన్ ఫారుకీ, హిందువుల పక్షాన కశ్మీర్ పండిట్ల నాయకుడైన హెచ్.ఎస్. జట్టో ఆ ప్రకటనపై సంతకం చేశారు. వలసలను ఆపటం ఆ ప్రకటన ఉద్దేశం. చాలా మంది ముస్లింలు కూడా లోయను విడిచిపెట్టి పోవద్దని కశ్మీర్ పండిట్లకు విజ్ఞప్తులు చేశారు. పండిట్లలోని అభద్రతా భావాన్ని పోగొట్టటానికి ఈ ప్రకటనలు సరిపోతాయా అనేది వేరే విషయం. ఇక్కడ ఏది ప్రస్తుతం అంటే ఈ ప్రయత్నం సఫలం కాకుండా జగ్మోహన్ తీసుకున్న చర్యలు. హెచ్.ఎస్. జట్టోకు ఒక పోలీస్ అధికారి ద్వారా జమ్ముకు వెళ్లిపోవడానికి విమానం టికెట్, విమానాశ్రయానికి తీసుకుపోవడానికి జీపు పంపించి జమ్మూలో నీకు ఒక నివాసం ఇస్తాను వెంటనే వెళ్లిపో కశ్మీర్ నుంచి అని అతన్ని వెంటనే పంపించివేశాడు. ఎందుకు ఈ పని చేశావని బల్‌రాజ్ పూరి జగ్మోహన్ని అడగ్గా దానికి ఆయన ఏం కారణం చెప్పాడంటే, కశ్మీర్ గుర్తింపు ఉన్నత కాలం దాన్ని అమెరికా, పాకిస్థాన్‌లు వాడుకుంటాయి. హిందువులు, ముస్లింలు కలిసిమెలిసి బతికితే అది సైనిక బలగాల ఆత్మస్థైర్యాన్ని దెబ్బ తీస్తుంది. ఈ రెండు అభిప్రాయాలు కూడా ఆసక్తికరమైనవి. కశ్మీర్ గుర్తింపును ధ్వంసం చేయాలి. దాని స్థానంలో ఒక ముస్లిం గుర్తింపును నిలబెట్టాలి. అప్పుడు దాన్ని అణచివేత ద్వారా, దుష్ప్రచారం ద్వారా ఎదుర్కోవటం

భారత్‌కు సులభమవుతుంది. హిందువులు, ముస్లింలు దగ్గర కావటాన్ని నివారించాలి. అప్పుడు మూర్ఖులైన ముస్లింలుగా కశ్మీరీ ఉద్యమకారులను చూపించి, వాళ్లను చంపటానికి సైన్యాన్ని రెచ్చగొట్టడం సులభమవుతుంది. వారి స్వయంనిర్ణయాధికారం అణచివేత అంత సులభం కాకపోవచ్చు."

"కశ్మీరీ ప్రజలపై బురద జల్లుతున్న హిందుత్వ శక్తుల దుష్ప్రచారంపై కేంద్రీకరించిన కోణం ఇందులో ఉంది. కశ్మీర్ ప్రజలపై ముఖ్యంగా కశ్మీరీ ముస్లింలపై హిందుత్వ సంస్థలు కార్పొరేట్ మీడియా చేస్తున్న నిందా ప్రచారంలో అనేక చారిత్రిక అసత్యాలు ఉన్నాయి. చారిత్రిక వాస్తవాలను దేశ ప్రజలకు వివరించే ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాం. ఈ పరిమితిని దృష్టిలో ఉంచుకొని పాఠకులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాం" అని 'నెత్తుటి దారుల్లో కశ్మీర్ నిప్పులాంటి నిజాలు' అన్న పుస్తకానికి ముందు మాటలో ప్రసాద్ కోరారు.

"ఒకటి తర్వాత ఒకటిగా బౌద్ధం, శైవం, హైందవ మతాలను అనుసరిస్తూ కశ్మీర్ లోయ ప్రజలు 12, 13 శతాబ్దాలలో ఇస్లాం మతాన్ని స్వీకరించారు. స్వాతంత్ర్యం వచ్చాక కశ్మీర్‌కు మొదటిగా అధికారంలోకి వచ్చిన షేక్ అబ్దుల్లా ప్రభుత్వం పండిట్ల జాగీర్లు స్వాధీనం చేసుకున్నప్పటికీ, వారికి ఉద్యోగ ఉపాధి అవకాశాల్ని కల్పించింది. దీర్ఘకాలిక ఫ్యూడల్ చారిత్రిక నేపథ్యం గల పండిట్ల పట్ల ఎలాంటి కక్ష సాధింపు వైఖరిని షేక్ అబ్దుల్లా నాయకత్వంలో నేషనల్ కాన్ఫరెన్స్ చేపట్టలేదు. 'మా సంస్కృతి కశ్మీరియత్' అని అబ్దుల్లా ప్రభుత్వం సగర్వంగా ప్రకటించింది. అది కశ్మీరీ ముస్లింలతో పాటు పండిట్లు, ఇతర స్థానిక జాతుల సమ్మిళిత, సమ్మేళన సంస్కృతే 'కశ్మీరియత్'గా ప్రకటించి మతాతీత లౌకిక విధానాన్ని అవలంబించింది. అందుకే లోయ జనాభాలో కేవలం మూడు శాతం ఉన్నా పండిట్లకు ప్రభుత్వ ఉద్యోగాలలో 30 శాతం పైగా ఇచ్చారు. ప్రభుత్వ అండతో కశ్మీర్ లోయలో మత విభజనకు చేసే రేపటి కుట్రల పట్ల కూడా ఓ ముందుచూపు ఉంది. అట్టి రాజకీయ దూరదృష్టి గల నేషనల్ కాన్ఫరెన్స్ నిర్మించిన ప్రజాతంత్ర ఉద్యమ చైతన్య సాగరంలో ఉదయించిన పుష్పమే 'కశ్మీరియత్ నినాదం.' ఒకే లోయలో ఒకేచోట పుట్టి, ఒకే జాతిగా ఎదిగి, ఒకే భాష మాట్లాడి ఒకే సంస్కృతితో అన్నదమ్ముల్లా జీవించిన పండిట్లు, ముస్లింల పట్ల వెయ్యేళ్ల క్రితమే వేరు బీజాలు పడి దూరమైన పరిస్థితిని రూపుమాపి, సమైక్యత పునరుద్ధరణ కోసం ఇచ్చినదే 'కశ్మీరియత్ ' పిలుపు."

'కశ్మీరియత్' జాతీయ సమైక్యతా పిలుపు హిందూ, ముస్లిం ఐక్యతా వాతావరణం నెలకొల్పింది. ఐదు శతాబ్దాల పాటు తమను పీడించే యంత్రాంగంలో ఉన్నారనే ఈర్ష్య, ద్వేష భావాలు పండిట్లపై ముస్లింలకు లేకుండా పోయాయి, 40 ఏళ్లకి పైగా (1947 నుండి 1990 వరకూ) లోయలో మత సహజీవన జీవన సంస్కృతి వర్ధిల్లింది. ఐతే 40 ఏళ్ల తరువాత 1990లో మెజారిటీ పండిట్లు ఎవరివల్ల లోయను వదిలారు? వారిని ఒకవేళ ముస్లింలే రెచ్చగొట్టి ఉంటే, కచ్చితంగా ఖండిద్దాం, కానీ చేయని నేరాన్ని లోయ ముస్లిం ప్రజలకు ఆపాదిస్తే అది అపచారమౌతుంది. 370, 35ఎల రద్దు తర్వాత బిజెపి, ఆర్ఎస్ఎస్ వంటి సంస్థల విద్వేష ప్రచారం పెరిగింది. పండిట్లను లోయ ముస్లిం ప్రజలు తరిమేసినట్లు జరిగే ప్రచార ప్రభావం ఇప్పటికే విద్యాధిక, మధ్య తరగతి ప్రజలపై (ముఖ్యంగా యువతపై) ఉంది. వారి మనస్సులో ఏర్పడ్డ అపోహల్ని, దురభిప్రాయాల్ని ఇప్పటికిప్పుడే మార్చలేకపోవచ్చు. కానీ అంతిమంగా సత్యం గెలుస్తుంది. చరిత్ర గర్భంలో దాగిన నిప్పులాంటి నిజాలను ఎల్లవేళలా సమాధి చేయలేరు."

"19-1-1990వ సాయంత్రం వరకు పండిట్లు, ముస్లింలు కలసిమెలసి నివసించారు. అదే రాత్రికి ఎందుకు పండిట్ల తరలింపు జరిగింది? 1987లో భారీ ఎన్నికల రిగ్గింగ్ జరిగిన తర్వాత పాకిస్థాన్ కేంద్రంగా పనిచేసే కొన్ని ఇస్లాం మత తీవ్రవాద సంస్థలు ఇస్లాం మత ప్రాదిపదికపై లోయలో హిందువులను బెదిరిస్తున్న మాట నిజమే! ఇన్‌ఫార్మర్లు పేరుతో కొందరు పండిట్లను హత్య చేశారు. అదే ఇన్‌ఫార్మర్లు పేరిట హత్య చేయబడ్డవారిలో ముస్లింల సంఖ్య అత్యధిక శాతంగా ఉండటం గమనార్హం. ఐతేనేమి, వందలాది కుటుంబాలు సైనికుల కంట్లో పడకుండా ఇరుగు, పొరుగు ముస్లింల ఇళ్లలో తలదాచుకున్న మరో భిన్నకోణం కూడా ఉంది. దానిని కార్పొరేట్ మీడియా మరుగు పరిచింది.

"ముప్పై ఏళ్లు గడిచింది. సమీక్షచేసుకోవలసి ఉంది, బయటకు ఆనాడు తరలించబడ్డ పండిట్ల కుటుంబాల సంఖ్యపై విరుద్ధ లెక్కలున్నాయి. అతిశయోక్తులున్నాయి. అయితే అవి నేటికీ తిరిగి లోయకు రాలేదు. ఇంకొన్ని వేల పండిట్ల కుటుంబాలు లోయలోనే ఉండిపోయాయి, అవి నేటికీ భద్రతతోనే జీవిస్తున్నాయి. ఒక్క శ్రీనగర్ సిటీలో 2011 జనాభా లెక్కల ప్రకారం 33,191 మంది హిందువులున్నారు. అందులో 90 శాతం పైగా పండిట్లే. పండిట్లు జమ్ములో నేడు రెండవ తరగతి పౌరులే! పుట్టిన నేలను అనవసరంగా వదిలామని నేడు పై శిబిరాలలో పండిట్లు బాధపడుతున్నారు."

ఈ సందర్భంగా గాంధీ మనుమడు గోపాలకృష్ణ గాంధీ మాటలు గుర్తు చేసుకుందాం. 'కశ్మీరు చక్కని భూలోక స్వర్గమే, ఐతే అది అందమైన ప్రకృతి దృశ్యాల అందచందాలకు కాదు. కశ్మీర్ భూమాత కొడుకులు, కూతుర్లను బట్టి మాత్రమే' ఈ మాటలను ఆయన నైలా ఆలీఖాన్ (షేక్ అబ్దుల్లా మనుమరాలు) రచించిన ప్రఖ్యాత గ్రంథం 'ది లైఫ్ ఆఫ్ ఎ కశ్మీర్ ఉమన్' ముందుమాట లోనిది.

కశ్మీరీ జాతికి నిరంతరం రాజ్య దాడికి గురవుతున్న రాజకీయ నేపథ్యం ఉంది. ఫలితంగా వారిలో సజీవ జాతీయ రాజకీయ చైతన్యం ఉంది. కార్పొరేట్ రాజ్యం సమకూర్చే రంగు కళ్లద్దాలను అది తన దారికి చేరనివ్వటం లేదు. దేశ ప్రజలు నేడు ఎలా ఉన్నారో అదే రూపంలో కశ్మీరీ ప్రజల కళ్లకు కనిపిస్తారు. కానీ దేశ ప్రజల కళ్లకు కశ్మీరీ ప్రజలు తలకిందులుగా కనిపిస్తారు. కార్పొరేట్ దోపిడీ వ్యవస్థ అందించిన రంగు కళ్లద్దాలను తొలగించిన తర్వాత కశ్మీర్‌ను పరిశీలిస్తే యథార్థ దృశ్యం కనిపిస్తుంది."

కశ్మీర్ ఫైల్స్ సినిమాలోనూ, రాహుల్ పండిట్ పుస్తకంలోనూ శాంతి కాముకులైన కశ్మీరీ ప్రజలను శత్రువులుగా వక్రీకరించటం చాలా అన్యాయం. పైన ఉదహరించిన చరిత్రను గమనిస్తే, విధ్వంసాలకు ఎవరు కారకులో తెలుస్తుంది. సోదరుల మధ్య అగ్గిని రాజేసిన శక్తులను గుర్తిస్తాం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# మే డే ఉద్యమంలో రాడికల్ భావజాలం

*త్యాగానికీ, పెట్టుబడిపై నిరంతర పోరాట దీక్షకూ చిహ్నమైన కార్మిక దినం మే డే ఎలా ఆవిర్భవించిందో చరిత్ర వివరిస్తున్నారు* **భూసారం శివన్న**

బహుశా మన దేశంలో ఇప్పటి యువతరానికి 'మే డే' అంటే ఏమిటో పెద్దగా తెలియకపోవచ్చు. అది 'అంతర్జాతీయ శ్రామికుల రోజు' అని కూడా తెలియక పోవచ్చు. సమాజంలో ప్రధాన భాగమై, ఉత్పత్తిలో పాల్గొంటూ, సంపదను సృష్టిస్తున్న శ్రమజీవులు చాలా మందికి ఈ అంతర్జాతీయ శ్రామికుల రోజైన 'మే డే' చరిత్రగాని, దాని ప్రాముఖ్యతగాని తెలియని దుస్థితే ఇప్పుడు మన దేశమంతా ఉంది. 'మే డే' అంటే ఓ కార్మికుల పండగనో, ఎర్రజెండా ఎగరేస్తారనో, యూనియన్ నాయకులు, కొందరు రాజకీయ ప్రముఖులు విచ్చేసి నాలుగు లెక్చర్లు దంచి, స్వీట్లు పంచిపెట్టే సాలువారీ సంబరంగా పనివారికి తెలిస్తే తెలియొచ్చు. ఎందుకంటే 'మే డే'ను అంతవరకే కుదించి, అలానే జరుపుకుంటున్నారు కాబట్టి.

ఎక్కడైతే, ఏ దేశంలోనైతే, మహత్తర కార్మికోద్యమం ఉవ్వెత్తున లేచి 'మే డే' ఆవిర్భావానికి నాంది పలికిందో, ఆ అమెరికా దేశంలోనే దానికి ప్రాముఖ్యం లేకుండా చేసారు అక్కడి పెట్టుబడిదారీ పాలకులు. అమెరికా ప్రజలకు అక్కడి పాలక వర్గం పనిగట్టుకుని 'మే డే' అంటే ఆనాటి నుండి ఈనాటి వరకు ఏవగింపును నూరిపోస్తూనే ఉంది. పెట్టుబడి సామ్రాజ్యాధిపతి అమెరికా 'మే డే'ను గుర్తించకపోగా దానికి క్రమశిక్షణా దినమని పేరు పెట్టింది. అమెరికాలో జరిగిన శ్రామిక పోరాటాల మూలంగా, త్యాగాల ఫలితంగా, శ్రామికులు సాధించుకున్న 8 గంటల పని దినాన్ని, ఆ శ్రామిక విజయాన్ని గుర్తించి, లేబర్-డేగా ప్రకటించడానికి అమెరికా పెట్టుబడిదారులు అప్పుడూ, ఇప్పుడూ సిద్ధంగా లేరు. 'మే డే' అంటే వారికి అంతటి కక్ష, వివక్ష ఎందుకో తెలుసుకోవాలంటే గత శ్రామికోద్యమ చరిత్ర శోధించాల్సిందే!

19వ శతాబ్దపు చరమాంకంలో 8 గంటల పని దిన సాధనోద్యమం అమెరికా, ఐరోపా దేశాల్లో పెల్లుబికింది. రోజువారీ పనిగంటలు ఎనిమిదికి మించకూడదని, '8 గంటలు పని, 8 గంటలు విశ్రాంతి, 8 గంటలు వినోద విహారాలకు' వెచ్చించే విధంగా పనివారికి వెసులుబాటు ఉండాలని పశ్చిమ భూగోళమంతటా, ముఖ్యంగా అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో, శ్రామిక ప్రజలు ఉవ్వెత్తున ఉద్యమించారు.

ప్రతి రోజూ 12 నుండి 16 గంటలు, ఆ పైన కూడా అధ్వాన్నపు పని స్థలాల్లో, సరిగా గాలి, వెలుతురు సోకని పరిశ్రమల్లో పనివారు ఆ కాలంలో దుర్భరమైన శ్రమ చేసేవారు. మహిళలు, చిన్నపిల్లలు ఇంతే దుర్భర శ్రమలో మగ్గిపోయారు. పని ప్రదేశాల్లో ఒంటికి గాయాలు, ఆపద చావులు నిత్యం మామూలే! ఈ పరిస్థితులే అప్టాన్ సింక్లెయిర్, జాక్ లండన్ వంటి అమెరికా శ్రామిక వర్గ రచయితలను 'ద జంగిల్', 'ద ఐరన్ హీల్' అనే మహత్తర నవలలు రాసేందుకు దోహదం చేసాయి. ఆ నవలల్లో, ఆనాటి శ్రామికుల దీనావస్థను, శ్రామికుల దుర్భర జీవితాలను, పెట్టుబడి దాష్టీకాన్ని కళ్లకు కట్టినట్లు వర్ణించారు. 1860ల నుండే ఊపందుకున్న ఈ 8 గంటల ఉద్యమం, 1880ల నాటికి గాని ఉధృతి సాధించలేక పోయింది. యజమానులు అంగీకరించనప్పటికీ, రోజువారీ పని, 8 గంటలకు మించి ఉండరాదనే నియమం, కార్మికులే ఏకపక్షంగా ప్రకటించారు. ఈ న్యాయబద్ధమైన హక్కును కార్మిక శ్రేణులు తెగించి సాధించు కోవడానికి సిద్ధపడ్డారు కాబట్టే, ఒక్కటై ఉద్యమించారు.

ఆనాడు, సోషలిస్టు భావజాలం శ్రామిక ప్రజలను ఎంతగానో ఆకర్షించింది. ఉత్పత్తి సాధనాలు శ్రామికులకే చెందాలని, సరుకుల ఉత్పత్తి, వాటి పంపిణీ, ప్రజాసేవలు, శ్రామిక కమిటీల ద్వారా నిర్వహించబడాలనే భావన శ్రామిక శ్రేణుల్లో ఓ ప్రధాన స్రవంతిగా ఉండేది. వారి జీవితానుభవం, దిగజారిపోతున్న తమ బతుకులు, పైకెగబాకుతున్న పరిశ్రమాధిపతుల లాభాలు, సంపద, తమ కళ్ల ముందే వేలాది శ్రామిక మహిళలు, పురుషులు, పిల్లలు అభాగ్యజీవులుగా అకారణంగా అనతి కాలంలో మరణించడం, పెట్టుబడి పీడనకు గురై చనిపోవడం.. ఈ జీవితానుభవ దృశ్యాలు వారిని సోషలిస్టు ఆలోచనలకు చేరువ చేశాయి. వారికి సోషలిజం ఓ ప్రత్యామ్నాయంగా తోచింది.

19వ శతాబ్దపు అర్ధభాగం నుండి పలురకాల సోషలిస్టు భావజాలంతో రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు, సాంస్కృతిక బృందాలు ఎన్నో వెలిసాయి. చాలా మంది సోషలిస్టులు ప్రాంతీయ నియోజకవర్గ ఎన్నికల్లో పోటీచేసి ప్రభుత్వ పదవులకు ఎన్నికయ్యారు. అయితే వీరిలో చాలామంది పెట్టుబడి వర్గాల ఆధిపత్య శిబిరానికి దాసోహమయ్యారు. ఇది కిట్టని అనేకులు మిలిటెంట్, రాడికల్ బృందాలుగా ఏర్పడి సంఘటితు లయ్యారు. పెట్టుబడిదారీ 'ఉత్పత్తి-అధికార' చట్రాన్ని కూలదోయనిదే శ్రామికులకు ఒరిగేదేమీ లేదని ఈ శ్రేణులు వాదించేవి. అలా, ఆనాడు, అమెరికా శ్రామిక సంఘాల్లో ప్రధానంగా సోషలిస్టులు, అనార్కిస్టులు, నైట్స్ ఆఫ్ లేబర్, ఇండస్ట్రియల్ వర్కర్స్ ఆఫ్ ది వరల్డ్ అనే బృందాలు బలంగా ఉండేవి.

1884లో చికాగో నగరంలో, అప్పటి వివిధ వృత్తుల, శ్రామికుల ఐక్య సంఘటన (ఫెడరేషన్ ఆఫ్ ఆర్గనైజ్డ్ ట్రేడ్స్ ఎండ్ లేబర్ యూనియన్స్- ఎఫ్ఓటిఎల్‌యు) జాతీయ సమావేశం నిర్వహించింది.

(ఈ శ్రామిక సంఘటనే తదనంతర కాలంలో 'అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్'- ఏఎఫ్ఎల్ అనే సంస్థగా మారింది). ఆ సమావేశం ఓ తీర్మానం చేసింది. 1886, మే నెల, ఒకటవ తేదీ నుండి రోజుకు 8 గంటల పని దినం చట్టబద్ధంగా అమలవ్వాలనేది ఆ తీర్మానం.

ఆ మలి సంవత్సరం, 'ఎఫ్ఓటిఎల్‌యు' సంత్సర క్రితం చేసిన తీర్మానాన్ని బలంగా వినిపించడం మొదలు పెట్టింది. 8 గంటల పని దినం చట్టబద్ధం చేసేవరకు కార్మిక ప్రదర్శనలు, సమ్మెలు నిర్వహిస్తామని ప్రకటించింది. అయితే కొంతమంది అనార్కిస్టులు, రాడికల్ శ్రామిక నాయకులు ఇది సరిపోదని, అసలు పెట్టుబడి మూలాలను, దాని చీడ-పీడలను నిర్మూలించనిదే శ్రామికులకు సంపూర్ణ విముక్తి సిద్ధించదని ప్రకటించారు. హే-మార్కెట్ మారణకాండకు ఓ సంవత్సరం ముందే 'ద అలారం' అనే అనార్కిస్టు పత్రికలో సామ్యూల్ ఫీల్డెన్ అనే కార్మిక నాయకుడు, 'ఓ వ్యక్తి 8 గంటలు పనిచేసినా, లేక 10 గంటలు పనిచేసినా, అతను పెట్టుబడికి బానిసే గాని, విముక్త కార్మికుడు కాజాలడు' అని రాసేడు.

8 గంటల పని దిన సాధనోద్యమానికి తొలుత చాలామంది అనార్కిస్టులు విముఖత వ్యక్తం చేసినప్పటికీ, చికాగో ప్రాంతం నుండి 2.5 లక్షల మంది శ్రామికులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారని గమనించి తాముకూడా ఈ ఉద్యమంతో మమేకమయ్యారు. క్రమేణా విడి విడి శ్రామిక సమూహాలన్నీ 8 గంటల పని దిన సాధనకు ఐక్యమై కదిలాయి. అనార్కిస్టుల చేరికతో ఈ ఉద్యమం మరింత బలపడింది. రాడికల్ స్వభావాన్ని సంతరించుకుంది. ఈ ఉద్యమం 8 గంటల పని దిన సాధన అనే తక్షణ లబ్ధితో సరిపెట్టుకోరాదని, పెట్టుబడిదారీ ఆర్థిక, అధికార చట్రాన్ని చిత్తు చేసేవరకు శ్రామికుల పోరాటం కొనసాగాలని అనార్కిస్టులు పట్టుబట్టారు.

మే 1, 1886 తేదీకి కొద్ది రోజుల ముందు ఓ రాడికల్ పత్రికలో శ్రామికుల నుద్దేశిస్తూ ఓ కరపత్రం అచ్చయింది. ఆ పత్రంలో ఏముందో చూడండి:

♦ శ్రామికులారా ఆయుధాలు పట్టండి!

♦ రాజ ప్రసాదానికి యుద్ధం, శ్రమజీవి గుడిసెకు శాంతి, విలాసవంతమైన సోమరితనానికి నాశనం...

♦ ప్రపంచంలో యావత్ దైన్యానికి ఒకే ఒక్క హేతువు వేతన వ్యవస్థ. ధనిక వర్గాలు దీన్ని మోపు చేస్తున్నాయి. దీన్ని రూపుమాపాలంటే వాళ్ల చేత పనైనా చేయించాలి, లేదా, వారికి చావునైనా చూపించాలి.

♦ గంపెడు ఓట్ల కట్టలకన్నా, ఓ పౌను(పౌండ్) డైనమైట్ ఎంతో మేలు.

♦ ఎనిమిది గంటల పని హక్కును ఆయుధాలు చేబట్టి డిమాండ్ చెయ్యండి, పెట్టుబడిదారీ రక్త పిపాసులను, పోలీసు బలగాలను సరైన రీతిలో ఎదురుకోండి.

మే 1, 1886న చరిత్రలో మొదటిసారి 3 లక్షల మంది కార్మికులు అమెరికా అంతటా పని మానుకుని వీధుల్లోకి వచ్చారు. 13000 వ్యాపారాలు ఆ రోజు మూత పడ్డాయి. ఈ మొదటి మేడే ఉత్సవాన్ని ఇంత ఉధృతంగా, బలంగా జరుపుకోవడమనేది ఆనాడు ప్రపంచంలో మొట్టమొదటిసారి జరిగిన సంఘటన. 8 గంటల ఉద్యమానికి కేంద్ర బిందువైన చికాగోలో 40,000 ఉద్యమకారులు అనార్కిస్టుల నాయకత్వంలో ఆ రోజు సమ్మెలో పాల్గొన్నారు. అనార్కిస్టుల ఉగ్రూతలూగించిన ఉపన్యాసాలు, పెట్టుబడిదారులతో ప్రత్యక్ష పోరుకు దిగాలనే వారి నినాదాలు కార్మికులను ఆకట్టుకున్నాయి. పెట్టుబడిదారులను ఇది చాలా కలవర పెట్టింది. వారు కక్షతో ఊగిపోయారు. ఇదంతా 10 ఏళ్ల క్రితం ఇదే నగరంలో జరిగిన రైల్వే కార్మికుల మిలిటెంట్ పోరాటం, పోలీసు మిలట్రీ కాల్పులు, అనేక మరణాలు, క్షతగాత్రులు.. ఇటువంటి యుద్ధ వాతావరణమే పునరావృతం ఔతున్నట్లు కన్పించింది.

అల్బెర్ట్ పార్సన్స్, జోహాన్ మోస్ట్, ఆగస్ట్ స్పైస్, లూయీ లింగ్ వంటి కార్మిక వీరుల పేర్లు చికాగోలోనూ, అమెరికా అంతటా, ప్రతి శ్రామికుని ఇంటా మార్మోగాయి. వేలాదిగా శ్రామిక ప్రజలు వీధి ప్రదర్శనలకు తరలి వచ్చి తమ ఐక్యతను, సంఘటిత శక్తిని చాటారు. వారు శాంతియుతంగానే ఈ ప్రదర్శనలు చేసినప్పటికీ పెట్టుబడిదారీ పత్రికలు, అధికార వర్గాలు హింస పెరిగిపోయిందని, అశాంతితో కొంపలంటుకుంటున్నాయని గగ్గోలు పెట్టి ప్రచారం చేశారు.

మేడే ఉద్యమం మరింత బలపడింది. లక్షకుపైగా చికాగో కార్మికులు వీధుల్లోకి వచ్చారు. ఎక్కడా ఘర్షణలు లేవు. ప్రశాంత వాతావరణం లోనే ప్రదర్శనలు జరిగాయి. ఈ మే డే ప్రదర్శన గడిచి రెండు రోజులకు, మే 3, 1886న, మెక్కార్మిక్ రీపర్ వర్క్స్ అనే పరిశ్రమ వెలుపల కార్మికులకు పోలీసులకు మధ్య ఘర్షణ జరిగి, హింస చెలరేగింది.

సాయుధ కిరాయి పింకరటన్ గుండాలు, స్థానిక పోలీసు బలగాలు, 6 నెలల పాటు మెక్కార్మిక్ పరిశ్రమ బయట ధర్నా జరుపుతున్న కార్మికులను వేధించడం, లాఠీలతో బాదడం చేస్తూనే ఉన్నారు. ఈ కార్మికుల్లో చాలామంది అనార్కిస్టుల ప్రాబల్యంలో ఉన్న మెటల్ వర్కర్స్ యూనియన్ కు చెందినవారు. హర్తాళ్ చేస్తున్న ఈ పరిశ్రమ కార్మికులకు మద్దతు తెలియ చేయడానికి అక్కడ మరో రెండు వందల మంది ఇతర కార్మికులు జమై, సభ నిర్వహిస్తున్న సందర్భంలో పోలీసులు అకారణంగా కార్మికులపై లాఠీలతో విరుచుకుపడ్డారు. కొంతమంది నిరసనకారులు దీనికి ప్రతిచర్యగా రాళ్లు రువ్వారు. దీనితో పోలీసులు వారిపై కాల్పులు జరపడం, ఇద్దరు చనిపోవడం, చాలమంది గాయపడటం జరిగింది.

ఈ దారుణ చర్యతో చికాగో కార్మిక శ్రేణులు కోపంతో ఊగిపోయాయి. ఆ మరునాడు కొంతమంది అనార్కిస్టులు హే మార్కెట్ (గడ్డి బజారు) వద్ద బహిరంగ సభకు పిలుపునిచ్చారు. ఆ రోజు వాతావరణం అనుకూలించక పోవడంతో, కేవలం 3000 మంది వరకే ఈ సభకు వచ్చారు. అనేకమంది మహిళలు తమ పిల్లలతో సహా ఈ సభలో పాల్గొన్నారు. చికాగో నగర మేయర్ కూడా ఈ సభలో ఉన్నాడు. సభ ముగింపు కొస్తోంది. ఈ దశలో పింకరటన్ ఏజెంట్ గుండాలు, ఆగస్ట్ స్పైస్ అనే నాయకుడు కార్మికులను రెచ్చగొడుతున్నాడని, పరిశ్రమల యజమానులను దుర్భాష లాడుతున్నాడని, పోలీసులను రెచ్చగొట్టి వక్తలపైకి ఉసిగొల్పారు. ఇక్కడితో ఆగక, చాటునుండి, ఎవరితోనో ఓ చేతి బాంబు విసిరించారు.

ఇదంతా ఓ ప్లాను ప్రకారం మెక్కార్మిక్ పరిశ్రమ యాజమాన్యం కిరాయి గుండా ఏజెంట్లను రంగంలోకి దించి కార్మికుల పోరాటాన్ని నీరు కార్చే ఉద్దేశ్యంతో చేసిన పని. కార్మిక నాయకులను కుట్రపూరితంగా ఉరికంబమెక్కించే ఓ నీచమైన, క్రూరమైన కుట్ర. ఈ కుట్రతో, విస్తరిస్తున్న మిలిటెంట్ కార్మికోద్యమపు వెన్ను విరిచి, మరిక లేవకుండా చేయాలనేది, పరిశ్రమాధిపతుల వ్యూహం. ఈ పింకర్టన్ కిరాయి మూక, పెట్టుబడిదారుల సేవలో కార్మికులకు వ్యతిరేకంగా పనిచేసే ఓ వ్యాపార సంస్థ. దీనివెనుక చాల చరిత్రే ఉంది. ఇప్పటికీ ఇది కార్పొరేట్ పెట్టుబడిదారులకు కిరాయి సేవకులను, సేవలను అందిస్తూనే ఉంది.

ఈ బాంబు వంకతో పోలీసులు అక్కడ గుమిగూడి ఉన్న కార్మికులు, ప్రేక్షకులపై విచక్షణ లేకుండా కాల్పులు జరిపారు. ఎంతమంది చనిపోయారో తెలియదు. ఏడెనిమిది మంది చనిపోయినట్టు ఒక అంచనా. 40 నుండి 50 మంది గాయాల పాలయ్యారు. ఆరోజు ఓ పోలీసు అధికారి అప్పటికప్పుడు మరణించాడు. ఇంకో ఏడుగురు పోలీసులు తూటాలు తగిలి ఓ వారం రోజుల్లో చికిత్స పొందుతూ చనిపోయారు. ఇలా చనిపోయిన పోలీసులు వాళ్లలో వాళ్లే విచక్షణా రహిత కాల్పుల్లో చిక్కుకుని చనిపోయినట్లు ప్రజాభిప్రాయం. బాంబు వేసినది ఎవరో పక్కకు పెడితే, ఈ హింసాత్మక ఘటనకు ముఖ్య కారణం పోలీసు, పింకరటన్ గుండాలే గాని కార్మికులు కాదనేది యథార్థం.

ఆల్బెర్ట్ పార్సన్స్, ఆగస్ట్ స్పైస్, సామ్యూల్ ఫీల్డెన్, ఆస్కార్ నీబీ, మైఖేల్ ష్వాబ్, జార్జ్ ఏంగెల్, అడాల్ఫ్ ఫిషర్, లూయీ లింగ్ అనే ఎనిమిది మంది అనార్కిస్టు ఉద్యమకారులను బంధించి వారిపై హత్యానేరం మోపారు. నిజానికి వీరిలో ఓ ముగ్గురే హే మార్కెట్ సంఘటనా స్థలంలో ఉన్నారు. వీరెటువంటి దుశ్చర్యకు పాల్పడలేదు. బాంబు ఘటన జరిగినప్పుడు ఆ ముగ్గురూ అందరి కళ్ళముందే ఉన్నారు. మిగతా ఐదుగురు అసలు అక్కడ లేనే లేరు. ఈ కేసును విచారించిన న్యాయ కమిటీలో (జ్యూరీలో) ఉన్నవారంతా వ్యాపార వర్గాలకు చెందిన ప్రముఖులే! ఇక ఏముంది? న్యాయం అపహాస్యంగా మారింది. బాంబు ఘటనతో ఏ సంబంధమూ లేని 8 మందిని హంతకులుగా ముద్రవేసి ఉరిశిక్ష విధించారు. అందరికీ తెలుసు, జూరీ పెద్దలు చేసిందేమిటో! వాళ్లు, అనార్కిస్టుల సిద్ధాంతాలను, ఉద్యమాచరణను తుదముట్టించే ఉద్దేశ్యంతోనే ఈ శిక్ష విధించారని. న్యాయాన్ని హత్యచేస్తూ నవంబర్ 11, 1887న పార్సన్స్, స్పైస్, ఏంగెల్, ఫిషర్ లను ఉరితీశారు. లూయీ లింగ్ ఈ శిక్షను వ్యతిరేకిస్తూ మరునాడు ఉరితీస్తారనగా ఆ రాత్రి నోటిలో మందుగుండు పెట్టుకుని పేల్చు కుని మరణించాడు. ఫీల్డెన్, నెబీ, ష్వాబ్‌ల విషయంలో 6 సంవత్సరాల సుదీర్ఘ విచారణ తర్వాత, చికాగో గవర్నర్ ఆల్టెల్డ్ కలగచేసుకుని వారి విడుదలకు కారణమయ్యాడు. అంతేకాక,ఈ కేసుపై తీర్పు చెప్పిన జడ్జి దుర్మార్గపు నిర్ణయాన్ని కూడా అమెరికా సమాజం ముందు ఉంచి తీవ్రంగా నిరసించాడు, ఎండగట్టాడు. అలా ఆయన పాలక పక్షానికి చెందిన వాడే అయినా నిష్పక్షపాతిగా అమెరికా చరిత్రలో నమోదయ్యాడు.

హే మార్కెట్ మారణకాండ తర్వాత పెట్టుబడిదారీ పారిశ్రామిక వ్యాపార వర్గాలు అమెరికాలో 'ఎర్ర బీభత్సం' అనే భూతాన్ని తెరపైకి తెచ్చి అమెరికా ప్రజల్లో అనార్కిస్టుల పట్ల, సోషలిస్టుల పట్ల ఏహ్యాభావాన్ని పెంపొందించారు. అనార్కిస్టులంటే ఒకచేత్తో బాంబు, మరో చేత్తో కత్తి ధరించి తూర్పు ఐరోపా నుండి వలస వచ్చిన గుబురు గడ్డపు హంతకులని దుష్ప్రచారం చేసారు. చరిత్ర పొడవునా, ఆనాటి నుండి ఈనాటి వరకు పెట్టుబడిదారీ వర్గాల ప్రధాన ఆయుధం ఫాల్స్ ప్రోపగాండా, వక్రీకరణల దుష్ప్రచారం. ఈ దుష్ప్రచారాన్ని వారు గొప్ప కళగా పెంపొందించారు. ఈ దుష్ప్రచార నీతికి స్వతంత్రత, వ్యక్తి స్వేచ్ఛ వంటి తీపిపదాలతో అల్లిన ముసుగులు తొడిగారు. అంతే కాదు, ప్రపంచం నలుమూలలా, ఎక్కడ ప్రజా ఉద్యమాలు జరిగినా, వాటిని అణచివేయడానికి ఈ ప్రచార కళను ఓ మానసిక యుద్ధ తంత్రంగా అభివృద్ధి చేసారు.

ఈ రోజు ప్రపంచమంతా తిరిగి హే మార్కెట్ వీరులను స్మరిస్తోంది. ఆ చరిత్రను అధ్యయనం చేస్తోంది. ఎవరి త్యాగాలతో, ఏ ఉన్నత ఆశయాలతో మే డే సిద్ధించిందో, అది ప్రపంచ శ్రామిక దినంగా స్వీకరించబడిందో ఇప్పటి యువతరం తెలుసుకుంటోంది. అయితే ఇప్పటికీ అమెరికా పాలక వర్గాలు మే డే ను తిరస్కరిస్తున్నాయి. దాన్ని వేతనమిచ్చే శెలవు దినంగా ప్రకటించడం లేదు. ఇంకా దుర్మార్గమేమంటే, మే డేను లా ఎండ్ ఆర్డర్ డేగా పరిగణిస్తున్నాయి. శ్రామికులపట్ల పెట్టుబడిదారుల శత్రుపూరిత వైఖరి, వివక్ష, తీరని కక్షలను ఈ నైజం బయటపెడుతోంది.

హే మార్కెట్ స్థూపంపై చెక్కిన పదాలు: 'ఈ రోజు మీరు మా గొంతులు నులిమి నిశ్శబ్దాన్ని సృష్టించారు. కానీ మా నిశ్శబ్దం ఎంతటి మహత్తర శక్తో తెలియచేసే రోజు వస్తుంది'. ఈ సత్యవాణి ఆనాడు ఎంత నిజమో ఈనాడు మరింత నిజం.

గత చరిత్ర మనకు రాడికల్ భావజాలపు మూలాలెన్నిటినో బోధిస్తుంది. 8 గంటల పనిరోజు ప్రాప్తించిందంటే ఎందరో శ్రామిక వీరులు, సాధారణ శ్రామికులు దుష్ట పాలకుల తుపాకీ గుండ్లకు బలైతేనే కదా.

ఎందరి పూరి గుడిసెలు, అందులో నివసించే కుటుంబాలు అగ్నికి ఆహుతి అయి బూడిద అయిపోతేనే కదా వారాంతపు శెలవు సమకూరింది.

ఎందరో పసికూనలు, అమ్మలు, మహిళలు యంత్ర భూతాల కోరల్లో చిక్కుకుని నుజ్జయి పోతే కదా.

ఎందరో నడివీధుల్లో పోరాట కవాతులు చేసి పెట్టుబడి తుపాకులకు ప్రాణాలర్పిస్తే కదా, ఈనాటి ఈపాటి ఊపిరైనా కొంతమంది శ్రామికులకు మిగిలింది.

ఇంకా ప్రపంచంలో కోట్లాది శ్రామికులు, ఈమాత్రపు వెసులుబాటుకు కూడా లేని దర్భర జీవితాలు గడుపుతున్నారు కదా!

అసలు రాడికల్ మిలిటెంట్ భావజాలమే ఉదయించకపోతే, చీకటే తప్ప వెలుతురెక్కడిది? మానవాళికి పెట్టుబడి నుండి విముక్తి ఎక్కడిది?

మేడే అంటే త్యాగం, మేడే అంటే పెట్టుబడిపై నిరంతర పోరాట పవనం. ప్రపంచ శ్రామికులంతా పెట్టుబడిపై మరో ఉధృత పోరాటానికి మేడే ఉద్యమ స్ఫూర్తితో సిద్ధమౌతారని ఇప్పటి ప్రపంచ పరిణామాలు మనకు పాఠం చెబుతున్నాయి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# హత్యలు, అత్యాచారాలు - "గౌరవ దినం"

***ఆదివాసి ప్రాంతాలలో బీభత్సం సృష్టిస్తూ, ఆదివాసుల హక్కులను కొల్లగొడుతూ మరోవైపు ఆదివాసి గౌరవ దినం ప్రకటిస్తున్న పాలక కుటిల నీతిని వివరిస్తున్నారు*** **ఏమ్లా వాగాలు**

*(...గత సంచిక తరువాయి భాగం)*

దక్షిణ్ బస్తర్‌లో సిలింగేర్ పోరాటం కొనసాగుతుండగానే ఉత్తర బస్తర్‌లో (కాంకేర్) వెచ్చఘాట్ దగ్గర డిసెంబర్ 7న మళ్లీ పోలీసు క్యాంపు వ్యతిరేక పోరాటం ఊపందుకున్నది. 2021 తొలి మాసాలలో ప్రారంభమైన ఆ పోరాటం ఇపుడు మరిన్ని డిమాండ్లతో కొనసాగుతున్నది. వెచ్చఘాట్ మహారాష్ట్ర, ఛత్తీస్‌గఢ్ సరిహద్దులలో ఉండడంతో రెండు రాష్ట్రాల ప్రజలకు పాత పోలీసు క్యాంపులకు తోడు కొత్త పోలీసు క్యాంపులతో జీవన్మరణ సమస్య అవుతోంది. దాంతో రెండు రాష్ట్రాల ప్రజలు సమైక్యంగా పోరాడుతున్నారు. ప్రస్తుతం ఆ ప్రజలు ఆ ప్రాంతంలోని మేండీ నదిపై నిర్మిస్తున్న బ్రిడ్జిని, ఆ ప్రాంతంలో తలపెట్టిన పర్యాటక కేంద్రాన్ని బలంగా వ్యతిరేకిస్తున్నారు. నదిపై నిర్మిస్తున్న బ్రిడ్జి ఆ ప్రాంతంలోని విలువైన ప్రాకృతిక వనరుల తరలింపుకు ఒక చక్కని సేతుగా నిలుస్తుందనీ, దానితో ఆ ప్రాంత ప్రజలకు నష్టమే తప్ప ఎలాంటి ఉపయోగం లేదనీ వారు తెలుపుతున్నారు. ఇక పర్యాటక కేంద్రం ఆ ప్రాంతంలో నెలకొల్పబోయే కార్పొరేట్ వర్గాల అతిథుల వినోదాలు తీర్చడానికి, తమ అర్ధనగ్న జీవితాలను వేలం వేయడానికి, దేహ వ్యాపారాన్ని ప్రమోట్ చేయడానికి తప్ప పర్యాటక కేంద్రంతో ప్రజలకు ఒనగూడేదేమీ లేదని నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తున్నారు.

వెచ్చఘాట్ పోరాట ప్రజలు ఫిబ్రవరి 10 'భూంకాల్ దినం' రోజు వేల సంఖ్యలో జిల్లా ముఖ్య పట్టణం కాంకేర్‌కు తరలివెళ్లి తమ డిమాండ్లను ప్రపంచానికి చాటారు. వారు తమ ఆదివాసీ ప్రాంతాలలో పోలీసు క్యాంపులు వద్దన్నారు. మావోయిస్టుల పేరుతో ఆదివాసీ పిల్లలను పోలీసులు హత్య చేయడాన్ని వారు బలంగా ఖండించారు. వారిని హిందువులుగా జనగణనలలో లెక్కించడాన్ని తాము ఎన్నటికీ సహించమని తేటతెల్లం చేశారు. ఈనాడు మనదేశంలోని మూలవాసీ ప్రజలు ఇలాంటి లెక్కకు మిక్కిలి సమస్యలతో సతమతమవుతుండగా ప్రధాని గౌరవ దినాన్ని ప్రకటించడం మూలవాసీ ప్రజలతో క్రూర పరిహాసం తప్ప మరేం కాదు.

మహారాష్ట్రలోని గడ్‌చిరోలీ జిల్లా సుర్జాగఢ్ గనుల తవ్వకాలను అక్కడి ప్రజలు దాదాపు మూడు దశాబ్దాలుగా వ్యతిరేకిస్తున్నారు. కానీ, మహారాష్ట్రలో భాజపా, శివ సైనికుల కూటమి ప్రభుత్వం ఏర్పడిన పిదప ఆ పనులకు పెద్ద ఎత్తున పోలీసు రక్షణ కల్పించి ప్రారంభించారు. ఆ గనుల తవ్వకాలను వ్యతిరేకిస్తున్న వారిని పెద్ద ఎత్తున అరెస్టు చేస్తున్నారు. అయినప్పటికీ ప్రజలు పోరాడుతునే ఉన్నారు. అక్టోబర్‌లో 25-29 మధ్య వేలాది సంఖ్యలో ప్రజలు గనుల తవ్వకాలను అడ్డగిస్తూ ధర్నా ప్రారంభించారు. కానీ పోరాట నాయకత్వాన్ని పోలీసులు దౌర్జన్యంగా అరెస్టు చేసి జైలు పాలు చేసి పోరాటాన్ని విచ్ఛిన్నం చేశారు. మరో 15 రోజులకు మోదీ గౌరవ దినాన్ని ప్రకటించడం ఎంత విడ్డూరం!

మన దేశంలో బూటకపు ఎన్‌కౌంటర్లకు కాంగ్రెస్ ప్రభుత్వాలే తెరలేపాయి. ఆ తరువాత నయా రివిజనిస్టులు మరింత బరితెగించి ఎర్రజెండాను ముందు పెట్టి నక్సల్బరీ నుండి నిన్నటి నీలంబూరు, నేటి హట్టపాదుల వరకు నెత్తుటి ఏరులు పారిస్తున్నారు. అధికారంలో ఏ పార్టీ ఉన్నా అన్ని పార్టీలూ ఆ దారినే అనుసరిస్తున్నాయి. పార్లమెంటరీ రాజకీయ పార్టీల ఆర్థిక విధానాలలో కానీ, భారత విప్లవకారుల పట్ల వారు అనుసరించే విధానాలలో తేడాలుండవని గత అర్ధశతాబ్ద కాలపు చరిత్ర నిరూపిస్తున్నది. ఛత్తీస్‌గఢ్‌లో దాదాపు మూడు విడుతలు అధికారాన్ని చలాయించిన భారతీయ జనతా పార్టీ 2003 నుండి 2018 వరకు ఒకవైపు అడవులను బహిరంగ వేలంలో అమ్మకానికి పెట్టి అనేక ఎంఓయూలను కుదుర్చుకుంటూ మరో వైపు అవి చెల్లవని ప్రజలు తమ మనుగడ కోసం వాటిని అడ్డుకుంటుంటే అడవులను ఖాకీ మయం చేస్తూ సల్వాజుడుం, అప్రకటిత గ్రీన్‌హంట్లను, ఆ వరుసనే 2017లో సమాధాన్ నడిపించి ఆదివాసుల నెత్తుర్లు చిందించారు. భాజపా పాలనలో చోటుచేసుకున్న మానవ సంహారాన్ని, ఇతర ఘాతుకాలను, పాలనా వైఫల్యాలను ఓటు బ్యాంకు రాజకీయాలతో ఎండగడుతూ ప్రజలలో పెంపొందిన ప్రభుత్వ వ్యతిరేకతను సొమ్ము చేసుకొని 2018 చివర్లో కాంగ్రెస్ పార్టీ రాష్ట్రంలో అధికారాన్ని చేపట్టింది. కాంగ్రెస్ అధికారానికి వచ్చిన అతి కొద్ది మాసాలలోనే బీజాపూర్ జిల్లా తాడిబల్ల గ్రామంలో 2019 ఫిబ్రవరి 7 నాడు పది మంది ఆదివాసీ పిల్లలను నిర్దాక్షిణ్యంగా పోలీసులు, డీఆర్ గూండాలు కాల్చి చంపారు. ఆ మారణకాండపై వెంటనే శవాల స్వాధీనానికి వేల సంఖ్యలో ప్రజలు తరలివెళ్లి బీవులో తమ నిరసనను తెలిపారు. ఇక అవే ఓటుబ్యాంకు రాజకీయాలతో తాడిబల్లలో జరిగింది బూటకపు ఎన్‌కౌంటర్ అంటూ కాషాయ దండు రంగంలోకి దిగింది. ఆ హత్యాకాండపై ఏ దాతూ లేదు, దర్యాప్తూ లేదు. దానితో తాడిబల్ల ప్రజలు మేమింక భరించలేమంటూ జిల్లాలో రగులుతున్న ప్రజా పోరాటాలలో భాగమయ్యారు.

2022 ఫిబ్రవరి 7నాడు తాకిలోడ్ గ్రామంలో 25 వేలకు పైగా మూలవాసీ ప్రజలు సమావేశమై 'మీ ప్రహార్ 1, 2, 3లు కాదు, మా ప్రాణాలు కాపాడండి, దోషులైన పోలీసులను శిక్షించండి' అంటూ

డిమాండ్ చేశారు. ఈ భారీ ప్రజా సభకు అనేక మంది సామాజిక కార్యకర్తలు, హక్కుల కార్యకర్తలు చేరుకొని తమ సంఘీభావాన్ని ప్రకటించారు. ఈ సభకు సామాజిక కార్యకర్త సోనీ సోడి హాజరై ప్రజల వాణిని వినిపించింది. ఆ వెనువెంటనే ఆవిడ సుక్మా జిల్లాకు చేరుకున్న రాహుల్ గాంధీ సరసన నిలిచి ఫొటోలు దిగి, ఢిల్లీలో ప్రియాంకను, సోనియమ్మను కలువపోనున్నదనే వార్తలు మీడియాలో వైరల్ కావడం ఆమె ద్వంద్వ స్వభావాన్ని తెలుపుతున్నాయి. నిన్నటివరకు ఆదివాసులను దగా చేయడంలో అన్ని పార్టీల, అన్ని జెండాల వారు పోటీలు పడడం మనం చూశాం. కానీ, ఇపుడు ఎక్కడికక్కడే వివిధ పోరాట సంఘాలు, నవ యువతీ యువకులతో ఆవిర్భవించడం హర్షనీయం.

ఝార్ఖండ్‌లో జల్, జంగల్, జమీన్ కావాలంటూ, చోటా నాగపూర్ టెనెన్సీ ఆక్టును, సంతాల్ పరగణా టెనెన్సీ ఆక్టును సవరించకూడదంటూ అక్కడి ఆదివాసీ ప్రజలు గత దశాబ్ద కాలంగా పోరాడుతున్నారు. వారు తమ రాష్ట్రంలో పెసాను అమలు చేయాలని ప్రభుత్వాన్ని గట్టిగా డిమాండ్ చేస్తున్నారు. వారు గ్రామసభల సాధన కోసం గడ్‌చిరోలీలో జరిగిన ప్రజా ఉద్యమంతో ప్రేరణ పొంది తమ ప్రాంతాలలోని కుంతి మొదలైన జిల్లాలలో పతల్‌గఢీ ప్రజా పోరాటాన్ని ప్రారంభించారు. గడ్ చిరోలీలో పెసా కోసం అక్కడి ఆదివాసులు అత్యంత సమరశీలంగా మూడేళ్ళు ఉద్యమాన్ని నడిపి 2016 డిసెంబర్ 23, 24 తేదీలలో పెసా రజత సభను నిర్వహించి దేశవ్యాప్త ఆదివాసులను ఆహ్వానించారు. ఆనాటి ఆ సభ నిర్వాహకులలో ఒకరుగా ప్రస్తుతం ముంబాయిలోని తలోజా జైలులో బీకే 15 (16వ వ్యక్తి ఫాదర్ స్టాన్ స్వామికి చికిత్స అందనివ్వకుండా రాజ్యం హత్య చేసింది) లో భాగంగా ఉన్న మహేశ్ రౌత్ వ్యవహరించారు. దానికి నందినీ సుందర్ సహా 500 మంది జార్ఖండ్ సహా అనేక రాష్ట్రాల నుండి ఆదివాసీ నాయకులు, హక్కుల కార్యకర్తలు హాజరయ్యారు. ఆ సభలో జరిగిన రాజకీయ చర్చలు పతల్‌గఢీ మూలవాసీ ప్రజా పోరాట వెల్లువ ఛత్తీస్‌గఢ్, మధ్యప్రదేశ్, ఒడిశా, ఝార్ఖండ్ మున్నగు 5వ షెడ్యూల్డ్ ప్రాంతాలంతటా పోరు జ్వాలలను రగిలించాయి. గ్లాడ్‌సన్ డంగ్‌డంగ్ రిపోర్టు ప్రకారం ఝార్ఖండ్‌లోని కుంటి జిల్లా ముండా ఆదివాసీ లడూ నాగ్ (46)తో పాటు మరో 11 మందిపై 13 మార్చ్ 2018నాడు ముర్హు పోలీసులు భారత శిక్షా స్మృతిలోని సెడిషన్ చట్టం కింద కేసు నమోదు చేశారు. వారు పోలీసు స్టేషన్‌పై దాడికి ప్రజలను సమీకరిస్తున్నారనీ, పోలీసు స్టేషన్‌ను స్వాధీనం చేసుకునే కుట్రలు పన్నుతున్నారనీ ఆరోపించారు. కానీ, వారంతా పతల్‌గఢీ ప్రజా పోరాటానికి సంబంధించిన వారు. 9 ఫిబ్రవరి 2017 నాడు ఆదివాసీ మహాసభ నాయకత్వంలో పతల్‌గడీ ఉద్యమం కుంతి జిల్లా భండ్రా గ్రామంలో ప్రారంభమైంది. పతల్‌గఢీ ఉద్యమంతో దాదాపు 200 గ్రామాలలో గ్రామ సభల అధికారాలను 15×4 ఫీట్ శిలలపై రాసి గ్రామ గ్రామాన పాతారు.

1908 నాటి చోటా నాగపూర్ టెనెన్సీ ఆక్ట్, 1949 నాటి సంతాల్ పరగణా టెనెన్సీ ఆక్టు సవరిస్తూ ఝార్ఖండ్‌లోని కాషాయ రఘువర ప్రభుత్వం 2016 మేలో రెండు ఆర్డినెన్సెలను విడుదల చేయడంతో ప్రజలు తమ హక్కులను హరించివేసే ఈ రెండు దుర్మార్గ ఆర్డినెన్సులను ఖండిస్తూ ఉద్యమానికి పూనుకున్నారు. 23 నవంబర్ 2016తో ఆ ఆర్డినెన్సులకు కాలం చెల్లినప్పటికీ, రద్దుకు మూలవాసీ ప్రజలు ఉద్యమిస్తున్నప్పటికీ ఉక్కు పాదాలతో వాటిని అణచివేస్తూ తమకు ఉన్న మెజార్టీతో రఘువర దాస్ పార్టీ ఆ బిల్లులను తిరిగి విధాన సభలో ప్రవేశపెట్టి ఎలాంటి చర్చ లేకుండానే మూడే మూడు నిమిషాలలో ఆమోదముద్ర వేయించుకున్నది. ఆదివాసుల భూములు అన్యాక్రాంతం కావడానికి చట్ట ప్రకారం ఉన్న అడ్డులన్నీ ఈ సవరణలతో తొలగిపోయాయి. ఈ సవరణల వెనుక ప్రేరక చర్యగా ఆ రాష్ట్ర ప్రభుత్వం 2010లో విశ్వ మదుపుదారుల సమావేశం (గ్లోబల్ ఇన్వెస్టర్స్ సమిట్) నిర్వహించి రు. 3.10 లక్షల కోట్ల పెట్టుబడులతో 210 ఎంఒయూలు కుదుర్చుకున్నదనే విషయాన్ని గుర్తు పెట్టుకోవాలి. 2.1 మిలియన్ హెక్టార్ల భూములు ఎంఒయూల కోసం కార్పొరేట్ వర్గాల వశమవుతాయనేది, అప్పటి వరకు ఆ చట్టాలు అందుకు ఆటంకంగా, ఆదివాసులకు అనుకూలంగా నిలిచాయనేది ఒక వాస్తవం. అందుకే సామ్రాజ్యవాద ఆర్థిక విధానాల ముందు ఏ మానవ ముఖాన్ని సంతరించుకున్న చట్టమైనా బుట్టదాఖలా కావలసిందేనని ఈ సవరణలు తేటతెల్లం చేశాయి.

పతల్‌గఢీ ఉద్యమంలో పాల్గొన్న ముండా, ఉరావ్, సంతాల్ తెగలకు చెందిన 11,776 మంది ఆదివాసీ ప్రజలపై ఝార్ఖండ్ ప్రభుత్వం రాజద్రోహ కేసును మోపింది. వారిలో స్వాతంత్ర్య సమరయోధుడు, బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమ నాయకుడు బిర్సా ముండా నిర్వహించిన ఉల్ గులాన్ (విప్లవోద్యమం) వారసులు. అనేక వేల మంది ఆదివాసీ ప్రజలకు, తన కాషాయ ఉగ్రవాద సోదరుడు రఘువర దాస్ హయాంలో కటకటాలపాలైన వారికి మోదీ కనీసం క్షమాపణలైనా చెప్పకుండా, భగవాన్ బిర్సాముండా అంటూ ఆయనను కొనియాడుతూ ఆయన జయంతిని ఆదివాసీ గౌరవ దినంగా ప్రకటించడం నిజంగా క్షమించరాని నేరం. ఆ ఆదివాసీ ప్రజల పక్షం నిలిచి కుంటి, సరయిఖీలా, పశ్చిం సింగ్‌భూమ్ జిల్లాలకు చెందిన ఆదివాసుల కేసులన్నీ బూటకమని నిరూపిస్తూ ప్రపంచానికి తన రాతలతో చాటిన ఫాదర్ స్టాన్‌స్వామిని హిందుత్వ శక్తులే కటకటాల వెనుక హతమార్చాయి. ఆ నేరానికి శిక్ష పొందాల్సిన నేరస్థ అధికారులు, వారి పాలకులు ఆదివాసులకు గౌరవ దినాలు ప్రకటించడం వారి పోరాటాలను నీరుగార్చడానికే తప్ప మరేం కాదు.

వివిధ ప్రాంతాలలోని ఆదివాసుల పోరాటాలను, వారి డిమాండ్లను కాలరాచివేస్తూ గౌరవ దినాన్ని ప్రకటించడం ఆదివాసుల పోరాటాలను మరింత తీవ్రతరం చేయాలనే పట్టుదలనే పెంచుతాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఇప్పటికే మన దేశ బ్రాహ్మణవాదులు తమ కౌటిల్య నీతితో వేదాలను, బ్రాహ్మణవాదాన్ని దునుమాడిన బుద్ధుడిని దశావతారాలలో కలిపేసుకున్నారు. ఇపుడు బిర్సాముండాను భగవాన్ అంటున్నారంటే ఆయన అస్తిత్వాన్ని రూపుమాపడానికే తప్ప మరొకందుకు కాదు. ఆదివాసీ ప్రజా వీరులను లేని భగవంతుడి సరసన చేర్చడం అంటే అది బ్రాహ్మణ చాణక్యనీతికే చెల్లుతుంది. రేపు పొద్దున ఈ దుర్మార్గులు బాబాసాహెబ్ అంబేద్కర్‌ను భగవంతున్ని చేసి భవిష్యత్తరాలకు ఆయన ఉనికినే లేకుండా చేసినా ఆశ్చర్యం ఏం ఉండదు. అందుకే డాక్టర్ అంబేద్కర్ భారతదేశంలో పెట్టుబడిదారీ విధానంతో, బ్రాహ్మణ

# రజనీ పామీదత్ - 'ఫాసిజం - సామాజిక విప్లవం'

**అనువాదం: రవీంద్రనాథ్ సూరి**

*(...గత సంచిక తరువాయి భాగం)*

ఒక పదునైన సమస్య ప్రస్తుత సమాజానికి ఎదురవుతున్నది. ఘటనలు అమిత వేగంతో కదలుతున్నాయి. సాంప్రదాయిక ఆలోచనా విధానం పాతకాలపు అవశేషాలను పట్టుకొని వేలాడుతూనే వున్నది. విశాల ప్రాంతంలో ఫాసిజం విజయ పురోగమనం కోట్లాది ప్రజలకు పిడుగు పాటయ్యింది. అయితే ఫాసిజం అకస్మాత్తుగా పుట్టుకొచ్చిందేమీ కాదు. యుద్ధానంతరం పదిహేనేళ్ల కాలంగా జరిగిన సామాజిక అభివృద్ధి ఫాసిజాన్ని పొదుగుతూ వచ్చింది.

మనుగడలో ఉన్న సామాజిక రూపాలను, వాటి కొనసాగింపును సవాలు చేయరానివిగా శిరసావహిస్తున్న వారందరికీ, అంతకంటే ఎక్కువగా మనుగడలో ఉన్న సామాజిక రూపాల పరిధిలోనే శాంతియుత ప్రగతిశీల పురోగమనం సాధ్యమేనంటూ ఆశగా ఎదురుచూపులు చూసేవారికి, విప్లవాత్మక దృక్పథం పిడికెడుమంది అల్పసంఖ్యాకుల ఊహ అని కొట్టిపడేసే వారికి, ఫాసిజం, ప్రత్యేకించి జర్మనీ లాంటి అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశంలో విజయం సాధించడం పిడుగుపాటు లాగా పరిణమించింది. మన కాలంలో పట్టి పీడిస్తున్న సమస్యల పట్ల కనువిప్పు కలిగిస్తే అది ఆహ్వానించదగిన పిడుగుపాటే.

1914 ప్రపంచ యుద్ధం ఇప్పటికే సంకేతం ఇచ్చినట్టి పశ్చిమ యూరప్, అమెరికాలలో జరగాల్సిన సామాజిక విప్లవం, అంటే అనివార్యంగా పెరిగే వైరుధ్యాలను, వినాశనాన్ని, నేటి ఆటవికతను ఉత్పత్తి చేస్తున్నట్టి ఉత్పత్తి వనరులపై వ్యక్తిగత యాజమాన్యాన్ని అంతంచేసే సామాజిక విప్లవం, ప్రతి సంవత్సరం, ప్రతి నెల అలస్యమవుతూ, నిరాకరించబడుతూ, వాయిదా వేయబడుతూ ఉంటే, ప్రపంచ పరిస్థితి మరింత ప్రమాదకరంగా తయారై మొత్తం సమాజం మనుగడయే ప్రశ్నార్థకంగా తయారైంది.

1914 ప్రపంచ యుద్ధ, 1917లో ప్రపంచ సోషలిస్ట్ విప్లవారంభం, యుద్ధానంతరం వచ్చిన పాక్షిక విప్లవాలు, ప్రజా

---

వాదంతో పోరాడాలనీ ఆ రెండు శ్రామిక వర్గాల శత్రువులనీ చాలా స్పష్టంగా తెలిపాడు. 1935లోనే ఆయన హిందూ(త్వ) ఫాసిజం గురించి హెచ్చరించాడు.

మనదేశ బ్రాహ్మణీయ పాలకవర్గాలు లేదా 'ఆర్యపుత్రులు' జనాభాలోని 8.6 శాతం ఆదివాసులను మూలవాసులుగా గుర్తించడానికి సిద్ధంగా లేనపుడు ఇక వారికి దక్కే గౌరవం ఎక్కడిది! ఈ విషయంలో ఆదివాసీ శ్రేయోభిలాషి ఇఎఎస్ శర్మ ఆంధ్రప్రదేశ్ ఆదివాసీ అభివృద్ధి కమీషనర్ రాజ్యాంగంలోని ఐదవ షెడ్యూల్ లో పేర్కొన్న 5వ పేరా ప్రకారం అన్ని రాష్ట్రాలు తమ చట్టాలను సవరించుకోవాలనే విషయాన్ని ఈ సందర్భంగా గుర్తుచేస్తున్నారు. ఆ పేరా రూపొంది 70 ఏండ్లు గడిచిపోయినా ఆదివాసులకు న్యాయం దక్కలేదని తెలుపుతున్నారు. మోదీ ప్రభుత్వం సవరణలు తలపెట్టిన వర్తమాన అటవుల (సంరక్షణ) చట్టం కూడా వాటిని పరిగణనలోకి తీసుకోలేదంటున్నారు. అలాగే కేంద్ర చట్టాలు పెసా (పంచాయతీల (షెడ్యూల్డ్ ప్రాంతాలకు విస్తరణ) చట్టం, 1996 తో పాటు ఆదివాసులు, ఇతర సంప్రదాయ అడవివాసుల (అటవీ హక్కుల గుర్తింపు) చట్టం, 2006లకు ఏ గతి పట్టిందో గుర్తుచేస్తున్నారు. ఛత్తీస్‌గఢ్, ఝార్ఖండ్, ఒడిశాలలో ఇటీవలే పెసా, అటవీ హక్కుల చట్టాలను ఉల్లంఘిస్తూ అక్కడి ప్రభుత్వాలు బొగ్గుగనులను, ఇతర గనులను వేలం వేయడాన్ని తప్పు పడుతున్నారు. గతంలో గనుల చట్టాలలో చేసిన సవరణలు కూడ తప్పే అంటున్నారు. మరోవైపు ఛత్తీస్‌గఢ్ గవర్నర్ ఆదివాసీ మహిళా అనసూయ ఉయికే రాష్ట్రంలో ఆదివాసులు తమ హక్కుల సాధన కోసం సంఘటితంగా పోరాడాలనీ, 2022లో వారికి పెసా ప్రకారం జల్, జంగల్, జమీన్‌పై హక్కులు ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం కల్పించని పక్షంలో తాను మహారాష్ట్రలో చేపట్టిన చర్యలను చేపట్టక తప్పదని హెచ్చరిస్తున్నారు. నిజానికి ఈ వ్యవస్థలో గవర్నర్ల నిస్సహాయతను ప్రకటించడమే ఇది.

మోదీకి, ఆయనకు దిశానిర్దేశనం చేస్తున్న కార్పొరేటు వర్గాలకు ఈనాడు మన దేశంలోని అడవులు కావాలి. అడవులలోని అపార సంపదలు కావాలి. వారు ఎదుర్కొంటున్న సంక్షోభం నుండి బయటపడడానికి వారికి అడవులు, గనులు, జలాశయాలు కావాలి. అంతకు ఎంతటి బీభత్సానికైనా వారు వెనుకాడరు. అందుకోసం వారు అనేక విధాలుగా ప్రయత్నిస్తున్నారు. వారు సల్వాజుడుంలను సృష్టిస్తున్నారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్లను ముందుకు తెస్తున్నారు. అవేవీ కానపుడు ఆపరేషన్ సమాధాన్‌కు దిగారు. వాటినీ ప్రజలు ఎదుర్కొంటుంటే కర్కశమైన ప్రహార్‌లను ప్లాన్ చేస్తున్నారు. మరోవైపు ప్రజల సొమ్ముతో కొనుగోలు చేసిన రకరకాల రంగురంగుల సంస్కరణలు అమలు చేస్తున్నారు. కోరని వరాలు ప్రకటిస్తూ సరుకులు పంపిణీ చేస్తున్నారు. వాటికి పరాకాష్టగా ఏకంగా దేశ ప్రధానే గౌరవదినం ప్రకటించాడు. కానీ, వారి నెత్తుటి బాకీ తీరేదెలా! ప్రజల పోరాటాల ద్వారానే వారికి వారి అడవులపై హక్కులు సాధ్యపడుతాయనీ, ఆ హక్కులు లేకుండా అన్ని హుళక్కేనని పడియోర పోరాటాల వారసులుగా ఆదివాసులు పోరాడాలి. తుది విజయాల వరకు పోరాడాలి. లఢేంగే, జీతేంగే ఇది నేటి నినాదం. ప్రజలకు గౌరవం ప్రజా పోరాటాలతోనే సాధ్యం. అది సానుభూతితో ప్రకటిస్తే వచ్చేది కాదు. అది పోరాడి గెలుచుకోవాలి.

*(అయిపోయింది)*

*(రచయిత ఆదివాసి సామాజిక కార్యకర్త)* వీ

పోరాటాలు, యుద్ధానంతర గందరగోళ పరిస్థితి, 1929 తరువాత ప్రపంచ ఆర్థిక సంక్షోభం, నేడు ఫాసిజం విజయం, పురోగమనం, రెండవ ప్రపంచ యుద్ధం వైపుగా పడుతున్న అడుగులు– ఇవీ వరుసగా వినిపిస్తున్న హెచ్చరికలు, వాస్తవాలు.

గత పన్నెండు సంవత్సరాలుగా, ప్రత్యేకించి రెండు సంవత్సరాలుగా ఫాసిజం విపరీతమైన చర్చలకు, సాహిత్యానికి విషయమైంది. అయినప్పటికీ చర్చలు ఫాసిజం ప్రాముఖ్యతను పూర్తిగా వెలికి తీసుకొనిరాలేదు.

ఒకవైపున ఫాసిజం, పాశవికత, హింస, సైనికవాదం, అణచివేత, జాతీయ అహంకారం, జాతి వివక్షత, సంస్కృతిపై తిరుగుబాటు, పాత నినాదాలైన స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం పట్ల వ్యతిరేకతల వ్యక్తీకరణ అని చాలా మంది భావిస్తున్నారు.

మరొక వైపున ఫాసిజం జాతీయ పునరుజ్జీవం, యువత ఆవిర్భావం, కుళ్లిన ఉదారవాదం, బుద్ధిజీవి వాదాల అంతంగా, సమతులవ్యవస్థీకృత సామాజిక నిర్మాణం వైపు ముందడుగుగా భావించేవారూ ఉన్నారు.

ఫాసిజం నిజ స్వభావాన్ని అర్థం చేసుకోవాలంటే మరింత లోతుకు వెళ్ళి, ఆధునిక సామాజిక అభివృద్ధి లక్షణాల వ్యక్తీకరణా ప్రతిఫలనమూ అయిన ఫాసిజంకు ఈ సామాజిక అభివృద్ధితో గల సంబంధాన్ని, అంతకంటే ముఖ్యంగా సామాజిక రాజకీయ రూపాల ప్రతిబింబమైన, సమాజ పురోగమనం, ఆర్థిక వ్యవస్థా సాంకేతికతల చోదక శక్తుల విశ్లేషణ చేయాలి. నిజానికి ఫాసిజం కూడా వీటి వ్యక్తీకరణే.

అలాంటి విశ్లేషణ, ప్రస్తుతం మనుగడలో ఉన్న పెట్టుబడిదారీ రూపాలు సాంకేతిక నైపుణ్యం, ఉత్పాదక శక్తుల ఆధునిక అభివృద్ధిని, వినియోగాన్ని మరింత ముందుకు తీసుకొని వెళ్లలేనంత స్థాయికి అభివృద్ధి చెందాయని మనకు తేటతెల్లం చేస్తుంది. వాటి మధ్య యుద్ధం జరుగుతున్నది, రోజురోజుకూ హింసాత్మకంగా తయారవుతూ 1914 నుండి బహిరంగంగా ముందుకు వచ్చి, ఇప్పుడు ప్రపంచ ఆర్థిక సంక్షోభపు సరికొత్త తీవ్ర దశలోకి ప్రవేశిస్తూ ఉన్నది. ఏదో ఒకటి మరొక దాన్ని అంతం చేయాలి. అయితే ఉత్పత్తి శక్తుల పురోగమనం పెట్టుబడిదారీ విధానాన్ని అంతం చేయాలి, లేదా పెట్టుబడిదారీ విధానపు మనుగడ ఉత్పత్తి, సాంకేతికతల పురోగమనాన్ని అంతం చేసి, వెనకకు మళ్లించడమైనా మొదలు పెట్టాలి. వాస్తవానికి సోవియట్ యూనియన్ బయట ఉన్న ప్రపంచంలో, విప్లవం ఆలస్యం కావడంతో ఆ తిరోగమనం ఇప్పటికే ఆరంభమైంది.

ఈ రెండు మార్గాలు ప్రస్తుత సమాజం ముందు తెరవబడి ఉన్నాయి.

ఒకటి ఉత్పత్తి శక్తులను గొంతు నులిమివేసే ప్రయత్నం చేయాలి, అభివృద్ధిని అరికట్టాలి, పాదార్థిక మానవ శక్తులను నాశనం చేయాలి, అంతర్జాతీయ వినిమయానికి అడ్డుకట్ట వేయాలి, విజ్ఞాన శాస్త్ర అవిష్కరణలను అరికట్టాలి, ఆలోచనలను ఆలోచనా క్రమాల పురోగమనాన్ని నలిపి వేయాలి, పరస్పరం కలహించుకునే పరిమిత, స్వయం సమృద్ధ, తిరోగమనశీల, నిచ్చెనమెట్ల సమాజాన్ని వ్యవస్థీకృతం చేయడంపై కేంద్రీకరించాలి. ఒక్కమాటలో చెప్పాలంటే నేడున్న వర్గాధిపత్యాన్ని పదిలం చేసేందుకు సమాజాన్ని మరింత వెనక బడిన దశకు బలవంతంగా మళ్లించాలి. ఇదే ఫాసిజం మార్గం, అన్ని ఆధునిక దేశాలలో ఏలుబడిలో ఉన్న పెట్టుబడిదార్లు మళ్లుతున్న మార్గం, మానవ వినాశనపు మార్గం.

మరొక ప్రత్యామ్నాయం ఏమిటంటే, నూతన ఉత్పత్తి శక్తులను సామాజిక శక్తులుగా, మొత్తం ప్రస్తుత సమాజం పాదార్థిక ప్రాతిపదికను అతివేగంగా అమితంగా సమష్టి సంపదగా వ్యవస్థీకరించడమూ, దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని, అనారోగ్యాన్ని, వర్గ జాతి వేర్పాటును ధ్వంసం చేయడమూ, విజ్ఞాన శాస్త్రాన్ని సంస్కృతిని అమితంగా ముందుకు తీసుకొని వెళ్లడమూ, ప్రజలందరూ, భావి మానవాళి సమష్టి ముందంజలో తమవంతు కర్తవ్యాన్ని పరిపూర్తిచేయగలవారుగా, మొట్టమొదటి సారిగా తమ శక్తియుక్తులను సంపూర్ణంగా ఉపయోగించగల్గిన స్థాయికి చేర్చగల్గిన ప్రపంచ కమ్యూనిస్ట్ సమాజాన్ని వ్యవస్థీకృతం చేయడమూ. ఇదే కమ్యూనిజం మార్గం, ఉత్పత్తి శక్తుల సజీవ ప్రతినిధులైన, పెట్టుబడిదారీ విధానం వర్గాధిపత్యంపై విజయం సాధించగలిగిన ఏకైక వర్గమైన, ఈ కలను సాకారం చేయగల్గిన శ్రామిక ప్రజానీకం మరింతగా మళ్ళుతున్న మార్గం, ఆధునిక విజ్ఞాన శాస్త్రం, ఉత్పత్తి పురోగమనాలు సంభవం, అత్యవసరంగా మారుస్తున్న మార్గం, కలలో కూడా ఊహించలేని మానవజాతి భవిష్యదభివృద్ధిని సంభావ్య పరచే మార్గం.

ఈ ప్రత్యామ్నాయాలలో ఏది గెలుస్తుంది? మానవ సమాజాన్ని నేడు ఎదుర్కొంటున్న సూటి ప్రశ్న ఇది.

ఉత్పత్తి శక్తులు కమ్యూనిజం వైపు ఉన్నాయి గనుక కమ్యూనిజమే గెలుస్తుందని విప్లవ మార్క్సిజం నమ్ముతున్నది. కార్మికవర్గపు గెలుపుగా ఉండే కమ్యూనిజపు గెలుపు ఉనికిలో ఉన్న వైరుధ్యాల ఏకైక అంతిమ పరిష్కారంగా పరమ అనివార్యమని నమ్ముతున్నది. మేధావుల ఆలోచనలకు ఇప్పటికే గోచరమవుతున్న మరొక ప్రత్యామ్నాయపు చీకటి యుగాల పీడకలను ఇంకా ఓడించవలసే ఉందని, అంతర్జాతీయ కమ్యూనిజం వ్యవస్థీకృత శక్తులచే ఓడించబడుతుందని కూడా నమ్ముతున్నది.

కానీ ఈ అనివార్యత మానవ శక్తికిఅతీతమైనది కాదు. తద్భిన్నంగా మానవ శక్తి ద్వారానే వాస్తవ రూపం దాలుస్తుంది. అందుచేత ఫాసిజంకు వ్యతిరేకంగానూ, కార్మికవర్గ విజయం కోసమూ పోరాటం తక్షణ కర్తవ్యం, దీని పైననే మానవ సమాజపు భవిష్యత్తు ఆధారపడి ఉన్నది. సమయం ఎక్కువ లేదు, ప్రతి నిమిషం కూడా అమూల్యమైనదే.

చాలా మంది ఫాసిజం – కమ్యూనిజం ప్రత్యామ్నాయాలను ఇష్టపడరు, వాటిని పరస్పర విరుద్ధమైన తీవ్రవాద సమాంతరాలుగానే భావించి రెంటినీ తిరస్కరిస్తారు. ఇవి రెండు కాకుండా వర్గ పోరాటం లేకుండా, పెట్టుబడిదారీ ''ప్రజాస్వామ్యం'', ''ప్రణాళికా బద్ధ పెట్టుబడిదారీ విధానం'' వగైరాల ద్వారా శాంతియుత సామరస్యపూర్వక అభివృద్ధిని సాధించే మూడవ ప్రత్యామ్నాయం గురించి కలలు కంటారు.

ఈ మూడవ ప్రత్యామ్నాయపు కల వాస్తవానికి ఒక భ్రమే. అది

ఒకవైపున గత కాలపు అంటే ఉదారవాద పెట్టుబడిదారీ కాలపు భావనల ప్రతిధ్వని. అది సామ్రాజ్యవాద ఆరంభంతో ఇప్పటికే నశించిపోయింది. దాని పుట్టుకకు దారితీసిన పరిస్థితులు అంతరించి పోవడంతో, పెట్టుబడిదారీ ఆసాంతం కుళ్లిపోయిన ఈ దశలో, వర్గపోరాటం తీవ్రంగా చెలరేగుతున్న ఈ దశలో దాన్ని పునరుజ్జీవింప జేయడం ఇంకెంత మాత్రం సాధ్యం కాదు. సామ్రాజ్యవాద పశ్చిమ యూరోప్, అమెరికాలో కొన ఊపిరితో అమలవుతున్న ఛాయామాత్ర ప్రజాస్వామ్య రూపాలు తొలగించివేయబడి, మార్పులు చేర్పులకు లోనై మరింతగా బహిరంగ నియంతృత్వ, అణచివేత పద్ధతులు అమలవుతున్నాయి (కార్యనిర్వాహక అధికారాల పెంపు, పార్లమెంటు పాత్ర కుదింపు, అత్యవసర అధికారాల పెంపు, హింస, పోలీసు చర్యల విస్తరణ, వాక్ సభా స్వాతంత్రంపై అదుపు, సమ్మె హక్కుపై అదుపు, సమ్మెలు, ప్రదర్శనలపై హింసాత్మక అణచివేత, వీటన్నిటికీ తోడు కోటీశ్వరుల పత్రికల విష ప్రచారం, దొంగ వోట్ల కుహనా ఎన్నికలు). ముస్సోలినీ, హిట్లర్‌ల సమస్య కంటే అన్ని దేశాలలో ఫాసిస్ట్ రూపాల వైపు పెట్టుబడిదారీ విధానపు పయనం స్పష్టంగా కనబడుతున్నది.

మరొక వైపున, "ప్రణాళికాబద్ధ పెట్టుబడిదారీ" కలలు కనడం అంటే ఫాసిజం తార్కిక ఫలితాలను ఊహించకుండా, ఫాసిజం వెనక స్పృహలేని తడువులాటే. ఎందుకంటే, ఆచరణలో పరస్పర విరుద్ధమయిన "ప్రణాళికాబద్ధ పెట్టుబడిదారీ" లక్ష్యాన్ని సాకారం చేసుకోవడం ఫాసిజం బాటలోనే ఉత్పత్తి శక్తులపై, కార్మికవర్గంపై అణచివేత ప్రయత్నాల ద్వారానే సాధ్యం.

ఆ విధంగా మూడవ ప్రత్యామ్నాయం అనేది, అసలు ప్రత్యామ్నాయం కానేకాదు, వాస్తవానికి ఫాసిజం పురోగమనంలో భాగమే.

ఫాసిజం అనివార్యమేమీ కాదు. ఫాసిజం అనేది అన్ని దేశాలూ తప్పనిసరిగా దాటితీరాల్సిన పెట్టుబడిదారీ దశ ఏమీ కాదు. రష్యాలో జరిగినట్టుగా సామాజిక విప్లవం ఫాసిజాన్ని నివారించగలుగుతుంది. సామాజిక విప్లవం ఆలస్యమైతే ఫాసిజం అనివార్యమైతుంది.

ఫాసిజాన్ని ఎదిరించవచ్చు. ఫాసిజాన్ని ఎదిరించి ఓడించవచ్చు. భ్రమలు లేకుండా, సమస్యల పట్ల స్పష్టమైన అవగాహన ఉంటే ఫాసిజాన్ని ఎదిరించి ఓడించవచ్చు. ఫాసిజం పుట్టుకకు కారణాలు ప్రస్తుత సమాజంలోనే ఉన్నాయి. నశించి పోతున్న పెట్టుబడిదారీ విధానం ఫాసిజానికి జన్మనిస్తుంది. నశించిపోతున్న పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం ఫాసిజానికి జన్మనిస్తుంది. కార్మికవర్గ నియంతృత్వ విజయం ఒక్కటే, ఫాసిజం పుట్టుకకు గల కారణాలను తుడిచి వేయడమొక్కటే ఫాసిజానికి వ్యతిరేకంగా హామీ.

మునిగిపోతున్న నేటి సామాజిక వ్యవస్థ స్థానంలో స్థిర సామాజిక వ్యవస్థను స్థాపించే అవకాశాన్ని ఫాసిజం హామీ ఇవ్వటం లేదు. తద్భిన్నంగా, పెట్టుబడిదారీ వ్యవస్థ కుళ్లిపోతున్న కాలానికి చెందిన ఏకైక రూపం, ఆధారం అయిన ఫాసిజం, పెట్టుబడిదారీ వర్గ వ్యవస్థలోని వైరుధ్యాలను ఇంకా ముందుకు తీసుకొని వెళుతుంది. అంతే కాదు, ఫాసిజం ప్రస్తుత వర్గ సమాజంలోని వైరుధ్యాలను అతి తీవ్ర స్థాయికి తీసుకొని వెళ్తుంది. అంటే వైరుధ్యాలు అంతర్యుద్ధం రూపంలో బహిర్గతమై, మొత్తం పెట్టుబడిదారీ రాజ్య వ్యవస్థ అంతా శాశ్వత అంతర్యుద్ధ ప్రాతిపదిక పైన వ్యవస్థీకృతమై ఉంటుంది. ఆ విధంగా ఫాసిజం అంటేనే అంతర్యుద్ధం. ఈ ప్రాతిపదిక మీద, నేటి సామాజిక సమస్యలకు ఫాసిజం పరిష్కారం కాకపోగా, అంతిమ విస్ఫోటన దశకు వెళ్లిన ఆ వైరుధ్యాల అతి తీవ్ర రూపం అని చెప్పవచ్చు. అంతిమ ఫలితం కమ్యూనిజం విజయం అని చెప్పవచ్చు. ఎందుకంటే వైరుధ్యాల పరిష్కారం కమ్యూనిజంలోనే ఉన్నది.

కానీ పోరాటం, పోరాట విజయం మధ్య నుండే కాలం దీర్ఘంగా కొనసాగితే, ఫాసిజం ఆ కాలాన్ని తన హింసాత్మక అభివృద్ధి నిరోధక నియంతృత్వానికి, అంతర్యుద్ధానికి పునాదిగా చేసుకోవటంలో విజయవంతమైతే, లెక్కించలేనంతగా భౌతిక సంపద నష్టం, ప్రాణ సాంస్కృతిక నష్టాలు జరగవచ్చు, ఇది అందరినీ అమితంగా భయపెడ్తున్నది. అంతిమంగా కమ్యూనిజం అనివార్య విజయం కోసమే కాకుండా, త్వరిత విజయం కోసం కూడా పోరాడటం మన ముందున్న జీవన్మరణ అవసరం.

ప్రస్తుత సమస్యల తీవ్రతను నొక్కి చెప్పాల్సిందేమీ లేదు. రాబోతున్న తుఫాను గురించి అందరికీ తెలుసు. యుద్ధం, ఆయుధీకరణ, ఫాసిజం, ఆర్థిక సంక్షోభం వగైరా సమస్యలపై చర్చ జరుగుతూనే ఉన్నది. వీటిని విడివిడిగా చూడకూడదు. వాటిని మొత్తం సామాజిక పురోగమనంలో భాగంగా, ఈ వ్యక్తీకరణలన్నిటికి ఆధారభూతమైన సమస్యలో భాగంగా, పెట్టుబడిదారీ లేక కార్మిక వర్గ పాలన సమస్యగా, పెట్టుబడిదారీ, సోషలిజం సమస్యగా చూడాలి. దీని పైనే మానవజాతి భవిష్యత్తు ఆధారపడి ఉన్నది.

ప్రస్తుత సమాజం సోషలిస్ట్ విప్లవానికి పరిపక్వంగా ఉన్నది. ఆలస్యం అయితే నిష్క్రియగా ఎదురు చూడాలని కాదు. స్థిరంగా ఉండటం గతితార్కిక వాస్తవం కాదు. ఆలస్యం అయితే విస్తరించేవి వినాశనం, అటవికతలే. అక్టోబర్ విప్లవం ముంగిట "ఆలస్యం అయితే మరణమే" అన్న లెనిన్ మాటలు ప్రస్తుత కాలానికి చక్కగా వర్తిస్తాయి.

*(ఇంకా ఉంది)* వీ

**సంస్మరణ**

**ప**త్రికా రచయిత, సాహిత్యకారుడు, తెలంగాణ అధికార భాషా సంఘం అధ్యక్షులు దేవులపల్లి ప్రభాకర రావు (84) ఏప్రిల్ 21న హైదరాబాద్‌లో గుండెపోటుతో మరణించారు. వరంగల్ కు చెందిన దేవులపల్లి ప్రభాకర్ రావు రాష్ట్రప్రభుత్వ సమాచార శాఖలో, వైద్య శాఖలో పని చేస్తూనే 1960 నుంచి వివిధ దినపత్రికల్లో రచనలు చేశారు. ఆంధ్ర ప్రదేశ్ మాసపత్రికకు సంపాదకుడిగా ఉన్నారు. 1969 తెలంగాణ ఉద్యమంలో క్రియాశీలంగా పనిచేశారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత మొట్టమొదటి అధికార భాషా సంఘం అధ్యక్షుడిగా ఎంపికయ్యారు. పారిజాతాలు, మహనీయులు, చెప్పుకోదగ్గ మనుషులు, మహాకవి గురజాడ వంటి అనేక పుస్తకాలు ప్రచురించారు.

# శ్రీలంక ఆర్థిక, ఆహార సంక్షోభం

*శ్రీలంక సమాజాన్ని అతలాకుతలం చేస్తున్న రాజకీయార్థిక సంక్షోభపు మూల కారణాలనూ, వ్యక్తీకరణలనూ వివరిస్తున్నారు* **డా. ఎ. పున్నయ్య**

పాలక వర్గాల మితిమీరిన స్వార్థ రాజకీయ విధానాల అనుసరణ ఒక దేశాన్ని ఎలా ఛిన్నాభిన్నం చేయగలదో ప్రస్తుత శ్రీలంక ని చూస్తే అవగతమవుతుంది. తనకు తాను పోషించుకునే స్థాయి నుండి మమ్మల్ని కాపాడండి మొర్రోయని ప్రపంచ దేశాల ముందు మోకరిల్లే పరిస్థితి దాపురించింది. భారత దేశానికి పొరుగున ఉన్నదేశంగా శ్రీలంకలో పాలకవర్గాల స్వయంకృతాపరాధాలే ఈదుస్థితి పరిణమించేలా చేశాయని అర్థమవుతుంది. ప్రధానంగా దేశీయ అవసరాల కోసం ఐఎంఎఫ్‌ను ఆశ్రయించడం, ప్రపంచీకరణ విధానాలు, దేశంలో జాతుల మధ్య కొట్లాటలతో జరిగిన అంతర్యుద్ధం, ఆర్థిక క్రమశిక్షణా రాహిత్యం, అప్పులు, మారిన వ్యవసాయ విధానం, దిగుమతుల మీద ఆధారపడడం, ఇంధన కొరత, శిథిలమైన పర్యాటకరంగం, అసంబద్ధ రాజకీయ విధానాలే శ్రీలంకను ఉక్కిరి బిక్కిరి చేసి కోలుకోలేని ఆర్థిక సంక్షోభ ఉచ్చులో చిక్కుకునేలా చేశాయి.

కేవలం 2.2 కోట్ల జనాభా ఉండే శ్రీలంక చిన్న ద్వీప దేశం. ఇప్పుడు ఎన్నడూ లేనంత తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. ఆర్థిక సంక్షోభంలో చిక్కుకున్న శ్రీలంకలో ప్రజలు నేడు నిత్యావసరాల కోసం గంటల తరబడి బారులు తీరాల్సి వస్తోంది. ఆహారపానీయాలు దొరక్క జనం విలవిల్లాడుతున్నారు. కేజీ బియ్యం ధర భారత కరెన్సీలో రూ.220కాగా, గోధుమల ధర రు. 190కి చేరింది. చక్కెర కేజీ రు. 240, కొబ్బరి నూనె లీటరు ధర రు. 850, ఒక కోడిగుడ్డు రు. 30, కేజీ మిల్క్ పౌడర్ ధర రు. 1,900గా ఉంది. రోజూ చేసుకునే వంటల్లో ఉపయోగించే ఎండు మిర్చి ధర గత ఏడాదితో పోలిస్తే 190 శాతం పెరిగింది. 2021 ఏప్రిల్లో 55 రూపాయలుగా ఉన్న కేజీ ఆపిల్ పండ్ల ధరలు ప్రస్తుతం రెట్టింపు అయ్యాయి. పెట్రోల్, డీజిల్ దొరకడం లేదు. విద్యుత్ స్టేషన్లు మూత పడ్డాయి. కాగితం లేక వివిధ కోర్సులు అభ్యసిస్తున్న విద్యార్థుల పరీక్షలను రద్దు చేశారు. నేడు ఈ అసాధారణ ఆర్థిక సంక్షోభం నుంచి బయట పడేందుకు దేశ సర్కార్ పడరాని పాట్లు పడుతున్నది.

### శ్రీలంక గత చరిత్ర:

శ్రీలంక బ్రిటన్‌కు వలసగా ఉన్నకాలంలో యూరోపియన్ మార్కెట్ల అవసరాలు తీర్చడం కోసం వ్యవసాయం స్వభావాన్ని మార్చివేశారు. ఆహార పంటల స్థానంలో కాఫీ, రబ్బరు, తేయాకు తోటలను పెంచడం అప్పుడే మొదలైంది. 1948లో శ్రీలంకకి స్వతంత్రం వచ్చేసరికి ఈ మూడు పంటల ఎగుమతుల ద్వారా వచ్చే ఆదాయం ఆ దేశపు జీడీపీలో మూడో వంతుగా ఉండేది. అదే సమయంలో ఆహార ధాన్యాలు, పప్పు దినుసులు, పాలు, చక్కెర వంటి ప్రజావసరాలను విదేశాల నుండి దిగుమతి చేసుకోవలసి వచ్చేది. వ్యాపార పంటల తోటలన్నీ వలసపాలకుల యాజమాన్యం కింద ఉండటం వలన దేశ సంపదలో ఎక్కువ భాగం విదేశాలకు తరలిపోయేది. అందువలన దేశీయంగా పరిశ్రమలను స్థాపించడానికి అవసరమైన పెట్టుబడి పోగుపడడం సాధ్యం కాలేదు. స్వాతంత్ర్యం వచ్చేనాటికి శ్రీలంక పారిశ్రామికంగా వెనుకబడిపోయింది. 1950 దశకం వరకూ అంతర్జాతీయంగా శ్రీలంక వ్యాపార పంటలకు గిరాకీ ఉండటం వలన విదేశీ వ్యాపారంలో మిగులు ఉండేది. ఆ వ్యాపారం మీద ప్రభుత్వానికి సమకూరే పన్ను రాబడితో ప్రభుత్వం ప్రజలకు ఉచిత విద్య, వైద్యం, సబ్సిడీ ధరలకు ఆహార ధాన్యాలు అందించగలిగేది.అందువల్ల ప్రజల తలసరి ఆదాయం స్థాయి తక్కువగా ఉన్నా మానవాభివృద్ధి సూచికలలో శ్రీలంక ముందుకే పురోగమించగలిగింది.

### శ్రీలంకలోకి ఐఎంఎఫ్ రంగప్రవేశం:

1960 దశాబ్దం నాటికి పరిస్థితులు మారిపోయాయి. శ్రీలంక వ్యాపార పంటల ధరలు పడిపోయాయి. కాని దిగుమతుల ధరలు మాత్రం పెరిగిపోసాగాయి. 1965–66 నాటికి శ్రీలంక విదేశీ చెల్లింపుల లోటులో పడిపోయింది. ఆ పరిస్థితిలో అనివార్యంగా పాలకులు ఐఎంఎఫ్ ను సంప్రదించగా ఐఎంఎఫ్ అప్పుతోబాటు అనేక షరతులను విధించింది. 1970 తర్వాత అధికారంలోకి వచ్చిన సిరిమావో బండారునాయకే ప్రభుత్వం ఈ విధానాల నుండి వెనక్కి మళ్ళే ప్రయత్నం చేసింది. భూసంస్కరణలను చేపట్టింది. పరిశ్రమలను జాతీయం చేయడానికి పూనుకుంది. సంక్షేమరంగాలకు కేటాయింపులు పెంచింది. ఈ మార్పును ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు తీవ్రంగా విమర్శించాయి. ఇదే సమయంలో 1973లో చమురు ధరలను చమురు ఉత్పత్తి చేసే దేశాలు ఒక్కసారిగా పెంచివేశాయి. దీంతో శ్రీలంక విదేశీ మారక నిల్వలు కరిగిపోయాయి. పారిశ్రామిక ఉత్పత్తి స్తంభించిపోయింది. నిత్యావసర సరుకులన్నీ దిగుమతి చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ ప్రతికూల పరిస్థితులను పాలకపక్షం తట్టుకోలేపోయింది.

### ప్రపంచీకరణ విధానాలు:

ఆర్థిక పరిస్థితిని మెరుగుపరుచుకోవడానికి ప్రభుత్వం 1977నుంచీ ప్రపంచీకరణ విధానాలను ప్రారంభించింది. దీనితో పాటుగా 1977 నుండి 1984 మధ్య మూడు సార్లు ఐఎంఎఫ్ నుండి రుణాలు తీసుకుంది. ఐఎంఎఫ్ షరతులకు శ్రీలంక రూపాయి విలువను తగ్గించడం, ధరలమీద నియంత్రణలు ఎత్తివేయడం, సబ్సిడీల కోత, వేతనాల కోత, ప్రయివేటు సంస్థలను ప్రోత్సహించడం వంటి చర్యలు అమలు చేసింది. ఫలితంగా ప్రజల జీవన ప్రమాణాలు దారుణంగా పడిపోవడం మొదలైంది. తలసరి ఆహార లభ్యత తగ్గిపోయింది. దీనితో ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా

కార్మికోద్యమాలు తీవ్రమైనాయి.

**శ్రీలంకలో అంతర్యుద్ధం:**

కార్మికోద్యమాల ఫలితంగా 1983లో తీవ్రమైన అంతర్యుద్ధం మొదలైంది. తమిళ ఉద్యమాన్ని సైనిక బలగాలతో హింసాత్మక పద్ధతుల్లో అణచివేశారు. ఆనాటికి శ్రీలంక పొదుజన పెరుమన పార్టీ నాయకుడిగా మహింద రాజపక్స అధ్యక్షుడిగా ఉన్నాడు. అంతర్యుద్ధంతో చితికిపోయిన దేశ ఆర్థిక వ్యవస్థను సరిదిద్దడానికి మళ్లీ ఐఎంఎఫ్ వద్ద రుణానికి సిద్ధపడ్డాడు. ఈ అంతర్గత పరిస్థితులకు 2008లో తలెత్తిన అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభం తోడైంది. అంతర్యుద్ధం తదనంతరం యథావిధిగా ఐఎంఎఫ్ మరోసారి షరతులతో కూడిన రుణాన్ని ఇచ్చింది. ఐఎంఎఫ్ షరతుల కారణంగా ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థలో జోక్యం కల్పించుకోగలిగిన శక్తిని కోల్పోయింది. మళ్లీ విదేశీ మారకద్రవ్య నిల్వలు కరిగిపోయాయి. 2016లో మరోసారి ఐఎంఎఫ్ రుణానికి దరఖాస్తు చేసింది శ్రీలంక ప్రభుత్వం. 2016లో తీసుకున్న రుణం పదహారోది. యథావిధిగా ఐఎంఎఫ్ షరతులతో కూడిన రుణాన్ని మంజూరు చేసింది. ఈ షరతులను అమలు చేసిన ఫలితంగా శ్రీలంక జీడీపీ వృద్ధి రేటు 2015 నాటికి 5 శాతంగా ఉన్నది కాస్తా 2019 నాటికి 2.9శాతానికి పడిపోయింది. ప్రభుత్వ ఆదాయాలూ పడిపోయాయి. ప్రభుత్వ రుణం విపరీతంగా పెరిగిపోయింది.

**ఆర్థిక సంక్షోభానికి ప్రధాన కారణాలు:**

ఒకవైపు సంపన్నులపై విధించిన పన్నులను బాగా తగ్గించినందువలన ప్రభుత్వ ఆదాయం భారీగా పడిపోయింది. ప్రపంచాన్ని ఉక్కిరిబిక్కిరి చేసిన కరోనా మహమ్మారితో పాటుగా 2019లో శ్రీలంకలోని చర్చిల్లో వరుస బాంబు పేలుళ్లు జరిగాయి. 250మందికి పైగా పౌరులు మరణించారు. దేశం దిగ్భ్రాంతికి గురైంది. పర్యాటక రంగం ఒక ప్రధాన ఆదాయ వనరుగా ఉన్న శ్రీలంకకు ఈ ప్రేలుళ్ళ తర్వాత పర్యాటకులు విదేశాల నుండి రావడం మానుకున్నారు. టూరిజం 71శాతం తగ్గిపోయింది. దాంతో విదేశీ మారక ద్రవ్యం రావడం తగ్గిపోయింది. 2019లో గొటబాయ రాజపక్స ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. పన్నులను తగ్గిస్తానని, రైతులకు రాయితీలు కల్పిస్తానని హామీలిచ్చి గెలిచాడు గొటబాయ రాజపక్స. పరోక్ష పన్నులతోబాటు పెట్టుబడిదారుల నుండి రాబట్టే ప్రత్యక్ష పన్నులను సైతం తగ్గించాడు. 200కోట్ల డాలర్ల మేరకు పన్ను రాబడి తగ్గింది. ఇది జీడీపీలో 2 శాతం. విదేశీమారక ఆదాయం పడిపోవడం, దేశీయంగా పన్ను రాబడి తగ్గిపోవడం ప్రభుత్వానికి రెండు పెద్ద ఆర్థిక షాకులుగా పరిణమించాయి. వీటికి కోవిడ్ మహమ్మారి తోడైంది. పరిస్థితి మరింత విషమించింది.

**ఆర్థిక అరాచకత్వం:**

శ్రీలంక ఆర్థిక వ్యవస్థ దశాబ్దాలుగా ఆర్థిక అవకతవకల సంక్షోభంలో కూరుకుపోయింది. ఎలాంటి ఆర్థిక క్రమశిక్షణా పాటించకుండానే లంక ప్రభుత్వాలు వరుసగా రుణాల మీద రుణాలను తీసుకుంటూ దేశాన్ని అప్పుల ఊబిలోకి దింపేశాయి. లంక విదేశీ రుణం 51 బిలియన్ డాలర్లకు చేరుకుంది. పైగా వడ్డీలు చెల్లించడానికి ఈ ఒక్క సంవత్సరంలోనే దాదాపు 7 బిలియన్ డాలర్లు అవసరం అవుతాయి. గత రెండేళ్ల కాలంలో దేశ విదేశీ మారక ద్రవ్య నిల్వలు దాదాపుగా 70 శాతం వరకు కరిగిపోయాయి. ఇప్పుడు శ్రీలంక విదేశీ మారక ద్రవ్యం కేవలం 2 బిలియన్ డాలర్లలోపు ఉందంటే ఆ దేశం ప్రస్తుతం ఎదుర్కొంటున్న విపత్కర పరిస్థితిని సులభంగా అర్థం చేసుకోవచ్చు. గత 15 సంవత్సరాలుగా శ్రీలంకలో కొనసాగుతూ వచ్చిన ఆర్థిక అవకతవకలు ప్రామాణికమైన ఆర్థిక సమస్యకు దారితీశాయి. అదేమిటంటే శ్రీలంక తన రాబడికి మించి ఖర్చుపెడుతూ వచ్చింది. పెరుగుతున్న లోటును సర్దుబాటు చేసుకోవడానికి అవసరమైన సరుకులు, సేవల ఉత్పత్తి కూడా సాధ్యపడలేదు. ఇటీవలి సంవత్సరాల్లో జరిగిన కొన్ని ఘటనలు ఈ వ్యవస్థీకృత ఆర్థిక సమస్యను మరింత విస్తృతం చేశాయి. కొన్ని బాహ్య కారణాలు కాగా, మరికొన్ని ప్రభుత్వ స్వయంకృతాపరాధం అనే చెప్పాలి.

**శ్రీలంకలో అప్పుల కుప్పలు:**

శ్రీలంక అప్పుల ఊబిలో కూరుకుపోతోంది. డిపార్ట్మెంట్ ఆఫ్ ఎక్స్టర్నల్ రిసోర్సెస్ ప్రకారం, ఆసియా అభివృద్ధి బ్యాంకు వంటి అంతర్జాతీయ సంస్థల తర్వాత శ్రీలంకకు, చైనా అతిపెద్ద రుణదాత. శ్రీలంక వద్ద ఉన్న విదేశీ మారక నిల్వల కంటే కూడా అప్పులే ఎక్కువ. అప్పులు పెరిగిపోతుండటంతో దేశం ఆర్థిక అత్యవసర పరిస్థితి దిశగా పయనిస్తోంది. శ్రీలంకలో ఆర్థిక సంక్షోభం తారాస్థాయికి చేరింది. విదేశీ చెల్లింపుల లోటు చెయ్యి దాటిపోయింది. విదేశీ మారక నిల్వలు అడుగంటాయి. పాత అప్పుల వాయిదాలను చెల్లించలేని పరిస్థితి. ఆహారం, చమురు, ఎరువులు వంటి అత్యవసర సరుకులను సైతం దిగుమతి చేసుకోలేకపోతోంది. దేశంలో వ్యవసాయం దిగజారిపోయింది. ఆకలి, పోషకాహార లేమి తీవ్ర సమస్యలుగా ఉన్నాయి. ద్రవ్యోల్బణం ఏకంగా 17.5శాతానికి చేరింది. ఈ తీవ్ర ఆర్థిక సంక్షోభానికి కారణం చైనా నుంచి అప్పులు తెచ్చి ఆ అప్పుల ఉచ్చులో ఇరుక్కోవడమేనని దేశంలో, ప్రపంచంలో ప్రధాన స్రవంతి మీడియా ప్రచారం చేస్తోంది. కాని వాస్తవాలేమిటి? శ్రీలంకకి ఉన్న మొత్తం అప్పులో చైనాది కేవలం 10శాతం వాటా మాత్రమే. ఏషియన్ డెవలప్మెంట్ బ్యాంక్ నుంచి, జపాన్ నుంచి, ఐఎంఎఫ్ నుంచి శ్రీలంక తెచ్చిన అప్పు ప్రధాన భాగం.

**దిగుమతుల దేశం:**

శ్రీలంక నేటికీ అధికంగా దిగుమతులపైనే ఆధారపడుతుంది. ఆర్గనైజేషన్ ఫర్ ఎకనామిక్ కో-ఆపరేషన్ అండ్ డెవలప్మెంట్ నివేదిక ప్రకారం, 2020లో శ్రీలంక 1.2 మిలియన్ డాలర్ల విలువ చేసే రిఫైన్డ్ పెట్రోలియంను దిగుమతి చేసుకుంది. ఫ్యాబ్రిక్స్, ఔషధాల కోసం వినియోగించే ముడి పదార్థాలు, గోదుమ నుంచి చక్కెర వరకు ఇలా అన్నింటినీ శ్రీలంక దిగుమతి చేసుకుంటోంది. 2020లో శ్రీలంక 214 మిలియన్ డాలర్ల విలువైన కార్లను దిగుమతి చేసుకుంది. అంటే శ్రీలంక దిగుమతుల్లో కార్లదే అగ్రస్థానం అనుకుంటే పొరపాటే. కేవలం కాన్సన్ట్రేటెడ్ పాలు దిగుమతి కోసమే లంక 305 మిలియన్ డాలర్లను వెచ్చించింది. చైనా, భారతదేశాలు శ్రీలంకకు అతిపెద్ద ఎగుమతిదారులు. ఇప్పుడు విదేశీ సహాయం అవసరం ఉండటంతో శ్రీలంక, సంక్షోభంపై పోరాడటానికి ఆర్థిక సహాయం అందించాలంటూ భారత్, చైనాలను సంప్రదించింది.

**ఇంధన కొరత తీవ్రంగా వేధిస్తోంది:**

శ్రీలంక మత్స్యకారులు చేపల వేటకు వెళ్లాలంటే డబ్బుల్లేవు. ఒక మర పడవకు సుమారు రూ.2.75 లక్షల విలువైన ఇంధనం

అవసరమవుతోంది. కానీ ఇప్పుడు దేశాన్ని ఇంధన కొరత తీవ్రంగా వేధిస్తోంది. ఇక మరో ప్రధాన ఆదాయ వనరైన తేయాకు ఉత్పత్తి 13 సంవత్సరాల కనిష్ఠ స్థాయికి పడిపోయింది. తేయాకు ఎగుమతుల ద్వారా శ్రీలంకకు ఏటా 1.3 బిలియన్ అమెరికన్ డాలర్ల ఆదాయం సమకూరేది. నిధుల లేమితో పలు దేశాల్లోని దౌత్య కార్యాలయాలను శ్రీలంక మూసివేస్తోంది. ఆదాయం కోసం ప్రభుత్వం రైలు ఛార్జీలను, పన్నులను భారీగా పెంచింది. దీంతో ప్రభుత్వం పట్ల ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతోంది. శ్రీలంకలో విద్యుదుత్పత్తి తీవ్ర సంక్షోభంలో పడింది. విద్యుత్ సరఫరా సరిగా లేకపోవడం వల్ల 14 స్వేచ్ఛా వాణిజ్య ప్రాంతాల్లోని పరిశ్రమలు మూతపడ్డాయి. ఫలితంగా 5 లక్షల మందికిపైగా కార్మికుల ఉపాధి గాలిలో దీపంలా మారింది. కరెంటు కోతల కారణంగా టీవీ ప్రసారాలు తక్కువ సమయమే ఉండటం వల్ల ప్రకటనలు నిలిచిపోయి, దృశ్య శ్రవణ మాధ్యమాలు తీవ్ర నష్టాల్లోకి జారుకున్నాయి. ఆన్లైన్ విద్యకు కూడా ఇక్కట్లు తప్పలేదు.

**సేంద్రియ వ్యవసాయం:**

సేంద్రియ వ్యవసాయం శ్రీలంక పాలిట పెనుశాపంగా మారింది. నిజానికి ప్రపంచం మొత్తం మీద ఆర్గానిక్ వ్యవసాయం మొత్తం వ్యవసాయంలో కేవలం 1.5శాతం భూమిలో మాత్రమే సాగుతోంది. అటువంటి పరిస్థితిలో 100శాతం ఆర్గానిక్ వ్యవసాయానికి కేవలం ఒకే ఒక నెల వ్యవధిలో మారిపోవాలని శ్రీలంక ప్రభుత్వం నిర్ణయించడం వినాశకర ఫలితాలకు దారితీసింది. ఆర్గానిక్ వ్యవసాయానికి పూనుకుంటే వ్యవసాయ దిగుబడులు గణనీయంగా తగ్గిపోతాయని, హరిత విప్లవం సాధించిన విజయాలు అన్నీ నిష్ప్రయోజనం అవుతాయని శ్రీలంకలోని శాస్త్రవేత్తలందరూ ప్రభుత్వానికి విన్నవించారు. కాని ప్రభుత్వం పెడచెవిన పెట్టింది. ఫలితంగా ఫిబ్రవరి 2022 నాటికి వ్యవసాయంలో దిగుబడులు దారుణంగా పడిపోయాయి. అంతవరకూ వరి పంట దిగుబడిలో స్వయంసమృద్ధి కలిగివున్న శ్రీలంక ఒక్కసారిగా బియ్యాన్ని మయన్మార్ నుండి, చైనా నుండి దిగుమతి చేసుకోవలసిన దుస్థితికి చేరింది. ఈ పరిణామాల నేపథ్యంలో ఆర్గానిక్ వ్యవసాయ విధానాన్ని ప్రభుత్వం ఉపసంహరించుకుంది. కాని, అప్పటికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది.

**కుప్పకూలిన పర్యాటక రంగం:**

శ్రీలంక పర్యాటక పరిశ్రమ చాలా విస్తృతమైనది. నేడు దేశ ఆర్థిక వ్యవస్థకు 5 బిలియన్ డాలర్ల మేరకు పర్యాటక పరిశ్రమే దోహదం చేస్తోంది. 2018 సంవత్సరంలో శ్రీలంకను 20 లక్షలమంది పర్యాటకులు సందర్శించారు. 2019లో శ్రీలంక రాజధాని కొలంబోలో జరిగిన బాంబు దాడుల్లో 200 మంది ప్రజలు చనిపోయారు. దీంతో శ్రీలంకకు విదేశీ పర్యాటకుల రాక గణనీయంగా తగ్గి పోయింది. ఆనాటి నుంచి పర్యాటక పరిశ్రమ పూర్తిగా కోలుకోలేదు. పైగా గత రెండేళ్లుగా కరోనా మహమ్మారి తన వంతు పాత్ర పోషించింది. కోవిడ్-19 కారణంగా విదేశాల్లో పనిచేస్తున్న శ్రీలంక ప్రవా సుల నుంచి, వలస కార్మికుల నుంచి దేశం అందుకుంటున్న 'రెమి టెన్స్ డబ్బు' చాలావరకు తగ్గిపోయింది. ఈ ఏడాది ఫిబ్రవరిలో శ్రీలంకను సందర్శించిన వారిలో 70 శాతం కంటే ఎక్కువ మంది యూరోపియన్లే. ప్రభుత్వం నెల నెలా విడుదల చేసే పర్యాటక నివేదిక ప్రకారం, రష్యా నుంచి 15,340 మంది పర్యాటకులు శ్రీలంకకు వచ్చారు. ఫిబ్రవరిలో శ్రీలంకకు వచ్చిన వారిలో రష్యన్లదే అగ్రస్థానం. అయితే, యుక్రెయిన్‌పై రష్యా దాడి కారణంగా ఈ దేశాల నుంచి వచ్చే పర్యాటకుల సంఖ్య తగ్గిపోయింది. అంతకుముందు, కరోనా కారణంగా సందర్శకులు రాకపోవడంతో శ్రీలంక పర్యాటక రంగం కుదేలైంది.

**ఆర్థిక కారణాల కంటే రాజకీయ కారణాలే ప్రధానం:**

దేశ ఆర్థిక సంక్షోభానికి ఆర్థిక కారణాల కంటే రాజకీయ కారణాలే ఎక్కువ! జాతి కేంద్రకమైన జాతీయవాదం, మెజారిటీ సింహళ ప్రజలవైపు మొగ్గు చూపడం ఇప్పటికీ విస్తృత స్థాయిలో కొనసాగుతున్నాయి. పార్లమెంటులో 150 సీట్ల అఖండ మెజారిటీతో గెలుపొందిన గొటబయ రాజపక్స ప్రభుత్వంపై, ముఖ్యంగా రాజపక్స కుటుంబంపై లంకేయులు ప్రస్తుతం తీవ్రస్థాయిలో ధ్వజమెత్తుతున్నారంటే ఈ కుటుంబ రాజకీయ విధానాలు ఎంత ఏహ్యభావాన్ని వారిలో పెంచాయో అర్థమవుతుంది.

**ముగింపు:**

మొత్తంగా చూస్తే శ్రీలంకలో నేడు తలెత్తిన సంక్షోభానికి ప్రపంచీకరణ విధానాలు అమలు చేయడం, ఐఎంఎఫ్ షరతులకు తలొగ్గడం, ప్రజల్లో వచ్చే వ్యతిరేకతను పక్కదోవ పట్టించడానికి మితవాదం వైపు మొగ్గడం తదితర కారణాలతోపాటు రాజకీయ విధానాలు ప్రధాన కారణమయ్యాయి. ఇప్పుడు ఈ సంక్షోభం నుండి బైట పడడానికి శ్రీలంక 17వ సారి ఐఎంఎఫ్ రుణం కోసం ప్రయత్నిస్తోంది. ఈసారి కూడా ఐఎంఎఫ్ మరిన్ని విషమ షరతులు విధించడం ఖాయం. అయితే శ్రీలంకకు అందుతున్న ప్రపంచ దేశాల సహాయం కారణంగా ప్రస్తుత ఆర్థిక సంక్షోభం నుంచి దేశం గట్టెక్క వచ్చు. కానీ దాని ఆర్థిక విధానాలను, అంతకు మించి తన రాజకీయ విధానాలను సరిదిద్దుకోకపోతే శ్రీలంక సమస్యకు అంతిమ పరిష్కారం లభించడం కష్టసాధ్యమే.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

**వచ్చే సంచికలలో...**

- కరోనా అనంతర పరిణామాలు - లంకా పాపిరెడ్డి
- బెంగాల్‌లో మతతత్వ రాజకీయాలు - కొండూరి వీరయ్య
- దేశానికి సగం దరిద్రం బంగారమే - వి. వెంకట్రావు
- ఇండియాలో మూడు సామాజిక విప్లవాలు - డా. పట్టా వెంకటేశ్వర్లు
- మంగల్ పాండేది మొదటి పోరాటమా? స్వాతంత్ర్య సమరమా? - సంగిరెడ్డి హనుమంతరెడ్డి
- కుల అస్తిత్వాన్ని చిత్రించిన నవల: పుట్టుమచ్చ - మెంతబోయిన సైదులు

# పాకిస్తాన్‌లో రాజకీయ పరిణామాలు

*అవినీతి ఆరోపణలతో అవిశ్వాస తీర్మానం ఆమోదించి దేశ ప్రధానిని గద్దె దించిన పాకిస్తాన్ రాజకీయ పరిణామాలను వివరిస్తున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

రాజకీయ అస్థిరతకు పేరుపొందిన పాకిస్తాన్‌లో నెలరోజులకు పైగా ఉత్కంఠ నెలకొంది. పాకిస్తాన్ ప్రధాని ఇమ్రాన్‌ఖాన్ పార్లమెంటులో మెజారిటీ కోల్పోయాడు. ప్రధాని ఇమ్రాన్‌ఖాన్‌పై మాజీ ప్రధాని నవాజ్ షరీఫ్ సోదరుడు షెహబాజ్ షరీఫ్ నేతృత్వంలోని పాకిస్తాన్ ముస్లింలీగ్ (ఎన్), పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ పరస్పర విరుద్ధమైనవి అయినప్పటికీ ఇమ్రాన్‌ని గద్దె దింపేందుకు చేతులు కలిపాయి. పాలక పాక్ తెహ్రీక్–ఇ–ఇన్సాఫ్ (పిటిఐ) నుంచి ప్రధాన మిత్రపక్షం ముత్తాహిదా క్వామీ ఉద్యమం (ఎంక్యుఎం) కూటమి బయటకు వెళ్లిపోవడం, సొంత పార్టీలోనే డజను మందికి పైగా ఎంపీలు తిరుగుబాటు చేయడంతో ఇమ్రాన్ ప్రభుత్వం మైనార్టీలో పడిపోయింది. ఐక్య ప్రతిపక్షం, పాలక కూటమిలోని ఒక వర్గం కలిసి మార్చి 8న ఇమ్రాన్ అవినీతి, ఆర్థిక దుర్వినియోగం, అసమర్థ పాలనకు వ్యతిరేకంగా పార్లమెంటులో అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ప్రతిపక్షాలు ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానంపై జాతీయ అసెంబ్లీలో ఓటింగ్ జరిగి ఉంటే అది నెగ్గి ఉండేది. నిబంధనల ప్రకారం 14 రోజుల్లోపు సమావేశాన్ని ఏర్పాటు చేయాలని ప్రతిపక్షాలు కోరినప్పటికీ స్పీకర్ అవిశ్వాస తీర్మానంపై చర్చ జరిపి ఓటింగ్ నిర్వహించడానికి అనుమతించలేదు. ఇమ్రాన్‌ఖాన్ గద్దె దిగిపోవడం ఖాయమను కుంటున్న దశలో, పాకిస్తాన్ ప్రధానిగా తన ఆట ముగిసిందని ముందే తెలిసినా, కిందపడ్డ తనదే పైచేయి కావాలన్నట్లుగా ఆఖరి క్షణాల్లో రసకందాయ రాజకీయాలకు తెరదీశాడు.

ఇమ్రాన్ దేశ ప్రజలను ఉద్దేశించి ఏప్రిల్ 1న చేసిన ప్రసంగాన్ని చాలామంది వీడ్కోలు ప్రసంగంగానే భావించారు. తాను రాజకీయాల్లోకి రావడం వెనుక ఎన్నో ఆశయాలూ త్యాగాలూ ఉన్నాయని చెప్పుకోవడం నుంచి విపక్షనేతలను దూషించడం వరకూ ఆయన చాలా విన్యాసాలు చేశారు. అవినీతిలో కూరుకుపోయిన ప్రతిపక్షాలు తమపై ఉన్న ఆర్థిక నేరాలకు సంబంధించిన కేసులను సమాధి చేసేందుకు తనను అధికారం నుంచి తప్పించాలని చూస్తున్నారని అన్నారు. ప్రసంగంలో ఆయన 'నేను' అన్న మాటని 143 సార్లు అంటే నిముషానికి మూడుసార్లు వాడారు. ఇక, తన సర్వస్వతంత్ర సర్వసత్తాక వైఖరి నచ్చని కారణంగా ఒక విదేశీ దుష్టశక్తి తనను వెన్నుపోటు పొడిచిందని విస్పష్టంగా తేల్చేయడంతో పాటు ఆ శక్తి ఏమిటన్నది కూడా చెప్పేశారు. సర్వసాధారణంగా పాక్ నేతలంతా తమకు కష్టం వచ్చినప్పుడల్లా భారత్‌ను బూచిగా చూపించి రాజకీయంగా నెగ్గుకొచ్చే ప్రయత్నం చేస్తుంటారు. ఇమ్రాన్ మాత్రం తనమీద కక్షకట్టి, విపక్షాలతో చేతులు కలిపి అమెరికా ఈ మొత్తం రాజకీయ కల్లోలానికి కారణమైందని అన్నారు. ఫిబ్రవరి 24న మాస్కోలో పుతిన్‌తో కరచాలనం చేసినందుకు తనను ఇలా శిక్షిస్తున్న అమెరికా భారత్‌ను మాత్రం వీసమెత్తు కదిలించలేక పోతున్నదని గుర్తు చేశారు. చివరకు బ్రిటన్ కూడా భారతదేశానికి వంత పాడుతున్నదని అన్నారు.

ఏతావాతా ఇమ్రాన్ తనను తాను ఒక బలమైన, స్వతంత్రమైన, ఏ రాజకీయాపేక్షాలేని, దేశ ప్రయోజనాలకోసం నిలబడే నాయకుడిగా ప్రదర్శించుకొనే ప్రయత్నం చేశారు. మరోవైపు ఆయన పార్టీ పాక్ తెహ్రీక్–ఇ–ఇన్సాఫ్ (పిటిఐ) సభ్యులు డాలర్లకు అమ్ముడుపోని, అమెరికా సైనిక స్థావరాలను అనుమతించని తమ మహానాయకుడిని హత్యచేసే యత్నాలు జరుగుతున్నాయని ప్రచారం మొదలు పెట్టారు. ప్రజలు వీధుల్లోకి వచ్చి ప్రతిపక్షాలకు వ్యతిరేకంగా నిరసనలు తెలుపాలని పిలుపునిచ్చారు. అధికారంలో కొనసాగడానికి వారు ముందుకు తెస్తున్న కుట్ర సిద్ధాంతాలను ప్రజలు నమ్మినా నమ్మకపోయినా వాళ్ల ఈ దశలో చేయగలిగేదేమీ ఉండదు. ఇమ్రాన్ ముందు సైన్యం పెట్టిన ప్రతిపాదనలో ఎన్నికలు కూడా ఉన్నాయని అంటున్నారు. విపక్షం మాత్రం ముందస్తు ఎన్నికలు కుదరదనీ, ఇమ్రాన్ ఆ కుర్చీ ఖాళీచేయగానే 2023లో ఎన్నికలు జరిగే వరకు తాము కూర్చుంటామని స్పష్టం చేశారు. పాకిస్తాన్‌లో ఇప్పటి వరకు ఏ ప్రధానీ ఐదేళ్ల పూర్తి కాలం కొనసాగలేకపోయారన్న చేదు వాస్తవమే అక్కడి ప్రజాస్వామ్యం ఎంత బలహీనమైనదో చాటుతున్నది. ఇందుకు కారణం పాక్ సైన్యమే. గూఢచార విభాగం ఐఎస్ఐ సహా ప్రభుత్వంలోని వారి ఆయువు పట్లన్నీ అక్కడ సైన్యం చేతిలోనే ఉంటాయి. 2018లో ఇమ్రాన్ ఖాన్‌ను స్వయంగా గద్దె ఎక్కించిన పాక్ సైన్యం ఇప్పుడు ఆయన తీరు పట్ల అసంతృప్తిగా ఉన్నదని, అవిశ్వాస తీర్మానం వెనుక ఉన్నది సైన్యం హస్తమేనని భావిస్తున్నారు.

అవిశ్వాస తీర్మానం వైపు ప్రతిపక్షాల కదలికలు మొదలైన వెంటనే దాని వెనుక విదేశీ హస్తం ఉందని ఇమ్రాన్‌ఖాన్ ఆరోపించారు. పాకిస్తాన్ విదేశాంగ విధానాన్ని తాను రష్యా, చైనాల వైపు పూర్తిగా తిప్పబోయినప్పుడు అమెరికా రంగప్రవేశం చేసి సైన్యం ద్వారా తనకు అడ్డు చక్రం వేసిందని ఇమ్రాన్‌ఖాన్ అన్నారు. నిజానికి అమెరికా చిరకాలంగా పాకిస్తాన్‌ను ఒక దుష్టశక్తిగా తయారు చేసి పోషిస్తూ వచ్చింది. విపరీతంగా ఆయుధాలను, ఆర్థిక మద్దతును ఇచ్చింది. అయినా పాక్ ప్రజల స్థితిగతుల్లో ఎలాంటి మార్పు రాలేదు.

ఇమ్రాన్‌ఖాన్ కూడా ప్రజలకు తాను చేసిన వాగ్దానాలను నెరవేర్చడంలో విఫలమయ్యారనే ఆరోపణను ఎదుర్కొంటున్నారు. నిత్యం భారత వ్యతిరేకత మీద ఆధారపడి అక్కడి ప్రభుత్వాలు నడుస్తూ ఉంటాయి. అందుకు అనుగుణంగా భారత వ్యతిరేక తీవ్రవాదులకు అక్కడ ఆశ్రయం లభిస్తూ ఉంటుంది. తాలిబన్లను తయారు చేసి ఆఫ్ఘనిస్తాన్ మీదికి పంపి, అక్కడ అధికారంలో నిలదొక్కుకునేలా చేయడంలో పాక్ సైన్యం, ఇమ్రాన్‌ఖాన్ ప్రభుత్వం పాత్ర ఉంది. దీనితో ఇమ్రాన్‌కు అమెరికాతో సంబంధాలు తెగిపోయాయి. ఇమ్రాన్‌ఖాన్ దేశాన్ని సరిగ్గా పాలించలేకపోగా, విదేశాంగ విధానంతో ఇష్టారాజ్యంగా ఆడుకున్నాడనే ఆరోపణకు గురయ్యారు.

ఇమ్రాన్ ప్రభుత్వంలో అవినీతి, మనీలాండరింగ్ పెరిగి పోయిందని స్థానిక మీడియా పలు కథనాలు వెలువరించింది. ఇమ్రాన్ పాలనలో ఉపాధి లేక కునారిల్లుతున్న యువత ఆకాంక్షలను ఈడేర్చడంలోనే కాదు, కొన్నాళ్లుగా నింగిని తాకుతున్న నిత్యావసరాల ధరలకు పగ్గాలు వేయడంలోనూ ఆయన విఫలమయ్యారు. గతంతో పోలిస్తే దేశార్థికం ఇంకా దిగనాసిల్లిపోవడానికి ఇమ్రాన్ అసమర్థ విధానాలే కారణమన్న విమర్శలు పోటెత్తాయి. విదేశీ రుణాలకు చేయిచాచేది లేదన్న ఆయన ప్రకటనలూ ఉత్తి ప్రగల్భాలయ్యాయి. 'ప్రతిపక్ష నేతల అవినీతిపై పోరాటం' కొండను తవ్వి ఎలుకను పట్టిన చందమైతే, దేశాన్ని అన్ని విధాలుగా శాసించే సైన్యంతో పేచీకి దిగడం ఇమ్రాన్ కుర్చీ కిందకు నీళ్లు తెచ్చింది.

ప్రతిపక్షాలు ఇచ్చిన అవిశ్వాస తీర్మానంపై మార్చి 25న చర్చ జరుగవల్సి ఉండగా దాన్ని స్పీకర్ ఏప్రిల్ 3వ తేదికి వాయిదా వేశారు. ప్రధాని ఇమ్రాన్‌ను కాపాడే ఉద్దేశ్యంతో పార్లమెంట్ డిప్యూటీ స్పీకర్ ఖాసిం సూరి ఓటింగ్ జరగాల్సిన రోజున తిరస్కరించడం, పార్లమెంట్ రద్దుకు ఇమ్రాన్‌ఖాన్ చేసిన సిఫార్సును దేశాధ్యక్షుడు ఆరిఫ్ అల్వీ అంగీకరించడం అన్నీ చకచకా జరిగిపోయాయి. విచిత్రమైన రీతిలో చోటు చేసుకున్న ఈ పరిణామాలు అందరినీ ఆశ్చర్యపర్చాయి. ఇమ్రాన్ సిఫార్సును అరగంటలో దేశాధ్యక్షుడు ఆమోదించడాన్ని సుప్రీంకోర్టులో ప్రతిపక్షాలు సవాలు చేశాయి. పార్లమెంటు రద్దుకు ఆయన చేసిన సిఫార్సును దేశాధ్యక్షుడు ఆమోదిస్తూ తన ఆమోదం న్యాయ వ్యవస్థ సమీక్షకు లోబడి ఉంటుందని అంటూ మెలిక పెట్టారు.

**పాక్ సైన్యం పడగ నీడలో పౌర ప్రభుత్వం :**

పౌరసమాజం, ప్రభుత్వాలు స్వతంత్రంగా వ్యవహరించేందుకు ప్రయత్నించినప్పుడల్లా సైన్యం ఆ ప్రభుత్వాన్ని కూల్చివేస్తోంది. పాకిస్తాన్‌లో రెండు పార్టీల వ్యవస్థను బ్రేక్ చేయడానికి 2018లో ఇమ్రాన్‌ఖాన్‌ను సైన్యమే ప్రోత్సహించింది. ఆ ఎన్నికల్లో ఇమ్రాన్‌ను గెలిపించడంలోనూ సైన్యం పోషించిన పాత్ర అందరికీ తెలిసిందే. అధికారంలోకి వచ్చిన తరువాత సైన్యం ఆదేశాలను కొంతకాలం తు.చ. తప్పకుండా పాటించారు. తరువాత తన స్వతంత్రతను చాటుకోడానికి ప్రయత్నించారు. పాక్ గూఢచారి సంస్థ ఐఎస్ఐ చీఫ్ నియామకం విషయంలో ఇమ్రాన్‌కు, సైన్యానికి మధ్య విబేధాలు తలెత్తడానికి ఇదే కారణం, ఇమ్రాన్‌ఖాన్ మాస్కో పర్యటన తరువాత ఈ విబేధాలు మరింత తీవ్ర రూపం దాల్చాయి. పాక్ సైన్యం దేనినైనా సహిస్తుంది కానీ, తన మాట జవదాటితే అసలు క్షమించదు.

ప్రజాదరణ కలిగిన జుల్ఫికర్ ఆలీ భుట్టో ప్రభుత్వాన్ని సైన్యం తిరుగుబాటు ద్వారా కూల్చివేసి, 1979 ఏప్రిల్ 4న ఉరితీసి చంపేసింది. ఇక అప్పటి నుంచి ఇప్పటివరకు సైన్యాన్ని ఎదిరించి నిలిచినవారు లేరు. పాక్ సైన్యానికి అమెరికా వత్తాసు ఎప్పుడూ ఉంటుంది. అవినీతిపరులైన సైనిక అధికారులకు అమెరికా డాలర్ మూటలు అందిస్తూ తన చెప్పుచేతల్లో ఉంచుకుంటుంది. కాబట్టి అమెరికా ప్రయోజనాలకు విరుద్ధంగా పాక్ సైన్యం ఎన్నడూ వ్యవహరించదు. ఇమ్రాన్‌ఖాన్ అమెరికా వ్యతిరేక వైఖరి తీసుకోవడం సైన్యానికి ఏమాత్రం రుచించలేదు. దీనికి ఇమ్రాన్ స్వయం కృతాపరాధాలు కూడా తోడయ్యాయి. ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో పడడానికి ప్రభుత్వ అసమర్థతే కారణమన్న భావన సర్వత్రా నెలకొంది. ప్రతిపక్షాలను విశ్వాసంలోకి తీసుకోకుండా నిరంకుశంగా వ్యవహరించడం, ఇస్లామిక్ మత ఛాందసవాదాన్ని బుజ్జగించే వైఖరి తీసుకోవడం ఇవన్నీ ఇమ్రాన్ ప్రభుత్వం ప్రజలకు దూరం కావడానికి దారి తీశాయి.

2018లో నవాజ్ షరీఫ్‌కు వ్యతిరేకంగా సైన్యం సహకారంతో నయా పాకిస్తాన్ నినాదంతో అధికార దండాన్ని చేపట్టిన ఇమ్రాన్ తన హామీల అమలులో పూర్తిగా చతికిలపడ్డారు. అధికారంలోకి రాకముందు పన్ను ఎగవేతదారులను, అక్రమార్జన పరులను అరికడుతానని ప్రతిజ్ఞ చేశాడు. అయితే, ఆయన ఇప్పటివరకు చేసింది ఏమి లేదు. కాగా 2021లో విడుదలైన పండోరా పేపర్స్ లీక్‌లో ఇమ్రాన్ కాబినెట్ మంత్రులు, వారి కుటుంబ సభ్యులు, ప్రధాని అంతర్గత సర్కిల్‌లోని ముఖ్యులు 700 మంది ఉన్నారు. ఇంకా మిలియన్ల డాలర్లు దాచిన కంపెనీలు వెలుగులోకి వచ్చాయి. ప్రధాని ఇమ్రాన్ సోదరి అలియాఖాన్ పన్ను ఎగ్గొట్టడానికి తన ఆస్తులను దాచిపెట్టిందని పండోరా పేపర్స్ తెలిపాయి. ఆమెకు దుబాయిలో బిలియన్ల డాలర్ల విలువైన ఆస్తులు ఉన్నట్లు వెలుగులోకి వచ్చింది. పండోరా పేపర్స్‌లో మాజీ ప్రధాని నవాజ్ షరీఫ్ కుటుంబ సభ్యులతో పాటు 400 మంది సభ్యులు ఉన్నారు.

పాకిస్తాన్ ప్రధాని ఇమ్రాన్‌ఖాన్‌పై అవిశ్వాస తీర్మానం వెనుక గల శక్తులు ఎటువంటివి, ఎవరు అనేది కీలకమైన ప్రశ్న. కేవలం సైన్యం మద్దతు కోల్పోయినందు వల్లనే ఇమ్రాన్‌ఖాన్‌కు ఈ గడ్డు పరిస్థితిఎదురైందా లేక ఆయన చెబుతున్నట్టు అంతర్జాతీయ శక్తుల కుట్ర వల్లనా లేక ఆయన అసమర్థ పాలన వల్లనా అంటే అన్నీ కలిసి ఉన్నాయి. ఆఫ్ఘనిస్తాన్‌లో తిరిగి తాలిబాన్లు అధికారం చేపట్టడం వెనుక పాకిస్తాన్ హస్తం ఉన్నదనేది సుస్పష్టం. ఇమ్రాన్‌ఖాన్ నాయకత్వంలో పాకిస్తాన్ అమెరికాకు దూరమై చైనా, రష్యాలకు చేరువైంది. ఇది పాక్ సైన్యానికి కూడా అంగీకారం కాదని, అందుచేత సైన్యం ప్రోత్సాహంతోనే అవిశ్వాస తీర్మానం ప్రతిపాదనకు బలం చేకూరిందని తెలుస్తోంది. అయితే అవిశ్వాస తీర్మానం విషయంలో తనది తటస్థ పాత్రేనని పాక్ సైన్యం చెబుతున్నది. ఖాన్ వైపు గాని, ప్రతిపక్షం వైపు గాని తాము ఉండబోమని అది వెల్లడించింది. అయితే సైన్యం

తటస్థంగా ఉందన్నది ఎవరు నమ్మరు.

అవిశ్వాస తీర్మానం ఖరారైన తర్వాత ఇమ్రాన్‌ఖాన్ ఇస్లామాబాద్‌లో ఏర్పాటైన భారీ బహిరంగ సభలో ఏప్రిల్ ఒకటిన మాట్లాడుతూ మనుషులెవరూ తటస్థంగా ఉండజాలరని, ఉంటే మంచి వైపో లేకపోతే చెడువైపో ఉండి తీరుతారని అన్నారు. ఇది తనను ఉద్దేశించినదేనని సైన్యం భావిస్తున్నది. అదే సభలో ఇమ్రాన్ తెల్ల చొక్కా నేరగాళ్లు దేశాన్ని లూటీ చేశారని అన్నారు. పేద దేశాల్లో చట్టం తెల్లచొక్కా నేరస్థుల జోలికి పోదని కూడా అన్నారు. ఈ పందికొక్కులు 30 ఏళ్లుగా దేశ ఆర్థిక వ్యవస్థను నంజుకు తింటున్నాయని వ్యాఖ్యానించారు. వీరు దేశంలోని ధనరాసులను దోచుకొని విదేశీ ఖాతాల్లో దాచుకుంటున్నారని కూడా అన్నారు. తన ప్రభుత్వం పడిపోయినా, తన ప్రాణం మీదికే వచ్చినా ఈ శక్తులను అంతమొందించడానికి తాను తుదికంటా పోరాటం చేస్తానని కూడా హెచ్చరించారు. ఇమ్రాన్‌ఖాన్ చేసిన ఈ వ్యాఖ్యలు తనపై అవిశ్వాస తీర్మానం తెచ్చిన ప్రతిపక్ష నేతలను ఉద్దేశించినవేనన్నది సుస్పష్టం. తాను మహిళలకు ఆస్తిలో వారసత్వ హక్కు కల్పించే బిల్లు తెచ్చానని చెప్పుకున్నారు. కొవిడ్ నేపథ్యంలో ఆర్థిక వ్యవస్థ దెబ్బతిని ద్రవ్యోల్బణం, ధరలు మిన్నంటడంతో ఇమ్రాన్‌ఖాన్ పట్ల ప్రజల్లో వ్యతిరేకత పెరిగిందని దీనిని ఎదుర్కోవడంలో ఆయన విఫలమయ్యాడని ప్రతిపక్షం ఆరోపిస్తున్నది.

**ఉత్కంఠకు పరిష్కారం చూపిన సుప్రీం తీర్పు :**

అవిశ్వాస తీర్మానాన్ని స్పీకర్ ఖాసీం సూరి తిరస్కరించడాన్ని రాజ్యాంగ విరుద్ధ చర్యగా సుప్రీంకోర్టు అభివర్ణించింది. ఏప్రిల్ 9న ఇమ్రాన్‌ఖాన్ అవిశ్వాస తీర్మానాన్ని ఎదుర్కొవల్సిందేనని తేల్చి చెప్పింది. ఈ మేరకు ఓటింగ్ నిర్వహించాలని స్పీకర్‌ను ఆదేశించింది. ఓటింగ్ పూర్తి అయ్యే వరకు సభను వాయిదా వేయవద్దని ఆదేశించింది. అలాగే పాకిస్తాన్ జాతీయ అసెంబ్లీని రద్దు చేస్తూ అధ్యక్షుడు ఆరీఫ్ అల్వీ తీసుకొన్న నిర్ణయాన్ని కూడ రాజ్యాంగ విరుద్ధ చర్యగా పేర్కొన్న ధర్మాసనం వెంటనే పార్లమెంటును పునరుద్ధరించాలని ఆదేశించింది. అవిశ్వాస తీర్మానంలో ఒకవేళ ఇమ్రాన్ ఓడిపోతే, కొత్త ప్రధానిని ఎన్నుకోవాలన్నది సుప్రీంకోర్టు. ఈ మేరకు ఐదుగురు సభ్యులతో కూడిన పాకిస్తాన్ అత్యున్నత ధర్మాసనం ఏప్రిల్ 7 రాత్రి ఏకగ్రీవ తీర్పును వెలువరించింది.

సుప్రీంకోర్టు ఆదేశాల నేపథ్యంలో ఏప్రిల్ 9న నేషనల్ అసెంబ్లీలో హైడ్రామా నడిచింది. ఓటింగ్ పెట్టేందుకు చివరి నిమిషం వరకూ ఇమ్రాన్‌ఖాన్ నేతృత్వంలోని పాకిస్తాన్ తెహ్రీక్ ఇ ఇన్సాఫ్ (పిటిఐ) ప్రభుత్వం ససేమిరా అంది. తొలుత ప్రభుత్వాన్ని కూల్చేందుకు విదేశీ శక్తుల కుట్రపై సభలో చర్చ జరపాలని డిమాండ్ చేసింది. చర్చకు అంగీకరించని ప్రతిపక్షాలు అవిశ్వాసంపై ఓటింగ్ పెట్టాలని పట్టుబట్టడంతో సభలో గందరగోళం చెలరేగి పలుమార్లు వాయిదా పడింది. ప్రతిపక్షాలు అవిశ్వాస తీర్మానంపై ఓటింగ్ చేపట్టాలని కోరాయి. కానీ ఓటింగ్‌కు స్పీకర్ ససేమిరా అన్నారు. "ఓటింగ్ జరిపి ఇమ్రాన్‌తో నా 30 ఏళ్ల బంధాన్ని తెంచుకోలేను. కోర్టు ధిక్కరణ కేసును ఎదుర్కోవాల్సి వచ్చినా సరే, ఎట్టి పరిస్థితుల్లోనూ ఓటింగ్ జరపబోను" అని కుండబద్దలు కొట్టారు. ఎంతకూ అవిశ్వాసంపై ఓటింగ్ నిర్వహించకపోవడంతో ఏప్రిల్ 9 అర్ధరాత్రి తర్వాత పాకిస్తాన్ సుప్రీంకోర్టు అత్యవసరంగా సమావేశమైంది. తమ ఆదేశాలను స్పీకర్ పాటించక పోవడంపై కోర్టు ధిక్కరణ కింద విచారణ జరిపింది.

"ఓటింగ్ జరిపి విదేశీ కుట్రలో భాగం కాలేను. రాజీనామా చేస్తున్నా" అని అర్ధరాత్రి 11.30కు స్పీకర్ అసద్ ఖైజర్ ప్రకటించారు. డిప్యూటీ స్పీకర్ ఖాసిం సూరి కూడా ఆయన బాటలోనే నడిచారు. స్పీకర్ యోచన మేరకు విపక్ష పిఎంఎల్(ఎన్)కు చెందిన ప్యానల్ చైర్మన్ అయాజ్ సాదిక్ అధ్యక్షతన అర్ధరాత్రి 11.45కు ఓటింగ్ ప్రక్రియ చేపట్టారు. 11.50కి అధికార పిటిఐకి చెందిన 156 మంది ఎంపిలూ సభ నుంచి వెళ్లిపోయారు. సభ నిబంధనల మేరకు 11.58కి సభను మర్నాటికి వాయిదా వేశారు. నాలుగు నిమిషాల అనంతరం మూజువాణి ఓటుతో అవిశ్వాస తీర్మానాన్ని ఓటింగ్‌కు స్వీకరిస్తున్నట్టు సభాపతి ప్రకటించారు. తర్వాత తలుపులన్నీ మూసేసి ఓటింగ్ చేపట్టారు. 12.10కి ఓటింగ్ జరిగింది.

342 మంది సభ్యులున్న సభలో అవిశ్వాస తీర్మానం నెగ్గాలంటే విపక్షాలకు కనీసం 172 మంది మద్దతు అవసరం. రాత్రి ఒంటి గంటకు 174 మంది అనుకూలంగా ఓటేయడంతో తీర్మానం సులువుగా గట్టెక్కింది. 342 మంది సభ్యులుగల జాతీయ అసెంబ్లీలో అది అత్తెసరు మెజారిటీ. ఇది పాకిస్తాన్ ముస్లింలీగ్ నవాజ్ (పిఎంఎల్-ఎన్), పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ (భుట్టోలు), మరికొన్ని చిన్న పార్టీలు, నలుగురు ఇండిపెండెంట్లు, ఇమ్రాన్‌ఖాన్ పార్టీ పాకిస్తాన్ తెహ్రిక్-ఎ-ఇన్సాఫ్ నుండి ఫిరాయించిన 22 మంది ఎంపిలతో కూడిన కలగూరగంప. కొత్త ప్రధానమంత్రిగా పిఎంఎల్(ఎన్) నాయకుడు షెహబాజ్ షరీఫ్‌ను పార్లమెంటు ఎన్నుకుంది. పదవీచ్యుతుడై ప్రస్తుతం లండన్‌లో ఆశ్రయం పొందిన నవాజ్ షరీఫ్ సోదరుడు షెహబాజ్, ఆయన పంజాబ్ రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి.

ఇమ్రాన్‌ఖాన్ పదవీచ్యుతి పార్లమెంటరీ విన్యాసంగా కనిపించినా, ఇది అమెరికా కోరిన 'ప్రభుత్వ మార్పు'లాగా ఉంది. తమను ధిక్కరించే ప్రభుత్వాలను కూలద్రోయటానికి రెండు దశాబ్దాలకు పూర్వం నాటి అమెరికా అధ్యక్షుడు జార్జి డబ్ల్యు బుష్ ప్రవచించిన సిద్ధాంతం 'ప్రభుత్వ మార్పు' (రిజీం చేంజ్). దాని ప్రకారమే ఆఫ్ఘానిస్తాన్, ఇరాక్, లిబియాలపై అమెరికా దాడి జరిగింది. ఇరాన్‌లో, క్యూబాలో దాని అమలు సాధ్యం కాలేదు. ఇమ్రాన్‌ఖాన్, అమెరికా వద్దన్నా ఫిబ్రవరి 24న (అదేరోజు యుక్రెయిన్‌పై రష్యా దాడి మొదలు పెట్టింది) మాస్కో పర్యటనకు వెళ్లి అధ్యక్షుడు పుతిన్‌తో చర్చలు జరిపివచ్చారు. రష్యా, చైనా సన్నిహితం కావటమే సహించలేని అమెరికా తమ చెప్పుచేతల్లోని పాకిస్థాన్ కూడా అదేబాటలో వెళ్లటాన్ని సహిస్తుందా? అమెరికా బంగ్లాదేశ్‌లో కూడా ప్రతిపక్ష పార్టీలను ప్రోత్సహిస్తున్నది.

పాకిస్తాన్ విదేశాంగ విధానాన్ని ఉన్న పళంగా అబౌట్‌టర్న్‌తో పూర్తిగా మార్చివేయాలని, సాహసించి ఇమ్రాన్ దెబ్బతిన్నారు. ఇంతకాలంగా సైన్యం కనుసన్నల్లో దాని ఇష్టానిష్టాల మేరకు సాగుతూ వచ్చిన విదేశీ సంబంధాల నావను కొత్త దిశకు తిప్పబోయి ఇమ్రాన్

చతికిలబడ్డారు. పాకిస్తాన్ ఆది నుంచి అమెరికా అడ్డాలలోని బిడ్డగానే పెరుగుతూ వచ్చింది. అందుకు విరుద్ధంగా దానికి రష్యా అనుకూల చుక్కానిని అమర్చాలని ఇమ్రాన్ సంకల్పించారు. భారత వ్యతిరేకతలో తలపండిన ఆయన యుక్రెయిన్ యుద్ధం విషయంలో అమెరికా చెప్పుచేతల్లో నడవకుండా ఇండియా తీసుకున్న తటస్థ వైఖరిని అనేకసార్లు మెచ్చుకోవడం ద్వారా తన అంతరంగాన్ని బయట పెట్టారు. ఇది పాక్ సైన్యానికి బొత్తిగా గిట్టలేదు. సైన్యాధ్యక్షుడు జనరల్ జావెద్ బజ్వా అగ్రహానికి ఇమ్రాన్ గురయ్యారు. ఈ ఏడాది నవంబర్‌లో పదవీ విరమణ చేయాల్సి ఉండిన బజ్వాను కూడా సైన్యాధ్యక్ష పదవి నుంచి తప్పించడానికి ఇమ్రాన్‌ఖాన్ విఫలయత్నం చేసినట్టు సమాచారం. అయితే గతంలో అనేక మంది పాక్ ప్రధానుల విషయంలో జరిగినట్టు సైనిక కుట్ర ద్వారా కాకుండా పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతుల మేరకు ఇమ్రాన్‌ఖాన్ దిగిపోవడం గమనించవలసిన విషయం.

**ఆర్థిక సంక్షోభంలో పాక్ :**

పాకిస్తాన్‌లో రాజకీయ కల్లోలం వెనకే తీవ్ర ఆర్థిక సంక్షోభం పొంచి ఉంది. వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తి క్షీణత, తీవ్ర వాణిజ్య లోటు, చుక్కలను తాకే ధరలు అతలాకుతలం చేస్తున్నాయి. ఈ పరిస్థితిలో సహజంగానే పేదరికం, నిరుద్యోగం, స్వదేశీ, విదేశీ రుణభారం పెరిగిపోతున్నాయి. పాక్ కరెంటు ఖాతా లోటు నేడు 2,000 కోట్ల డాలర్లకు చేరింది. సాధారణంగా ఇలాంటి పరిస్థితిలో ప్రభుత్వాలు అంతర్జాతీయ సంస్థల నుంచి రుణం తీసుకుని గట్టెక్కుతుంటాయి. పాక్ మొత్తం విదేశీ రుణభారం ఇప్పటికే పాకిస్తానీ రూపాయల్లో దాదాపు 51 లక్షల కోట్లకు చేరుకుంది. అందులో 20.7 లక్షల కోట్ల రూపాయల అప్పు ఇమ్రాన్‌ఖాన్ ప్రభుత్వం చేసినదే. దాంతో పాక్‌కు విదేశాల నుంచి, అంతర్జాతీయ సంస్థల నుంచి కొత్తగా అప్పు పుట్టే పరిస్థితి లేకుండా పోయింది. ప్రస్తుత విదేశీ రుణభారం పాకిస్తాన్ మొత్తం స్థూల దేశీయోత్పత్తి (జిడిపి)లో 93.7 శాతానికి సమానం. సామాన్య ప్రజలు తిండికి కటకటలాడుతూ ఉంటే ఇమ్రాన్ ప్రభుత్వం 2020-21 బడ్జెట్‌లో దేశ రక్షణకు భారీగా నిధులు కేటాయించింది. కొవిడ్ కాలంలో ఆరోగ్య రంగానికి అరకొర నిధులు విదిల్చింది. ఎన్ని అప్పులు తెచ్చినా సగటు పాకిస్తానీ పౌరుడికి ఒరిగింది ఏమీ లేదు.

కొవిడ్ సంక్షోభం తెచ్చిపెట్టిన గడ్డు పరిస్థితులవల్ల పాకిస్తాన్ పాత అప్పులు తీర్చడానికి అధిక వడ్డీకి వాణిజ్య బ్యాంకులు, ఆర్థిక సంస్థల నుంచి కొత్త అప్పులు చేయాల్సి వచ్చింది. తాహతుకు మించి అప్పులు చేయడంతో పాక్ రూపాయి విలువ దారుణంగా పడిపోతోంది. నేడు ఒక డాలర్ సుమారు 185 పాక్ రూపాయలకు సమానం. ద్రవ్యోల్బణం, వాణిజ్య లోటు మూలంగా త్వరలోనే ఒక డాలరు విలువ 200 పాక్ రూపాయలకు చేరనున్నది. పాత విదేశీ రుణాలను తీర్చడానికి దేశం అంతకంతకూ చైనాపై ఆధారపడాల్సి వస్తోంది. ఫలితంగా బీజింగ్ రుణ ఊబిలో ఇస్లామాబాద్ కూరుకుపోతోంది. పాక్ విదేశీ రుణభారంలో 27 శాతం చైనాకు చెల్లించవలసిందేనని అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ చెబుతోంది. పాక్‌లో చైనా చేపట్టిన నిర్మాణాలకు అయిన వ్యయాన్ని పాక్ నుంచి వసూలు చేసేందుకు చైనా శ్రీలంకలో అనుసరించిన పద్ధతినే అనుసరిస్తోంది. అప్పు తీర్చకపోతే అయా ప్రాజెక్టులపై వచ్చే ఆదాయంలో వాటా కోరుతోంది. ఒకరకంగా చెప్పాలంటే పాక్‌ని అమెరికా, చైనాలు పీల్చి పిప్పి చేశాయి. అసలు రుణ ఊబి నుంచి ఎప్పటికైనా పాక్ బయటపడుతుందా అన్నది అంతుచిక్కని ప్రశ్నగా మారింది.

**షెహబాజ్ ముందున్నది ముళ్ల బాటే :**

ప్రధాని షెహబాజ్‌కి ఈ తరుణంలో ప్రధానమంత్రి పదవి ముళ్ల కిరీటమే. ఇమ్రాన్‌ఖాన్‌ను అధికారం నుంచి తప్పించాలనే ఉమ్మడి ఎజెండాతో అధికారంలోకి వచ్చిన కొత్త కూటమిని ఐక్యంగా నిలుపడం షెహబాజ్ షరీఫ్‌కు కష్టమే. ఎందుకంటే ఇది సోషలిస్టులు, ఉదారవాదులు, మతపరమైన కరడుగట్టిన వారి కూటమి కాబట్టి సంకీర్ణాన్ని యథాతథంగా కొనసాగించడం షెహబాజ్ షరీఫ్‌కు పెద్ద సవాలే. మరోవైపు క్షీణించిన ఆర్థిక వ్యవస్థను మెరుగుపర్చడం సాధ్యమయ్యే పనికాదు. సాధారణ ప్రజలు అమెరికాకు వ్యతిరేకంగా అల్లర్లు సృష్టించే అవకాశముంది. పాక్‌లో ఉన్న ప్రత్యేక పరిస్థితి దృష్ట్యా ఆయన పదవీ నిర్వహణ కత్తిమీద సామువంటిదే. అయితే, ఇమ్రాన్ దూరం చేసుకున్న వర్గాలను కలుపుకుని పోవడం ద్వారా ఆయన తన పదవిని కొనసాగించేందుకు వీలుంది. అంతేకాకుండా మరో మాజీ ప్రధాని బెనజీర్ భుట్టో కుమారుడైన బిలావర్ భుట్టో నేతృత్వంలోని పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ మద్దతు ఉండటం షెహబాజ్‌కి కలిసొచ్చే అంశం. అయితే షెహబాజ్‌పై ఆయన అన్న షరీఫ్‌పై మాదిరిగానే అనేక ఆర్థిక నేరాల కేసులున్నాయి. వాటిపై విచారణను ఎదుర్కొంటున్నారు.

**ముగింపు :**

కొత్త ప్రధాని షెహబాజ్ విశేష పరిపాలనానుభవం ఉన్నవారు. అనేకసార్లు పంజాబ్ ముఖ్యమంత్రిగా చేశారు. అవిశ్వాస తీర్మానంపై ఓటింగ్‌లో ఇమ్రాన్‌ఖాన్ ఓడిపోయిన వెంటనే షెహబాజ్ షరీఫ్ చేసిన ఒక వ్యాఖ్య గుర్తు పెట్టుకోదగినది. భారతదేశంతో శాంతి, సత్సంబంధాలను తాను కోరుకుంటున్నానని, అయితే కశ్మీర్ సమస్య పరిష్కారం కానంత వరకు అది సాధ్యం కాదని అన్నారు. పాకిస్థాన్ ఎల్లప్పుడూ అమెరికా చెప్పుచేతల్లోని రాజ్యమని, అమెరికా పాలకుల సంతృప్తి మేరకే ఇక్కడ ప్రభుత్వాలు మనుగడ సాగిస్తాయని, దీర్ఘకాలం పరిపాలించిన పలువురు సైనిక నియంతలు ప్రజాభిప్రాయాన్ని గౌరవిస్తున్నట్లు మధ్య మధ్యలో ప్రజాప్రభుత్వాలను అనుమతించినా, వాటిలో ఏదీ పూర్తికాలం పని చేయలేదని ప్రపంచానికి తెలుసు. పాక్‌లో ఈ అస్థిర రాజకీయాలు తొలగాలంటే అది సైన్యం పడగ నీడ నుంచి బయటపడాలి. అటువంటి మంచి పరిణామాన్ని సాధించగల ధృడమైన నాయకత్వం రావాలి. దానిని ప్రజలే స్వయంగా తీసుకురాగలగాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)*

# ప్రకృతి అనంతత్వం

**యు. ఎ. ఖారిన్** *రచించిన 'ఫండమెంటల్స్ ఆఫ్ డయలెక్టిక్స్' పుస్తకం లోని మూడవ అధ్యాయం రెండవ ఉపశీర్షిక : అనువాదం - రాజేంద్ర బాబు అర్విణి*

పదార్థాన్ని గురించిన శాస్త్రీయ విజ్ఞానం ఎల్లప్పుడూ అభివృద్ధి చెందుతూనే ఉంటుంది. ఇంకా లోతుగా అన్వేషణ కొనసాగుతూనే ఉంటుంది. మన చుట్టూ ఉన్న ప్రపంచం గురించిన మన అభిప్రాయాలు, వస్తుగత వాస్తవం ఆకృతి – ఇవి రెండు భిన్నంగా ఉంటాయి. వాటి మధ్య భిన్నత్వం స్పష్టంగా అగుపిస్తూ ఉంటుంది. వస్తుగత ప్రపంచపు అనంతత్వం, నిరంతరం చలనంలో ఉండే విషయాన్ని పదార్థానికి సంబంధించిన సైద్ధాంతిక పునాది విశద పరుస్తుంది. ఈ విషయానికి సంబంధించి లెనిన్ తన అభిప్రాయాన్ని ఈవిధంగా తెలియపర్చాడు: "వస్తువుల అసలు 'సారం' లేదా 'సారాంశం' కూడా సాపేక్షికమే; అది వస్తువులను గురించి మనిషికి ఉన్న జ్ఞానం ఎంత అన్నది తెలియ పరుస్తుంది; నిన్నటి రోజు ఈ జ్ఞాన సమీకరణ పరమాణువును దాటి పోలేదు, కానీ ఈ రోజు విద్యుత్కణం, ఈథర్ దాక వెళ్లింది, వాటికి మించి వెళ్లలేక పోతున్నది. కాబట్టి, గతితార్కిక భౌతిక వాదం మానవ జాతికి చెంది, ఎల్లప్పుడూ అభివృద్ధి చెందుతూ ఉన్న శాస్త్రీయ పరిజ్ఞానం సమకూర్చుకున్న ప్రకృతి గురించిన జ్ఞాన సంపదలోని ఈ మైలురాళ్ల సాపేక్ష, శాశ్వతం కాని, ఇతర లక్షణాలను రమారమి అంచనా వేస్తుంది. పరమాణువు లాగే విద్యుత్కణం (ఎలెక్ట్రాన్) కూడా సదా చలనంలో ఉండి ఎప్పుడూ మార్పుకు లోనవుతూ ఉంటుంది. ప్రకృతి అనంతమయినది...." (వి.ఐ. లెనిన్, 'మెటీరియలిజం అండ్ ఎంపిరియో–క్రిటిసిజం' కలెక్టెడ్ వర్క్స్, సంపుటి 14, పేజీ 262). ఈ మధ్య వరుస దశాబ్దాలలో ఆధునిక శాస్త్రీయ విజ్ఞానం సాధించిన ప్రగతిని పరిశీలిస్తే ఈ అభిప్రాయం చాల సరియైనది అని రుజువవుతోంది.

ఉదాహరణకు, పరమాణువును తరచి తరచి శోధిస్తే 300కు పైగా మౌలిక రేణువులు ఉన్నాయన్న సంగతి బయటపడింది. వాటిల్లో కొన్ని స్థిరమయినవి, కాని అధికసంఖ్యాకంగా ఉన్న మరికొన్ని రేణువులు అనుస్పందించే కణాలుగా ఉండి ఎక్కువగా అస్థిరంగా ఉండేవి. గడుస్తున్న ప్రతి సంవత్సరం సరికొత్త సూక్ష్మ కణాలను కనిపెడుతూ ఉన్నారు.

ఈ సూక్ష్మ కణాలు నిజంగా తరగని రీతిలో ఎల్లప్పుడూ మార్పు చెందుతూనే ఉంటాయి. అవి, రాశిని కలిగి ఉండి, ఎప్పుడూ సన్నద్ధంగా ఉండి, అయస్కాంత శక్తి కలిగి ఉంటాయి. వాటికి ఒక నిర్మాణం ఉంటుంది. ఎప్పటికప్పుడు సూక్ష్మ కణాలుగా మార్పు చెందే సామర్థ్యం, ఇంకా ఇలాంటి లక్షణాలు కలిగి ఉంటాయి. సూక్ష్మకణం దానికదే పదార్థం విభజింపరాని 'మౌలిక' రేణువులాగా అగుపడదు. అది పరమాణువు మూలకేంద్రపు సారం కంటే రెండు మూడు రెట్లు ఎక్కువ సాంద్రత కలిగి, బయటకు చొచ్చుకు వచ్చిన పదార్థపు ముద్ద అని ఆధునిక శాస్త్ర విజ్ఞానం అభిప్రాయపడుతోంది. ప్రోటాన్, న్యూట్రాన్ లకు సంక్లిష్టమయిన నిర్మాణం ఉంటుంది. మిగతా రేణువుల నిర్మాణానికి సంబంధించి ప్రస్తుతం మనకున్న అరకొర జ్ఞానంతో కొంత మాత్రమే ఊహించగలం.

రేణువుల సఖ్యతను, రేణువుల మధ్య విభేధాన్ని నిర్ధారించడం పదార్థపు ఉనికిని, పదార్థానికి ఉన్న వివిధ రూపాలను వ్యక్తపరచడంలో ముఖ్యమయిన అంశం. ప్రతి ప్రాథమిక రేణువుకు దానికి విరుద్ధ లక్షణాలు గలిగిన ఒక వ్యతిరేక రేణువు ఉంటుంది అని పరిశోధనల ద్వారా కనుగొన్నారు. ఉదాహరణకు, ఎలెక్ట్రాన్‌తో పాటు ఒక 'పోసిట్రాన్' (అంటే అనుకూల శక్తి గలిగిన ఎలెక్ట్రాన్) ఉంటుంది. పరమాణు సంబంధిత రేణువులయిన ప్రతి ప్రోటాన్, న్యూట్రాన్‌తో పాటు ప్రోటాన్‌కు, న్యూట్రాన్‌కు వ్యతిరేక లక్షణాలు కలిగిన ప్రోటాన్, న్యూట్రాన్ లు కూడా ఉంటాయి. 'వ్యతిరేక పదార్థం'తో కూడిన మొత్తం పరమాణువులు కూడా ఉండవచ్చు. 'వ్యతిరేక పదార్థం' అంటే వ్యతిరేక లక్షణాలతో కూడి ఉండి సాధారణ 'పదార్థానికి' భిన్నంగా ఉన్న ఒక ప్రత్యేకమయిన పదార్థ రూపం.

భౌతిక క్షేత్రాలకు సంబంధించి మన అభిప్రాయాలలో కూడా కచ్చితమయిన మార్పు వచ్చింది. విద్యుదయస్కాంత క్షేత్రంతో పాటు గురుత్వాకర్షణ శక్తికి సంబంధించిన కార్యరంగం, పరమాణు సంబంధిత క్షేత్రం, ఎలెక్ట్రాన్–పోసిట్రాన్ లాంటి ఇతర క్షేత్రాలు కూడా భౌతిక ప్రక్రియలలో ప్రధాన పాత్ర వహిస్తాయన్న సంగతి తెలియ వచ్చింది. భౌతిక క్షేత్రాలకు పదార్థానికి మధ్య సరిహద్దు కనిపించినంత స్పష్టమయినది కాదని కూడా కనుగొన్నారు. క్షేత్రాలు, పదార్థం ఒకదానితో ఒకటి పరస్పరం సంబంధంలో ఉండి ప్రభావితం చేసుకుంటాయి, ఒకదానిలోకి ఒకటి మార్పు చెందుతాయి. అయితే అది సూక్ష్మ స్థాయిలో జరుగుతుంది. అణువులో అంతర్గతంగా జరిగే ఈ ప్రక్రియ వల్ల పదార్థానికి క్షేత్రానికి మధ్య ఉండే ప్రత్యేకతకు అర్థం లేకుండా పోతుంది.

ఆ విధంగా, పదార్థం అన్న భావనను దాని వాస్తవ రూపానికి ఉన్న లక్షణాలకు మాత్రమే పరిమితం చెయ్యడంలో ఉన్న లోపాన్ని ఆధునిక సైన్స్ బహిర్గతం చేసింది. ప్రత్యేకమయిన భౌతిక ఘటనలను

కొత్తగా కనుగొంటున్న సందర్భాలలో వాటిని తరచుగా భావవాదంగా భావిస్తున్న ఈ సందర్భంలో ఈ విషయాన్ని ప్రత్యేకంగా నొక్కి చెప్పాల్సిన అవసరం ఉంది. ఉదాహరణకు, పదార్థం నశించి పోయిందని, అది భౌతిక రూపం లేని శక్తిగా మారిపోయిందని ఆధునిక భావవాదులు తాము నమ్ముతున్న సిద్ధాంతాన్ని నొక్కి చెప్పటానికి ఈ మార్పును ఆసరాగా వాడుకుంటున్నారు. అయితే పదార్థం నశించి పోయిందన్న వారి వాదన సరి అయినదేనా? ఆ మార్పు లేదా పరివర్తన ఒక రకమయిన పదార్థం నుండి మరొక క్షేత్రానికి మారుతున్నదిగా పరిగణించాలి. అది 'పదార్థం నాశనం అయిపోయినది'గా భావించగూడదు. మరొక రూపానికి మారుతున్నది. అంతే! కాబట్టి వివిధ రకాలయిన పదార్థం మధ్య ఉండే సరిహద్దులు సాపేక్షికమే. పదార్థానికి ఉన్న భిన్న రూపాలు కొన్ని ప్రత్యేక భౌతిక లక్షణాలు కలిగి ఉన్నప్పటికీ వాటిని మొత్తంగా వస్తుగత వాస్తవంగా పరిగణించటం సరికాదు.

సూక్ష్మ ప్రపంచ దర్శనం ద్వారా ఎప్పటికీ తరగని వస్తుగత వాస్తవం బహిర్గతమవుతుంది. అంతరాళ జ్ఞానం వలన సూక్ష్మ ప్రపంచం బహిర్గతమవుతుంది. సౌరకుటుంబంలో మన భూమి కూడా ఒక గ్రహం. అసంఖ్యాకంగా ఉన్న లక్షలాది నక్షత్రాలు గల పాలపుంతలో సూర్యుడు కూడా ఒక నక్షత్రమే. మెటాగెలాక్సీలో పాలపుంత ఒక చిన్న భాగం మాత్రమే. మెటాగెలాక్సీ అంటే విశ్వంలో గమనించటానికి వీలు గలిగిన విస్తృత ప్రదేశంలో తిరుగాడే నక్షత్ర సంబంధమయిన వ్యవస్థల సమూహం. (మన గమనికలో లేని ప్రదేశం ఎంత ఉందో మనకు తెలియదు). వాస్తవంగా విశ్వంలో దూరాలు మరీ ఎక్కువగా ఉంటాయి. అంతరిక్ష శ్రేణులు ఆకర్షణీయంగా ఉండడం మాత్రమే కాదు, విశ్వంలోని సువిశాల ప్రదేశంలో జరిగే వివిధ ఘటనల బహురూపత కూడా అద్భుతంగా ఉంటుంది. కృష్ణ బిలాలు (బ్లాక్ హెూల్స్), క్వాసార్లు, పల్సర్లు లాంటి కొత్త విషయాలు గుణాత్మకమయిన రీతిలో అంతరిక్షంలో కనుగొనబడ్డాయి. వాటి గురుత్వాకర్షణ క్షేత్రం ఎంత శక్తివంతమయినదంటే వాటి నుండి కిరణ ప్రసరణ (రేడియేషన్) ఉండదు, రేణువులు ఉండవు.

భవిష్యత్తులో సైన్స్‌కు అద్భుతమయిన ప్రాకృతిక విషయాలు ఎన్ని ఎదురయినా, దానికి ఒకే ఒక్క అర్థం: పదార్థం గురించి కొత్త విషయాలు బయట పడుతున్నాయంటే పదార్థం రూపంలో, గుణాలలో అసంఖ్యాకంగా భిన్నత్వం ఉంది, అది అనంతం, ఎల్లప్పుడూ తరగ కుండా ఉంటుంది అని అర్థం.

**పదార్థం నిర్మాణం**

మనకు అందుబాటులో ఉన్న ప్రకృతి అంతా ఒక పెద్ద వ్యవస్థ, ఈ వ్యవస్థలో మొత్తం పదార్థాలు ఒకదానికొకటి సంబంధం కలిగి ఉంటాయి, ఈ పదార్థాల వలననే మనం నక్షత్రాల నుండి అణువుల దాక విస్తరించివున్న భౌతిక జగత్తు ఉనికిని అర్థం చేసుకోగలం.
– ఎంగెల్స్



# ప్రభుత్వ నిర్లక్ష్యానికి బలైన ఉప్పుగంటి నిర్మల

**- ఫెలో ట్రావెలర్**

నిర్మల (ఉప్పుగంటి కృష్ణకుమారి) ఏప్రిల్ 9న ముంబై వెస్ట్ బాంద్రాలోని శాంతి ఆవేదన హాస్పైస్ కేర్ సెంటర్‌లో చనిపోయింది. ఆమె తన సహచరుడు రాణి సత్యనారాయణ (కిరణ్) తో పాటు 2019లో అరెస్టయింది. అప్పటికే ఆమె చాలా కాలంగా నాలుగవ దశ చేరుకున్న క్యాన్సర్‌తో హైదరాబాద్‌లో చికిత్స చేయించుకుంటున్నది. బహుశా సికిందరాబాదులో ఒక ఇంట్లో ఉండి చికిత్స చేయించుకుంటున్న సందర్భంలోనే ఇంటి మీద దాడి చేసి అరెస్టు చేసి ఉంటారు. గానీ కాళేశ్వరం సిరొంచ దగ్గర ప్రాణహిత దాటి మహారాష్ట్రలో ప్రవేశిస్తున్నప్పుడు అరెస్టు చేసినట్లు, వాళ్ల దగ్గర విప్లవ సాహిత్యం, ఎనిమిది లక్షల రూపాయలు దొరికినట్లు పోలీసులు ప్రకటించారు.



ఒక వారం రోజుల పాటు తెలంగాణ మహారాష్ట్ర ఇంటెలిజెన్స్ పోలీసు అధికారులు ఆమెను సరెండర్ ప్రకటన ఇస్తే ఆసుపత్రిలో చేర్చి తామే మెరుగయిన చికిత్స చేయిస్తామని చెప్పినా వినలేదని కూడా చెప్పారు. ఆమె సహచరుడు సత్యనారాయణ మీద కూడా ఏమీ కేసులు రెండు రాష్ట్రాల్లోనూ లేవని, ఆమెను సరెండర్‌కు ఒప్పించమని బలవంత పెట్టారట. ఈ ప్రయత్నాల్లో విఫలమై ఆ కాలంలోనే గడ్చిరోలీలో జరిగిన ఒక దాడి (ఆంబుష్) లో పదిహేను మంది సిఆర్‌పిఎఫ్ జవాన్లు చనిపోయిన కేసులో ఇద్దరినీ ముద్దాయిలుగా చూపి ఆయనను ఆర్థర్ రోడ్ జైలుకు, ఆమెను బైకుల్లా జైలుకు (రెండూ ముంబైలోనే ఉన్నాయి) పంపించారు. ఎందుకంటే ఈ గడ్చిరోలి దాడి (ఆంబూష్) విచారణను ముంబైలో ఉన్న కేంద్ర ప్రభుత్వ ఎన్ఐఎ చేపట్టింది. ఈ మూడేళ్ల కాలంలో ఆమెను ఇంకా జీవించే అవకాశం లేదని తక్కువ బాధతో మరణించడానికి హైకోర్టు ఆదేశాలతో హాస్పైస్ కేర్ సెంటర్‌కు మార్చే నాటికి ఆమె రొమ్ము క్యాన్సర్ శరీరంలోని అన్ని అవయవాలకు విస్తరించింది. ఆ స్థితిలో, అంటే మరణించడం తథ్యమని నిర్ధారణ అయ్యాక గాని హైకోర్టు ఆదేశాలపై చేర్చడాన్ని ప్యాలియేటివ్ కేర్ కోసం చేర్చడమంటారు.

అప్పటి దాకా ఎన్ఐఎ గానీ, రాష్ట్ర ప్రభుత్వం గానీ, జైలు అధికారులు గానీ అమెను ముంబైలో ఏ ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్చి అయినా చికిత్స చేయించడానికి ప్రతయత్నించలేదు. తీవ్రమైన నొప్పి కలిగినపుడు భారీ బందోబస్తుతో ఆసుపత్రికి పంపించి మళ్లీ జైలు లాకప్‌కే తెచ్చేవారు. గుండెలో చిల్లు పడిన కాంచన్ నన్నావరే విషయంలో జైలు, ప్రభుత్వ నిర్లక్ష్యం, హైకోర్టు జాప్యం ఆమె ప్రాణాలు కూడా తీసిన వైనం మనం ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి. కాంచన్ సహచరుడు కూడా ఆమెతో పాటు అయిదేళ్లుగా ఎరవాడ జైల్లోనే ఉన్నాడు. ఆమె ఎరవాడ మహిళా జైల్లో ఉన్నది. ఆమెకు పూనే ససూన్ ఆసుపత్రిలో శస్త్ర చికిత్స జరిగి విఫలమై ఆమె మరణిస్తే ఆమెను ఎరవాడ జైలులోనే ఖననం చేసి విషయం కూడా సహచరుడు అమర్ బెల్కేకు తెలుపలేదు.

హైదరాబాద్‌కు పోతుంటే సిరొంచ (మహారాష్ట్ర తెలంగాణ సరిహద్దు జిల్లా కేంద్రం) దగ్గర 12 జూన్ 2014న అరెస్టు చేసినట్లు మీడియాకు చెప్పిన పోలీసు అధికారి తాము 24 గంటలకే అరెస్టు చూసి కోర్టులో హాజరు పరుస్తున్నట్లు మీడియాకు చూపడానికి ఆ 24 గంటలు కూడా తాము క్యాన్సర్ నాలుగవ దశలో ఉన్నదని, లొంగిపోయినట్లు ప్రకటిస్తే ప్రభుత్వం చికిత్స చేయించి ఇరువురికీ పునరావాసం కల్పిస్తుందని ఒప్పించడానికే పట్టిందని, కాని ఆమె మొండికేయడం వల్లనే అరెస్టు చూపి కోర్టులో హాజరుపరిచి జైలుకు పంపిస్తామని మీడియాకు చెప్పాడు.

భీమా కోరేగావ్ ఎల్గార్ పరిషత్ కేసును పూనే పోలీసుల నుంచి కేంద్ర ప్రభుత్వ ఎన్ఐఎ చేపట్టి ముంబై ఎన్ఐఎ కోర్టుకు మార్చి ఎరవాడ జైలు నుంచి ముద్దాయిలను 2020 ఫిబ్రవరి 28, 29 తేదీలలో ఆర్థర్ రోడ్ జైలు అండా సెల్‌లో ఉంచి మార్చ్ 1న తలోజా జైలుకు మార్చారు. ఆ సందర్భంగా అండా సెల్‌లోనే ఉన్న సత్యనారాయణ (కిరణ్) తమను సికిందరాబాద్ అల్వాల్‌లోని తమ డెన్‌లోనే తెలంగాణ ఇంటెలిజెన్స్ సహాయంతో మహారాష్ట్ర పోలీసులు అరెస్టు చేశారని చెప్పాడు. అందువల్లనే ల్యాప్‌టాప్‌లు, చికిత్స కోసం సమకూర్చుకున్న డబ్బు, సాహిత్యం అంతా స్వాధీనం చేసుకున్నారని చెప్పాడు. తమను కలిసి, విడివిడిగా కూడా వారం రోజులు వివిధ స్థాయిల్లోని రెండు రాష్ట్రాల పోలీసు అధికారులు కూడా ప్రశ్నించారని వారం రోజులు ప్రయత్నించినా ఆమె లొంగిపోవడానికి అంగీకరించడం లేదని, తన మీద రెండు రాష్ట్రాల్లో కూడా కేసులు లేవు గనుక తాను ఆమెను అందుకు ఒప్పిస్తే తనను వదిలేసి ఇద్దరినీ ఇలాగే ఇదే గదిలో ఉండడానికి కూడా ఏర్పాటు చేసి ఆమెకు చికిత్స చేయిస్తామన్నారని, ఆమె అభిప్రాయాన్ని గౌరవిస్తూ ఆమోదిస్తున్నానని చెప్పానని, అందుకే ఈ గడ్చిరోలి అంబుష్ కేసులో తనను పెట్టారని చెప్పాడు.

2018 ఆగస్టు – నవంబర్ మధ్య కాలంలోనే ఆమె చికిత్స కోసం వాళ్లిద్దరు హైదరాబాదుకు వచ్చి చికిత్సకు, కీమో థెరపీకి పోతూ అక్కడ ఉన్నట్లున్నారు. దాదాపు పది నెలల వ్యవధి గనుక పోలీసులకు తెలిసిపోయినట్లున్నది.

ఇంత వివరణ ఎందుకు అవసరమవుతున్నదంటే లొంగిపోతే ఇంత ఔదార్యం, సహకారం అందిస్తానన్న పోలీసులు, ప్రభుత్వం కేసును గడ్చిరోలి పోలీసులు, కోర్టు నుంచి కేంద్రం ఎన్ఐఎకి బదిలీ చేసి ముంబైలోని ఎన్ఐఎ కోర్టు విచారణకిచ్చింది. రెండు సంవత్సరాలు జైలు నుంచే చికిత్సకు ప్రభుత్వాసుపత్రికి తీసుకపోయింది కానీ క్యాన్సర్ చికిత్సకే ప్రత్యేకమైన ఏ సుప్రసిద్ధ అసుపత్రిలోనూ చికిత్స చేయించలేదు.

ఇంక రొమ్ము క్యాన్సర్ శరీరావయవాలకంతా విస్తరించి, ఏ చికిత్స ఆమెనిక బతికించదని తెలిశాక గానీ అది కూడా బొంబాయి హైకోర్టు

లాయర్ యుగ్ మోహిత్ చౌధురీ జోక్యం చేసుకొని వాదించడంతో ఆమెను హాస్పైస్ కేర్ సెంటర్‌కు 2021 డిసెంబర్‌లో మార్చారు. బైకుల్లా జైలులో ఉన్న ఆమెతో ఆర్థర్ రోడ్ జైల్లో ఉన్న సహచరుడు సత్యనారాయణకు ములాఖత్‌లకు, ఫోన్‌లో మాట్లాడడానికి 2022లో ఇటీవలి కాలం వరకు కూడా అనుమతి ఇవ్వలేదు. ఇంక బహుశా రోజులు, గంటల్లోనే ఆమె మరణిస్తుందని స్పష్టమయ్యాక అది కూడా ఆమె లాయర్ పయోషీ రాయ్ పిటిషన్‌కు బొంబాయి హైకోర్టు స్పందించి ఏప్రిల్ 7 గురువారం మాధ్యాహ్నం 3 గంటల నుంచి 5 గంటల దాకా, శుక్ర శనివారాలు ఉదయం 9.30 నుంచి సాయంత్రం 5 గంటల వరకు ఆమె దగ్గర ఉండడానికి ఎస్కార్ట్ ద్వారా ఆర్థర్ రోడ్ జైలు నుంచి తీసుకపోవడానికి ఆదేశించింది.

ఆ ఆదేశాలు గురు, శుక్రవారాలు, ఏప్రిల్ 7, 8 తేదీలు ఏ మేరకు పాటించారో కానీ, ఆమె శనివారం, ఏప్రిల్ 9 ఉదయం 10.30 మరణిస్తే ఎస్కార్టు పోలీసులు ఆయనను 11 గంటలకి అక్కడకి తీసుకవచ్చారు. ఆ ఉదయం హైకోర్టు ఆదేశాల ప్రకారం 9.30కి తీసుకొచ్చి ఉంటే ఆఖరి క్షణాలు ఒక గంటసేపు ఆయన ఆమె చెంత ఉండగలిగేవాడు.

ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత 1970ల చివరి రోజుల్లో ఏర్పడిన స్నేహం, ప్రేమ, ఆ ఇద్దరూ 1985లో సహజీవనాన్ని ఎంచుకోవడానికి దారితీసింది. అక్కడ నుంచి కిరణ్ అజ్ఞాత జీవితం, 90ల నుంచి ఆమె అజ్ఞాత జీవితంతో ప్రభాత్ పత్రిక, ఇతర విప్లవ సాహిత్య ప్రచురణలో ఎంతకాలం వాళ్లకు కలిసి పనిచేసే అవకాశం లభించిందో కానీ, ఆయన విప్లవ సాహిత్య ప్రచురణల్లోనే కొనసాగుతూ ఆమె గడ్చిరోలి జిల్లా పార్టీ నిర్మాణ, పోరాట బాధ్యతల్లో అంచెలంచెలుగా ఎదిగి అమరుడు మిళింద్‌కు దోడుగా దండకారణ్య స్పెషల్ జోనల్ కమిటీ కార్యదర్శి వర్గంలో భాగమైంది. నిర్మల గానూ, అనురాధా గాంధీ అమరత్వం తర్వాత నర్మద గానూ దండకారణ్య క్రాంతికారి మహిళా సంఘటన్ సభ్యురాలు గానూ, గడ్చిరోలీ విప్లవోద్యమ నాయకురాలు గానూ బహుముఖీన ప్రతిభా సామర్థ్యాలను నిరూపించింది. రాజకీయ, నిర్మాణ, సైనిక, మహిళా, సాహిత్య రంగాలలో తనదైన ప్రభావాన్ని నెరపింది. బహుశా ఇంత సుదీర్ఘ కాలం గడ్చిరోలీ ఆదివాసీ ప్రజలకు ఇంత సమగ్ర నాయకత్వాన్ని ఇచ్చిన వారిలో మిళింద్ తర్వాత పేర్కొనదగిన పేరు ఆమెదే.

బహుశా అందుకేనేమో ప్రొఫెసర్ జి.ఎన్. సాయిబాబా, జర్నలిస్టు ప్రశాంత్ రాహీ, జెఎన్‌యు సాంస్కృతిక కార్యకర్త హేమ్ మిశ్రా, మహేశ్, పాండు, విజయ్ టిర్కీలతో కలిపి పెట్టిన గడ్చిరోలీ – అహిరి కేసులో ఆమెను ముద్దాయిగా చూపకున్నా కేంద్ర స్థానంలో ఉంచారు. మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శి ఢిల్లీ నుంచి సాయిబాబా, హేమ్ మిశ్రాల ద్వారా ఒక లేఖను నర్మదకు పంపడానికే గడ్చిరోలీకి పంపించాడని, గడ్చిరోలీ కేసులో ఆరోపించారు.

ఇంక ఎల్గార్ పరిషత్ భీమా కోరేగావ్ కేసును 2020 జనవరిలో ఎన్ఐఎ తీసుకున్న తర్వాత ఇచ్చిన సప్లిమెంటరీ చార్జిషీట్లన్నీ మిళింద్ తెల్‌తుంబ్డే చుట్టూ తిరిగాయి. ముఖ్యంగా ఆయనకు సోదరుడు ఆనంద్ తెల్‌తుంబ్డేకు ఉన్న రాజకీయ నిర్మాణ సంబంధాల ఆరోపణలు చూపడానికే. అట్లాగే కబీర్ కళామంచ్ సాంస్కృతిక కళాకారులకు ఇరవై రోజులు గడ్చిరోలీ అడవుల్లో సైనిక శిక్షణ ఇచ్చాడని. ఒక విధంగా ఎన్ఐఎ ఈ కేసు తీసుకున్నాక అమరుడు మిళింద్ ఇందులో ప్రధాన నిందితుడయ్యాడు. నర్మదను ఈ కేసులో ముద్దాయిగా చూపనప్పటికీ ఆమె ల్యాప్‌టాప్‌ల నుంచి, ఆమె దగ్గర దొరికిన సాహిత్యం నుంచి ఫొటోలను, సమాచారాన్ని చాల వరకు ఈ చార్జిషీట్‌లో పెట్టారు.

అంతకు ముందే 2016లో సూర్జాఘడ్ గనుల త్వకాల బడా కాంట్రాక్టర్‌కు చెందిన టిప్పర్ల దహనం కేసులో నర్మదను ప్రధాన నిందితురాలుగా చూపారు. ఇటువంటి ప్రతీ చర్య, సంఘటనల్లో నర్మదను ప్రధాన నిందితురాలుగా చూపడం ఒక రివాజయింది.

ఈ విధంగా నర్మద అదే ఎన్ఐఎ కోర్టులో స్వయంగా గడ్చిరోలీ ఆంబుష్‌లో నిందితురాలుగానే ప్రధానంగా కాకుండా ఆమెను మిళింద్‌తో పాటు ఎల్గార్ పరిషత్ కేసు నిందితులపై కూడా ఎన్ఐఎ చూపుతున్నది. ఇట్లా బాదరాయణ భావ సంబంధం ఒక విధంగా నలభై ఏళ్లుగా కొనసాగుతున్నది. ఇంక ఆమెను బైకుల్లా జైల్లో మహిళా జైల్లో ఉంచడం వల్ల అక్కడ ఎల్గార్ పరిషత్ కేసులో ముద్దాయిలుగా ఉన్న షోమాసేన్, సుధా భరద్వాజ్, (బెయిల్‌పై విడుదలయ్యే డిసెంబర్ 2021 దాకా) ప్రత్యక్ష అనుబంధంలో ఉన్నారు. ఈ ఇద్దరూ, వీరిలో 2018 జూన్ 6 నుంచే షోమాసేన్ ఎరవాడ జైల్లో కాంచన్ నానవరేతో ఉన్నందున ఆమె రాజకీయ దృఢ నిబద్ధత గురించి, గుండెకు చిల్లుబడి అనుభవించిన తీవ్ర అనారోగ్య వేదన గురించి, ఆమె వ్యక్తిత్వం గురించి ఎంతో భావోద్వేగంతో విషయ విశ్లేషణతో రాసి ఉన్నది.

అట్లాగే అప్పటికి ఐదేళ్లకు పైగా ఎరవాడ జైల్లో ఉన్న ఆమె సహచరుడు అరుణ్ బెల్కే తనకు తెలపకుండా ఆమెను శస్త్ర చికిత్సకు పంపించి ఆమె మరణించింది కూడా చెప్పకుండా ఖననం చేసి ఆ తర్వాత తెలిసిన దానిమీద కూడా వివరంగా హైకోర్టులో వేసిన పిటిషన్ ప్రచారమైంది.

ఇంకా తలోజా జైలు కష్టడీలో, హోలీ ఫ్యామిలీ హాస్పిటల్లో స్టాన్‌స్వామి మరణం గురించి ప్రపంచమంతా మాట్లాడుతూనే ఉన్నది. జెసూయిట్‌ల తరపున ముంబైలో ఫాదర్ ఫ్రేజర్ ఆయన మృతదేహాన్ని తీసుకోవడమే కాకుండా బొంబాయి హైకోర్టులో ఆయన జుడిషియల్ కష్టడీ మరణంపై వేసిన పిటిషన్, అట్లాగే ఆయనపై ఎన్ఐఎ పెట్టిన టెర్రరిస్ట్ ఆరోపణల య మచ్చ తొలగించాలని వేసిన పిటిషన్‌ల పై సీనియర్ న్యాయవాది మిహిర్ దేశాయ్ వాదనలు ప్రారంభించాడు.

మహారాష్ట్ర జైళ్లలో నర్మద మరణం ఒక సంవత్సర కాలంలో రాజకీయ ఖైదీల్లో మూడవది. ముంబైలో ఎన్నో క్యాన్సర్ ఆసుపత్రి ఉండి కూడా రెండు సంవత్సరాలకు పైగా నిర్మల రొమ్ము క్యాన్సర్ అన్ని అవయవాలకు విస్తరించి మరణానికి దారితీసే స్థితి రావడం పూర్తిగా జైలు, రాష్ట్ర ప్రభుత్వం, ఎన్ఐఎ కేసు కాబట్టి కేంద్ర ప్రభుత్వం బాధ్యత పడవలసిందే. ఇలా మరణించిన ముగ్గురు మావోయిస్టు నిందితులుగా చూపబడినవారే. ముగ్గురు అండర్ ట్రయల్సే. ఇద్దరు మహిళా ఖైదీల సహచరులు ఇద్దరూ కూడా ఇంకా నిందితులుగా జైళ్లలోనే ఉన్నారు. అరుణ్ బెల్కే తన సహచరి మరణం గురించి బొంబై హైకోర్టులో వేసినట్లే నిర్మల మరణ సమయంలో తనను అక్కడికి తీసుకుపోనందుకు మాత్రమే కాదు రెండు సంవత్సరాల నిర్లక్ష్యానికి బాధ్యత వహించాల్సిందిగా కస్టోడియల్ మరణంపై బొంబాయి హైకోర్టులో పిటిషన్ వేయడానికి సత్యనారాయణ (కిరణ్) కు ప్రజాస్వామిక సమాజం, ముఖ్యంగా తెలుగు సమాజం నైతిక సమర్థన ఇవ్వాలి.

మావోయిస్టులుగా ఆరోపింపబడిన ఖైదీలను జైళ్లలో చంపే ఒక పథకం ఎన్ఐఎ, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు మహారాష్ట్రలో రచించడానికి ఒక ఏడాదిలోనే మూడు అసహజ మరణాలు కారణమా అని బొంబాయి హైకోర్టు విచారించాలి. వీ

# చిరస్మరణీయుడు సాయినాథ్

**– ఉస్మానియా మెడికల్ కాలేజి పూర్వ విద్యార్థి**

డాక్టర్ చెరువుపల్లి సాయినాథ్ ఉస్మానియా మెడికల్ కాలేజిలో చదువుతుండగా విప్లవ రాజకీయాలతో ప్రభావితుడయ్యాడు. ఆయన 1973లో ఎంబిబిఎస్‌లో చేరాడు. ఆ సమయంలో ఉస్మానియా మెడికల్ కాలేజీలో నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలతో ప్రభావితులైన విద్యార్థులు బలమైన శక్తిగా పని చేస్తున్నారు. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం వెలుగులో అధ్యయనం చేస్తూ తోటి విద్యార్థులను సామాజిక, ఆర్థిక సమస్యలపై చైతన్యవంతులను చేస్తుండేవారు. కళాశాల మ్యాగజైన్‌లో వ్యాసాలు రాసేవారు. మితవాద విద్యార్థి గూండాల ఆగడాలను అరికట్టటానికి పోరాడుతుండే వారు. మెడిసిన్ మూడవ సంవత్సరం చదువుతుండగా, 1975లో, డాక్టర్ వేణుగోపాల్, డాక్టర్ రవీంద్రనాథ్ సూరిలతో కలిసి సాయినాథ్ విప్లవోద్యమంలో పూర్తికాలం పనిచేయటానికి చదువు వదిలి అజ్ఞాతవాసంలోకి వెళ్లాడు. ఆ ముగ్గురూ స్టెతస్కోప్‌లు, గ్రేస్ అనాటమీ పుస్తకం అమ్మేసి (వాటి అవసరం ఇక లేదనుకుని) ఆ డబ్బు పట్టుకుని సమాజానికి చికిత్స చేయటానికి బయలుదేరారు.



నిజామాబాద్ జిల్లా వాస్తవ్యుడైన సాయినాథ్ ఖమ్మం, కృష్ణా జిల్లాల సరిహద్దు ప్రాంతంలో ప్రజాసమస్యలపై పని చేయటానికి వెళ్లాడు. అక్కడ విప్లవోద్యమ నిర్మాణంలో నిమగ్నమయ్యాడు. గతంలో తెలంగాణ సాయుధ పోరాటంలో కీలకపాత్ర వహించిన ఆ ప్రాంతంలో తిరిగి విప్లవోద్యమాన్ని నిర్మించటంలో చాలా కష్టాలు ఎదురయ్యాయి. అక్కడ పని చేస్తున్న సమయంలోనే ఒక లంబాడి తండాలో బాంబులు తయారుచేస్తుండగా ముక్కు సుబ్బారెడ్డి (రంగన్న) చేతిలో బాంబు పేలింది, అప్పుడు సాయినాథ్ ఆయన పక్కన వున్నాడు, సాయినాథ్ చేసిన సపర్యలతోనే రంగన్న కోలుకున్నాడు.

అజ్ఞాతవాసం నుండి బయటకు వచ్చిన తర్వాత సాయినాథ్ నిజామాబాద్ జిల్లాలో విప్లవ విద్యార్థి సంఘం నిర్మాణం మొదలుపెట్టాడు. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత నిజామాబాద్ జిల్లాలో విద్యార్థి యువజనులను కూడగట్టి పనిచేయటం మొదలుపెట్టాడు. అప్పటికే హైదరాబాద్ కేంద్రంగా రాడికల్ అనే విద్యార్థి పత్రిక మొదలైంది, ఆ పత్రిక కాపీలను నిజామాబాద్‌లో విద్యార్థి యువజనులకు అందిస్తూ వారిని చైతన్యవంతులను చేశాడు. అదే క్రమంలో నిజామాబాద్ జిల్లా రాడికల్ విద్యార్థి సంఘం ప్రథమ మహా సభలు నిర్వహించాడు. ఆ సభలకు సత్యం, అర్వింణి రాజేంద్రబాబులను ఉపన్యాసకులుగా ఆహ్వానించాడు.

ఆ తర్వాత సాయినాథ్ హైదరాబాద్‌లో ఒక ఫార్మాస్యూటికల్ కంపెనీలో పార్ట్నర్‌గా చేరి పనిచేశాడు. కొంతకాలం మౌలాలీలో మెడికల్ షాప్ నడిపాడు. హైదరాబాద్‌లో ఆర్ఎస్‌యు, విరసం సభలు ఏవి జరిగినా హాజరయ్యేవాడు. తర్వాత చాలా సంవత్సరాలకి 1999లో మళ్లీ మెడికల్ కాలేజీలో చేరి ఎంబిబిఎస్ పూర్తిచేసి ఫోరెన్సిక్ మెడిసిన్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసాడు. ఒక డాక్టర్‌గా అవసరంలో వున్న వారికి సరైన వైద్యం అందించటానికి చాలా కృషి చేసాడు. తర్వాత మహావీర్ మెడికల్ కాలేజీలోనూ, హైదరాబాద్‌లోని డెక్కన్ మెడికల్ కాలేజీలోనూ ప్రొఫెసర్‌గా పనిచేశాడు. మహావీర్ మెడికల్ కాలేజీలో పనిచేసే సమయంలో అక్కడి ఉద్యోగుల సమస్యలను పరిష్కరించు కోవటానికి ఒక యూనియన్ అవసరం ఉందని గుర్తించి, ఉద్యోగుల యూనియన్ ఏర్పాటుకోసం కృషిచేసి మార్గదర్శకత్వం వహించాడు. మూడు సంవత్సరాలుగా మహబూబ్‌నగర్‌లోని ఎస్వీఎస్ మెడికల్ కాలేజీలో ఫోరెన్సిక్ ప్రొఫెసర్‌గా పనిచేస్తుండగా లంగ్ ఇన్ఫెక్షన్ సోకి వారం రోజులపాటు ఆసుపత్రిలో చికిత్స పొందుతూ ఏప్రిల్ 9న కన్నుమూశాడు. చనిపోయేనాటికి డాక్టర్ సాయినాథ్ వయసు 66 ఏళ్లు.

డాక్టర్ సాయినాథ్ ఎక్కడవున్నా, ఏ పనిచేస్తున్నా విప్లవ రాజకీయాలను, పోరాటస్ఫూర్తిని గుండెలలో నింపుకున్నాడు. పుస్తకాలు విపరీతంగా చదివేవాడు, తనచుట్టూ జరుగుతున్న జాతీయ, అంతర్జాతీయ మార్పులను గమనిస్తూ విశ్లేషిస్తూ స్నేహితులతో చర్చించేవాడు. నిత్యం సమాజశ్రేయస్సు గురించి ఆలోచిస్తూ, తపనపడుతూ చివరివరకు నిబద్ధతకలిగి నిస్వార్థంగాబతికిన సాయినాథ్ చిరస్మరణీయుడు. వీ

పౌరహక్కుల సంఘం ఉమ్మడి మహబూబ్ నగర్ జిల్లా కోశాధికారి మంతటి వెంకటేశ్వర్లు (45) ఏప్రిల్ 16న గుండెపోటుతో మృతి చెందారు. విద్యార్థి దశలో తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్ కార్యకర్తగా ఉండిన వెంకటేశ్వర్లు ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో పనిచేశారు. ఆర్‌టిసిలో కండక్టర్‌గా పనిచేస్తూ ఆర్‌టిసి కార్మిక సమాఖ్య కార్యకర్తగా ఉన్నారు. పౌరహక్కుల సంఘం కోశాధికారిగా నల్లమలలో యురేనియం, ఆదివాసి చెంచుల సమస్యలపై, దళిత మైనారిటీ సమస్యలపై పనిచేశారు. చనిపోయే ముందు రోజు కూడా చెంచుల పోడు భూమి పోరాటానికి మద్దతు తెలపడానికి చెంచుపెంటకు వెళ్లారు. కుటుంబ ఆర్థిక సమస్యలతో పాటు, కొవిడ్ బారిన పడి కొవిడ్ అనంతర ఆరోగ్య సమస్యలతో ఇబ్బంది పడుతుండగా, ఆర్టీసీలో సిబ్బంది మీద యాజమాన్యం పెడుతున్న ఒత్తిడి ఆయన ఆరోగ్యాన్ని మరింత కుంగదీసింది. ఆ ఆందోళన వల్ల కలిగిన గుండెపోటే చిన్న వయసులో మృతికి కారణమైంది.

### తీవ్ర ఆహార సంక్షోభంలో ఆఫ్ఘానిస్తాన్

ప్రపంచంలోని పేద దేశాలలో ఒకటైన ఆఫ్ఘానిసాన్ తాలిబన్ల పాలనలోకి వెళ్లాక ఆర్థిక సంక్షోభం, కరువుతో కొట్టుమిట్టాడుతోంది. అమెరికా తమ ఫెడరల్ బ్యాంకు నుంచి, ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌ల నుంచి ఆఫ్ఘాన్‌కి అందాల్సిన నిధులను స్తంభింపజేయడంతో అక్కడి ప్రజల జీవితాలు చిన్నాభిన్నమయ్యాయి. చేయడానికి పనులు లేక, తినడానికి తిండిలేక ఆహార సంక్షోభంతో ఆకలిచావులు పెరిగిపోయాయి. ప్రజలు తిండి కోసం తమ పిల్లలను, తమ శరీర భాగాలను విక్రయిస్తున్నారు. దేశంలో సగం మందికి పైగా ఆహార సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నారు. ఈ సంవత్సరంలో 97 శాతం మంది దారిద్ర్యరేఖకు దిగువన పడిపోవచ్చని ఆందోళన వ్యక్తం అవుతోంది. మానవతా దృక్పథంలో ప్రపంచ దేశాలు సహాయ సహకారాలు అందించాలని ఐ.రా.స. పిలుపునిచ్చింది.

### చైనాలో ప్రజల తీవ్ర ఆగ్రహం

చైనాలో కరోనా కన్నా, దానివల్ల విధించిన లాక్‌డౌన్‌లోనే జనాలకు ఇబ్బందులు పెరిగాయి. ఆ దేశంలో జీరో కొవిడ్ ఆంక్షలను కఠినంగా అమలు చేస్తుండడంతో ప్రజలు నానా ఇబ్బందులకు గురవుతున్నారు. కొన్ని ప్రాంతాల్లో పరిస్థితి అదుపుతప్పి అల్లర్లు చెలరేగుతున్నాయి. ఆహార పదార్థాల కోసం సూపర్ మార్కెట్లకు ప్రజలు పెద్దసంఖ్యలో వచ్చి అందినకాడికి తీసుకుపోయారు. దాదాపు సిటీలోని అన్ని సూపర్ మార్కెట్లలో సరుకులు నిండుకున్నాయి. షాంఘైలో ఎటు చూసినా ఆకలి కేకలే వినిపిస్తున్నాయి. తినడానికి తిండి లేక, తాగడానికి నీళ్లు కూడా దొరకక రెండున్నర కోట్ల మంది జనం అల్లాడుతున్నారు. లాక్‌డౌన్‌తో ఇళ్లు వదిలే వీలులేదు. ఇంట్లోనేమో సరుకులు నిండుకున్నాయి. ఎలాగో బయటకు వెళ్లినా సూపర్ మార్కెట్లన్నీ ఖాళీగా కనిపిస్తున్నాయి. పిల్లలు, వృద్ధులకు అవసరమైన మందులు కూడా దొరకట్లేదు. దీంతో కరోనా కేసులు పెరుగుతున్నాయని సిటీలో లాక్‌డౌన్ పెట్టిన ప్రభుత్వంపై జనం మండిపడుతున్నారు.

### సూడాన్‌లో ప్రజాస్వామ్య అనుకూల గ్రూపుల నిరసనలు

సూడాన్ దేశాన్ని రాజకీయ సంక్షోభంలోకి నెట్టిన గతేడాది అక్టోబరులోని సైనిక కుట్రను నిరసిస్తూ సూడాన్ ప్రజాస్వామ్య అనుకూల గ్రూపులు సూడానీస్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్, ఫోర్సెస్ ఫర్ ది డిక్లరేషన్ ఆఫ్ ఫ్రీడం అండ్ ఛేంజ్ మార్చి 22న ప్రదర్శనలకు, నిరసనలకు పిలుపునిచ్చాయి. ఆ పిలుపు మేరకు దేశవ్యాప్తంగా పలుచోట్ల వేలాదిమంది ప్రజలు ప్రదర్శనల్లో పాల్గొన్నారు. తక్షణమే పౌర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. సైనిక జనరల్స్‌పై ఒత్తిడి తీసుకువచ్చేలా దాదాపు ప్రతిరోజూ ఎక్కడో అక్కడ సూడాన్ వీధుల్లో నిరసనలు చోటు చేసుకుంటూనే ఉన్నాయి. ప్రజా నిసరనలపై పోలీసులు అణచివేత చర్యలు తీసుకోవడంతో ఇప్పటివరకు 90 మంది మరణించారు. వేలాది మంది గాయపడ్డారు.

### దక్షిణ కొరియా నూతన అధ్యక్షుడుగా యూన్ సుక్ యోల్

దక్షిణ కొరియా అధ్యక్ష ఎన్నికల్లో సంప్రదాయవాది మాజీ ప్రాసిక్యూటర్ యూన్ సుక్ యోల్ విజయం సాధించి ఆ దేశ నూతన అధ్యక్షుడిగా మే 10న బాధ్యతలు చేపట్టనున్నారు. 61 ఏళ్ళ యూన్ సుక్ యోల్, లీజే మ్యూంగ్‌ను స్వల్ప తేడాతో ఓడించారు. కుంభకోణాల చుట్టూ ప్రచారమైన ఈ ఎన్నికల్లో 77 శాతం ఓట్లు పోలయ్యాయి. మూన్ జే అధ్యక్షుడి హయాంలో 2019 నుండి 2021 వరకు దక్షిణ కొరియా ప్రాసిక్యూటర్ జనరల్‌గా పనిచేశారు. ఆ దేశ మాజీ ప్రధానమంత్రి జియూనై హై దోషిగా నిర్ధారించడంలో యోల్ ప్రధాన పాత్ర పోషించారు. యోల్ ప్రచారంలో కొన్ని వివాదాలు కూడా చెలరేగాయి. లింగ సమానత్వ మంత్రిత్వ శాఖను రద్దు చేస్తాననడం స్త్రీ వాదం, మహిళా హక్కులపై తీవ్ర దుమారం లేచింది.

### హంగేరి తొలి మహిళా అధ్యక్షురాలిగా కటాలిన్ నొవాక్

హంగేరి దేశ తొలి మహిళా అధ్యక్షురాలిగా కటాలిన్ నొవాక్ ఎన్నికయ్యారు. ఆమె తన విజయాలన్నీ మహిళల విజయంగా అభివర్ణించారు. ఆ దేశ ప్రధానమంత్రి విక్టర్ ఓర్బన్‌కు ఆమె సన్నిహిత మిత్రురాలు. ఆమె ఆర్థికవేత్త పీటర్ రోనాను ఓడించారు. ఆమె అధ్యక్ష బాధ్యతలు మే 10 తర్వాత చేపట్టనున్నారు. 1977లో షీగ్డ్‌లో జన్మించిన నొవాక్ బుడాపెస్ట్‌లోని నేషనల్ యూనివర్సిటీ ఆఫ్ పబ్లిక్ సర్వీస్‌లో చదివారు. నొవాక్ తన రాజకీయ జీవితాన్ని విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖ సలహాదారుగా 2001లో ప్రారంభించి అనంతరం ఆమె 2012లో మానవ వనరుల మంత్రిగా కేబినెట్ హోదాలో పనిచేశారు. 2014 ఎన్నికల తర్వాత ఫ్యామిలీ అండ్ యూత్ రాష్ట్ర కార్యదర్శిగా, 2017 నుండి 2021 వరకు ఫిడెస్జ్ పార్టీ ఉపాధ్యక్షురాలిగా పని చేశారు.

### సౌదీలో ఒకే రోజు 81 మందికి మరణ శిక్ష అమలు

పలు దేశాలు ఉరి శిక్షలు రద్దు చేసుకుంటుంటే హత్యలు, తీవ్రవాదం వంటి నేరాలకు పాల్పడిన 81 మందికి (సౌదీలు 73 మంది, యెమన్లు ఏడుగురు, సిరియన్ ఒకరు) మార్చి 12న సౌదీ అరేబియాలో సామూహికంగా మరణశిక్ష అమలు చేశారు. సౌదీ చరిత్రలో ఇదే అతి పెద్ద సామూహిక మరణశిక్షల అమలు చర్యగా చెప్పవచ్చు. 1979లో మక్కాలోని దివ్య మసీదును స్వాధీనం చేసుకున్నందుకు దోషులుగా తేలిన 63 మంది తీవ్రవాదులకు 1980 జనవరిలో సామూహిక మరణశిక్ష అమలు చేశారు. తాజాగా అంతకంటే ఎక్కువ సంఖ్యలో సామూహిక మరణశిక్షలను అమలు చేయడం గమనార్హం. ప్రభుత్వ ఆధ్వర్యంలో నడిచే సౌదీ ప్రెస్ ఏజెన్సీ మార్చి 12న మరణశిక్షల గురించి ప్రకటించింది. నిందితుల్లో అల్‌ఖైదా, ఇస్లామిక్ స్టేట్ గ్రూప్ తీవ్రవాదులతో పాటు యెమన్‌లోని హౌతి తిరుగుబాటు దళాల మద్ధతుదారులు ఉన్నట్లు వెల్లడించింది.

### పునరుద్ధరణ సామర్థ్యం కోల్పోతున్న అమెజాన్ అడవులు

ఒక పక్క వాతావరణ మార్పులు, మరోపక్క అడవుల నరికి వేతతో అమెజాన్ వర్షారణ్యం (రెయిన్ ఫారెస్ట్) ఎండిపోతోంది. మానవ తప్పిదాల కారణంగా అమెజాన్ అడవులు రికవరీ అయ్యే అవకాశాలు క్షీణిస్తున్నాయి. దీంతో ఇవి క్రమంగా అడవుల స్థాయి నుంచి సవన్నా (గడ్డి మైదానాలు) లుగా మారిపోనున్నాయి. అమెజాన్ బేసిన్‌లోని వర్షారణ్యం ప్రపంచ వర్షారణ్యంలో సగానికి పైగా ఉంటుంది. గతంలో ఊహించిన దాని కన్నా వేగంగా ఈ అడవులు అంతర్థానం కానున్నాయి. ఇప్పటికే ధృవాల వద్ద మంచు కరగడం, క్షీణిస్తున్న కోరల్ రీఫ్ పర్యావరణ వ్యవస్థలు, అట్లాంటిక్ సముద్ర ప్రవాహాల్లో మార్పులతో ప్రపంచమంతా ప్రమాదం అంచుల్లోకి పయనిస్తోంది.

### ఫ్రాన్స్ అధ్యక్ష ఎన్నికల్లో మాక్రాన్ గెలుపు

2022 ఫ్రాన్స్ అధ్యక్ష ఎన్నికలలో ఇమాన్యుయేల్ మాక్రాన్‌కు 58.55 శాతం ఓట్లు సాధించి ప్రత్యర్థి మెరైన్ లీ పెన్ (41.45 శాతం ఓట్లు) పైన విజయం సాధించారు. మాక్రాన్ రెండో సారి గెలిచినప్పటికి గతంలో సాధించిన ఓట్లకన్నా 8 శాతం తగ్గడం మితవాద నాయకురాలు లీ పెన్ బలపడడం గమనార్హం. వీ

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 246 - May 2022 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/04/2022 ● Postal Regn. No. HD/1100/2020-22

Date of Posting : 29th, 30th

# ఇలా వీక్షణం ఎక్కువ కాలం కొనసాగడం కష్టం!

ఈ సంచిక ఎనిమిది పేజీలు చిక్కిపోయిందని గుర్తించి ఉంటారు. ఖర్చు తగ్గింపులో ఒక భాగం ఇది. క్షీణిస్తున్న ఆర్థిక పరిస్థితితో, నానాటికీ పెరిగిపోతున్న అప్పులతో, నిర్వహణా సమస్యలతో వీక్షణంను కొనసాగించాలంటే ఖర్చు తగ్గింపు కార్యక్రమం ఉధృతంగా అమలు జరపక తప్పడం లేదు. ఐదారు నెలలుగా సిబ్బంది తగ్గింపు, సిబ్బంది జీతాల తగ్గింపు, కార్యాలయ ఖర్చుల తగ్గింపులతో పాటుగా ఇప్పుడు పేజీలను కూడ తగ్గించక తప్పలేదు. ప్రభుత్వ ప్రకటనలు ఆగిపోవడం, కరోనా వల్ల న్యూస్ స్టాల్స్ లో పత్రికల అమ్మకాలు తగ్గిపోవడం, సభలు జరగకపోవడంతో పుస్తకాల అమ్మకాలు లేకపోవడం, అయిపోయిన చందాల పునరుద్ధరణ, కొత్త చందాల చేర్పు లేకపోవడం వంటి అనేక కారణాల వల్ల వీక్షణం ఆదాయం నానాటికీ తగ్గిపోతున్నది. నెలకు యాభై వేల రూపాయల లోటుతో, అప్పులతో వీక్షణం అనుభవిస్తున్న ప్రమాదకరమైన ఆర్థిక స్థితి గురించి ఎప్పటికప్పుడు పాఠకులతో పంచుకుంటూనే ఉన్నాం. ఈ స్థితిలో పత్రికను ఎంతకాలం కొనసాగించగలమో తెలియడం లేదు. మరొకవైపు తెలుగు సమాజానికి ఇటువంటి ఆలోచనాస్ఫోరక పత్రిక చాల అవసరమని, ప్రస్తుత సంక్షోభ స్థితిలో ఆ అవసరం మరింత పెరుగుతున్నదని, పత్రికను ఎట్టి పరిస్థితిలోనూ ఆపగూడదని పాఠకులు, మిత్రులు, అభిమానులు కోరుతున్నారు. పందొమ్మిదిన్నర సంవత్సరాలలో, 245 సంచికలలో, నాలుగున్నర వేల వ్యాసాలతో వీక్షణం ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ పరిణామాలెన్నిటినో విశ్లేషించి పాఠకుల అవగాహనను పెరగడానికి తోడ్పడింది. ఆ మహత్తర కృషి ఆగిపోగూడదని మిత్రులు కోరుతున్నారు.

పత్రిక నిర్వహణ వ్యయం తగ్గించుకోవడంలో భాగంగా ఈ నెల నుంచి ఎనిమిది పేజీలు తగ్గుతున్నాయి. ఇరుగు-పొరుగు, ఈనేల శీర్షికలు ఇక నుంచి ఉండవు. కనీసం రెండు వ్యాసాలు తక్కువ వస్తాయి. ఇది దృష్టిలో పెట్టుకుని రచయితలు కూడ వీలైనంత క్లుప్తత పాటించాలనీ, వ్యాసం నిడివి మూడు పేజీలకు మించగూడదని కోరుతున్నాం.

ఈ గడ్డు కాలాన్ని అధిగమించడానికి అవసరమైన ఆదాయ వనరుల కోసం మరొకసారి మీదగ్గరికి రాక తప్పడం లేదు. పాఠకులలో ప్రతి ఒక్కరూ మరొకరికి పత్రికను పరిచయం చేయండి. ప్రతి చందాదారూ మరొక చందా చేర్పించండి. మీరు ఇవ్వగలిగిన విరాళం ఎంతైనా సరే, వీక్షణం మనుగడకు అది ఉపయోగపడుతుంది. తెలుగు సమాజంలో ఒక అత్యవసరమైన ఈ ప్రయత్నానికి మీ వంతు చేయూత ఇవ్వండి. మీ వీలును బట్టి, మీ శక్తిని బట్టి మీ విరాళం ఎంత స్వల్పమైనా, ఎంత భూరి విరాళమైనా సరే. వీక్షణం మనుగడకు మీ చేయూతనివ్వండి. వీక్షణం చిరకాలం జీవించేందుకు తోడ్పడండి.

## విరాళాలు పంపడానికి వివరాలు

చెక్/డిడి ద్వారా: వీక్షణం, జి1, మైత్రీ రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం. 3, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500029,
ఫోన్ : 73307 95849, ఇమెయిల్ : veekshanam2003@gmail.com,
www.veekshanam.wordpress.com

*ఎలక్ట్రానిక్ ట్రాన్స్‌ఫర్ ద్వారా:*
*Veekshanam, Account No. 013911011002175, Union Bank of India, Gagan Mahal Brach, Hyderabad. IFSC Code: UBIN0801399*
లేదా గూగుల్ పే, పేటిఎం, ఫోన్ పేల ద్వారా 9848577028కు పంపవచ్చు

## 'Save Veekshanam' Campaign

వీక్షణంకు చేయూతనివ్వండి!

If undelivered please return to:

**VEEKSHANAM**
Mytri Residency, 3-6-394, St. No. 3, Himayatnagar, Hyderabad - 500 029.
Phone: 73307 95849

To:
Mr./Mrs.________________

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at NAVYA PRINTERS, 2-3-655/C/16/B, Durga Nagar, Amberpet, Hyderabad -500013 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao